The one and only Magazine devoted to Humor & Music



పేజీలు : 68
వెల : రూ.10

# హాసం

## హాస్య-సంగీత పత్రిక

16-30 నవంబరు 2001

సెంటర్‌స్ప్రెడ్‌లో







పాటల పుస్తకాలు



పత్రికల మనుగడ కలగా
మారుతున్న ఈ రోజుల్లో
కొత్తపత్రిక రావటం -'చిత్రం'
ఇటువంటి తరుణంలో
నీకు నేను నాకు నువ్వు
ఒకరికొకరం 'నువ్వు-నేను'
అంటూ హాస్యాన్ని, సంగీతాన్ని
మేళవించుకుంటూ "హాసం" పత్రిక రావటం
ఆనందించాల్సిన విషయం
చదివిన ప్రతి పాఠకుడూ
నా 'మనసంతా నువ్వే'
అంటూ ఆదరించేలా ఎదుగుతున్న
ఈ 'హాసం'
ఎంతహిట్ అయితే అంత 'సంతోషం'

-ఆర్.పి.పట్నాయక్
(సంగీత దర్శకుడు)





# ఇవీ సంగతులు

## హాస్యం



## సంగీతం



సినీ సంగీత ప్రియులకు ప్రత్యేక కానుకగా

**ఆనందం, జాబిలి**

సినిమా పాటల పుస్తకాలు 'సెంటర్ స్ప్రెడ్'లో

ముఖచిత్రం: 'మనసంతా నువ్వే' సినిమా నుండి ఓ సన్నివేశం కవర్ డిజైన్ :ఈరంకి

హాసం మూడవ సంచిక (1-15 నవంబరు) రెండవ సంచికకంటే బాగా అలరించింది. రెండవ సంచిక చూసి ముగ్ధుడైన నేను అభినందన లేఖ వ్రాసిన మర్నాడే మూడవ సంచిక బజారులో కనిపించే సరికి ఉబ్బితబ్బిబయ్యాను. ఎబ్బెట్టుగా వున్న విషయం గాని సంగతులుగాని ఎక్కడయినా వుంటాయేనని 64 పేజీలూ పేరాపేరా వెదికాను. కాని దొరకలేదని చెప్పడానికి సంతోషిస్తున్నాను. దివాకర్ బాబుగారు హ... హా! అంటూ మొదలెట్టే సరికి ఏదో నవ్విస్తున్నాడులే అనుకొంటే చివర్లో జంధ్యాల గారిని గుర్తు చేసి మానుతున్న బాధను రేపారండి. ఘంటసాల మాష్టారు గారి గురువుగారు గురించి భరణిగారు చాలా బాగా వివరించారు. సూర్యకాంతం గారి గురించి రావికొండలరావు గారి రచన బాగుంది. క్రితం సంచికలో రేలంగి గారి చిత్రం లాగానే సూర్యకాంతం గారి 'నిజ చిత్రము' వ్యాసము మొదట్లో వేయడం నచ్చింది. బండూ అటకెక్కడం అనువాద రచనలా కాక ఒరిజనల్ లాగా వుంది. ఆపాత/పాట మధురం ద్వారా ఆణిముత్యాలను అందిస్తున్నందుకు సంతోషం. పోయిన సంచికలో పాతాళభైరవి, ఈసారి పెళ్ళిచేసిచూడు, ఓహ్ వాట్ ఎ వండర్! వచ్చే సంచికలో ఏ ముత్యం ఇస్తారా? ఆశతో ఎదురు చూస్తున్నాను. 66 పేజి తరువాత కవరు పేజిలో వేసిన ఈ నాటి హాస్య కుటుంబము బాగానే వున్నా, పోయిన సంచికలో మేము చూసిన ఆ నాటి హాస్య కుటుంబం ఫోటోలాగలేదు.

జి.ప్రభాకర్‌రావు,
హైదరాబాద్

తొలిసంచిక 1-15 అక్టోబరుతోనే ఆపాతమధుర చిత్రాభిమానుల, అంతరంగాలలో పదిలంగా సుస్థిర స్థానం సంపాదించి, రెండవ సంచికతో - పెకలించ లేని మర్రి వృక్షంలా శాంతి, మధుర ఛాయలనందిం చేదిగా ఎదిగింది.

ఐతే, ఒకటి - ఎన్నో సినీ పత్రికలొస్తున్నాయి కదా, అన్నింట్లోనూ కొత్త తారలు - వర్తమాన - నీతిలేని బూతు చిత్రాలు - గీతం - సంగీతం లేని ఒళ్ళూపడం పొర్లాడడం తప్ప మరేమీ రాని ఉత్తమ నటుల చిత్రాల గురించి ఇస్తున్నాయి 'హాసం' కూడా రెండుడుగులేసింది. ఆ కొత్త సినిమా విషయాలకు స్వస్తి చెప్పండి! అనవసరంగా 68 పేజీలు - 50 పేజీలు కానీ, ఫరవాలేదు. సంచిక ధర 15/- అయినా కొనే అభిమానులున్నారు.

-వసంతకుమార్,
హనుమాన్‌నగర్, దేవరకొండ

నేను ప్రయాణం మధ్యలో టైమ్‌పాస్‌కని కొన్న 'హాసం' నా అభిమాన పత్రిక అయి కూర్చుంది. ది బెస్ట్ అండ్ వెరీ హ్యూమరస్ ఫీచర్స్! అన్ని శీర్షికలు, విజ్ఞాన, వినోద, హాస్య రసాలుగా నిండి వున్నాయి. ఎక్కడో మారుమూల పల్లెలో కలాన్ని కదిలించే నాలాంటి వాళ్లకి పాట పంపాలనే స్ఫూర్తిని ఇచ్చారు.




ముఖ్యంగా మ్యూజిక్ నా ప్రాణం అదిప్పుడు 'హాసం'లో దాగుంది. పేరే ఆహ్లాదంగా వుంది. బంగారు భవిష్యత్తులోకి పరుగులు తీయాలని కోరుతూ...

కె.శిరీష
ములపర్రు, పశ్చిమగోదావరి జిల్లా

'హాసం' పత్రిక వడ్డించిన విస్తరిలా ఉంది. ఏది ముందు తినాలో తెలియని సందిగ్ధం - మాలాంటి భోజన ప్రియులందరికి.

'క్లాసిక్ రీటోల్డ్' శీర్షిక గురించి గిలిగింతలు పెట్టే 'సాక్షి' వ్యాసాలూ, 'హ్యూమరథం'కి మూడు చక్రాలుగా తెలుగు, హిందీ, ఆంగ్ల చిత్రాల హాస్య నటుల జీవిత విశేషాలు, 'షాపింగ్' కార్టూన్ (స్ట్రిప్స్), టీచర్ స్టూడెంట్ స్పెషల్ హ్యూమర్ బాక్సూ హాస్యపు రుచులతో మమ్మల్ని అలరించాయి. ముఖ్యంగా 'సూర్యకాంతం' గారిపైన వ్రాసిన వ్యాసం చదివాక ఎంతో బాధగా అనిపించింది. 'సినీ కుటుంబం'లో అలాంటి అత్తగారులేని లోటు ఎప్పటికీ తీరదు.

అనువాద కథ 'బండూ అటకెక్కడం' చాలా నవ్వు పుట్టించింది. శ్రీ దివాకర్‌బాబు గారి "హ.... హా..." కథ చదివాక గుండె చెమరించింది. 'జంధ్యాల' గారిని ఆకాశంలోని నక్సలైట్లు కిడ్నాప్ చేసేసారు.

ఇటు సంగీతం వైపుకి వస్తే దశాబ్దానికొకటి చొప్పున జూక్‌బాక్సులూ ఎప్పటికి వాడని దివ్య పారిజాతం లాంటి క్లాసిక్స్ 'ఆపాతమధురం' శీర్షిక కింద పాత పాటల పరిచయాలు... ఇవన్నీ రుచి చూస్తే చాలు కడుపునిండి పోతోంది! భాషరాక, భావాన్ని ఆస్వాదించలేని హిందీ పాటలను 'అర్థం చేసుకుందాం, ఆస్వాదిద్దాం' శీర్షిక కింద పంక్తి పంక్తికీ అర్థ, భావ, ట్యూన్‌లతో వివరణ ఇస్తూ వెంటనే ఆ పాటని కేసెట్‌లు వినెయ్యాలీ అన్న కోరికను కలిగి స్తోంది. శాస్త్రీయంలో వివిధ శాస్త్రీయ సంగీత విద్వాంసుల్నీ 'లలితం'లో అల్లప్పుడెప్పుడో రేడియోలో వినని లలిత సంగీతాల పరిమళాలను, 'పాప్‌కార్నర్' లో ఈనాటి యువతరాన్ని ఉర్రూత లూగించి పాప్‌గీతాలను పరిచయం చేస్తూ, సంగీత ప్రపంచానికి వయోభేదం అనేదే లేదని నిరూ పించారు. ముఖ్యంగా 'లలితగీతాన్ని' స్వర సహితంగా అందిస్తూ ఈనాటి యువతరం నేర్చు కోవటానికి వీలుగా అందిస్తున్న శ్రీ చిత్తరంజన్ గారు ఎంతో అభినందనీయులు. ఈ పక్షం ప్రత్యేక వ్యాసాలు - ఆశాభోంస్లే గారి గురించి, ఓ.పి. నయ్యర్ గురించి ఎన్నో విశేషాలు తెలియ జెప్పాయి. ఈ పక్షానికిదే హైలెట్.

నా కోరికను మన్నించి 'జూక్‌బాక్సు'లో 'ఊరికే కొలను నీరు' పాటను వివరించినందుకు ఎన్నో ధన్యవాదాలు. నాకెంతో యిష్టమైన ఆ పాట గురించి, నాకు తెలియని ఎన్నో విశేషాలను ఆ పాటల్లో దాగి వున్న సంగీత, సాహిత్య, సౌరభాలను తెలుసుకో గలిగాను. కృతజ్ఞురాలిని.

ఇంకా 'ఇష్టపది'లో లేటెస్ట్ పాటల క్యాసెట్ గురించీ, ఆడియోచాట్‌లో ఇష్టమైన పాటలు దొరికే క్యాసెట్స్ చిరునామా గురించీ తెలుసుకోగలుగు తున్నాం. 'మీ పదసంపద' బుర్రలకు పదును పెడుతోంది. క్రొత్త పాటల పుస్తకాలు అదనపు బోనస్.

పది రూపాయలకి పదికాలాల పాటు పదిలంగా దాచుకోగలిగే పవిత్రమైన పత్రికను అందించటం మీకే చెల్లింది. ఎందుకంటే ఇందులోని ప్రతీ పేజీ అమూల్యమైనదే.

రిలాక్స్ కోసం హాసం
స్వాంతన కోసం హాసం
పరిపూర్ణమైన తృప్తికోసమూ 'హాసం'!

-వై.యస్.నాగమణి, సికింద్రాబాద్.

మీరు ప్రచురించిన 'హాసం' రెండు పత్రికలను ఎంతో ఆతురతతో కొని చదివాను. చాలా బాగున్నాయి. హాస్యాన్ని, సంగీతాన్ని మేళవించిన పత్రికగా, 'హాసాన్ని' తీర్చిదిద్దటం ఎంతో గొప్పగా ఉంది. ఈ విధమయిన పత్రికలు యింత వరకూ ప్రచురింపబడియుండ లేదు. కేవలం హాస్యానికి పరిమితమయినవి, సంగీతానికి పరిమితమయినవి మాత్రమే వున్నాయి. ముఖ్యంగా మనిషికి నిత్య జీవితంలో కావలసినవి "హాస్యం, సంగీతం" మాత్రమే. ఇది గ్రహించి పత్రికను నడుపుతున్న 'సంపాదకులకు' పాఠకులు ఎంతో ఋణ పడివుంటారు.

-పి.ఎల్.ఎన్.శ్రీరామాచార్యులు,
కాగజ్‌నగర్

'హాసం' పత్రిక చూచాను. హాస్యం, సంగీతం కలగలిపి ఒక చక్కని టానిక్‌లాగా తయారుచేసి అందిస్తున్నందుకు పత్రిక నిర్వాహకులు అభినందనీయులు. నిత్యం యాంత్రిక జీవనం సాగిస్తూ క్షణక్షణం టెన్షన్‌తో,భయాలతో డబ్బు జబ్బులతో 'నవ్వులు' కరవయిన బలహీనులకు ఇటువంటి టానిక్ అవసరం ఎంతయినా ఉంది.

అందరి పళ్లు నమలడానికి పనికి వస్తాయి. కొందరి పళ్ళు కేవలం నవ్వడానికే పనికి వస్తాయి. కాన్నీ అన్ని గుండెలూ హాయిగా నవ్వుకునే చక్కని చిక్కని హాస్యం మమ్మల్ని ఒంటరిగా ఉన్నా నవ్వు కునేట్లు చేస్తోంది.

-డి. పంకజా మల్లిక్, హైదరాబాదు

సంపుటి :1 సంచిక: 4

16-30 నవంబరు 2001

పేజీలు : 68 వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక 4

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూధన శర్మ

అనుభూతిని ఇతరులతో పంచుకోవడం మంచి లక్షణం. దానివల్ల ఆనందం రెట్టింపయితే, దుఃఖం సగమవుతుంది. ముఖ్యంగా హాస్యం కలిగించే ఆనందం నలుగురితో పంచుకుంటే ఆ హాయే వేరు. విడిగా చదువుకుంటే ముసిముసి నవ్వులు మాత్రం ప్రసాదించే ఓ జోకు పదిమందిలో చెప్పుకుంటే పగలబడి నవ్విస్తుంది. నవ్వుకి అంటుకునే గుణం వుంది. పక్కవాడు నవ్వితే మనకూ నవ్వొస్తుంది. అందుకే సరదా సినిమాలు సినిమాహాల్లో చూడబుద్ధవుతాయి.

కళ అనేది సామూహిక స్వప్నం అన్నాడు ఫ్రాయిడ్. అందుచేతనే కాబోలు టీవీ ముందు ఎంత సుఖంగా కూచుని సినిమా చూసినా రాని రసానుభూతి సినిమా థియేటరులో కలుగుతుంది. మూతి బిగించుకుని కూచునేవాళ్లను థియేటరుకు లాక్కెళ్లి ఓ హాస్య చిత్రం చూపిస్తే చాలు. మామూలు మనుష్యుల్లో పడతారు.

సమూహం అంటే సాటి సినిమా ప్రేక్షకులు మాత్రమే కాదు, కుటుంబ సభ్యులు కూడా. ఆ మాట కొస్తే సమాజానికి, సంఘానికి కేంద్రబిందువు కుటుంబమే. కుటుంబసభ్యులు నలుగురు ఒకచోట కూచుని హాయిగా నవ్వుకోగలిగితే తరాల మధ్య అంతరాలు కాస్త తగ్గుతాయి. కమ్యూనికేషన్ గ్యాప్ తగ్గి, అనేక మనస్పర్థలు వాటంతట అవే తొలగిపోతాయి. నవ్వించడానికి కితకితలు పెట్టుకోలేరు కదా, ఏదైనా జోకు చెప్పగలగాలి. ఆ జోకు తల్లి, చెల్లి కూడా వినగలిగేది, పదిమంది ఎదుటా ఆనందించగలిగేది అయి ఉండాలి.

హాసంలో అలాటి జోకులు, హాస్యరచనలు మాత్రమే ప్రచురించాలని మా ఉద్దేశ్యం. ఈ సారి హాసం చూశావా, ఫలానా కథ భలేగా ఉంది, ఫలానా జోకు చెప్పనా అని కుటుంబసభ్యుల మధ్య ఈ పత్రిక గురించి చర్చ జరగాలని మా అభిలాష. కుటుంబంలో సామరస్యం, సమన్వయం సాధిస్తే అంతకంటె కావలసినదేముంది? రిలాక్సేషన్‌కి వేరే మార్గాలు వెతుక్కునే పనే ఉండదు.

సినిమా పరిశ్రమకు సంబంధించిన వారు కూడా ఈ సత్యాన్ని గమనించినట్టున్నారు. అందుచేతనే ఫ్యామిలీ హాస్యచిత్రాలు ఈ మధ్య జోరుగా వస్తున్నాయి. హిట్ అవుతున్నాయి కూడా. హాసం ఈ ట్రెండ్ ను అభినందిస్తుంది, ఆదరిస్తుంది అని చెప్పడానికే ఈ సంచిక ముఖచిత్రం విభిన్నంగా రూపొందించడం జరిగింది. పదిమందీ కూచుని నవ్వుకునే చోట తనను తలుచుకోవాలని పుత్తడిబొమ్మ పూర్ణమ్మ కోరుకున్నట్టే హాసం కూడా కోరుకుంటోంది. ఫ్యామిలీ కల్చరును ప్రోత్సహిస్తున్నామని చాటి చెప్పడానికే ఈ ముఖచిత్రం ఈ విధంగా ప్లాను చేస్తే, తమాషాగా బ్యాక్ కవరు ఎడ్వర్టయిజ్‌మెంటు కూడా అదే తరహాది రావడం జరిగింది. వి ఆర్ ఇన్ ట్యూన్ విత్ టైమ్స్ అని మాకు మేమే వెన్ను తట్టుకునేందుకు ఓ చిన్న అవకాశం ఇచ్చింది.

ఈ సంచిక ఎటునుండి చూసినా ఆహ్లాదకరమైన కుటుంబవాతావరణం కొట్టొచ్చినట్టు కనబడుతుంది. లోపల ప్రచురించిన అంశాల మాట వేరే చెప్పనవసరం లేదు. మా ఈ ప్రయత్నం ఏ కొద్ది ఇళ్లలోనైనా కొన్ని గంటలపాటు హాయిని సమకూర్చగలిగితే మా ప్రయత్నం ఆ మేరకు సఫలమయినట్టే.



HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82



# ప్రై'వేటు' మాస్టారు

- సత్యానంద్

'మాయాదారి మల్లిగాడు' నుంచి 'డాడీ' వరకు సక్సెస్‌కి పర్యాయపదం సత్యానంద్. సినీ రంగంలో కథకుడిగా, సంభాషణల రచయితగా గత 30 ఏళ్ళుగా అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్న కెరీర్ ఆయనది. 'హాసం'కి శ్రీ సత్యానంద్ కథ రాస్తున్నారన్న ప్రకటన గత సంచికలో చూసిన తర్వాత సినీ పరిశ్రమ నుంచి ఎందరెందరో హర్షం వెలిబుచ్చుతూ ఆశ్చర్యం కూడా ప్రకటించారు 'ఇది నిజమా!?' - అంటూ ఎందుకంటే గత పదిహేనేళ్లుగా ఆయన ఏ పత్రిక్కీ కథ రాయలేదు కనుక! ఆ విషయాన్ని ఆయన దస్తూరీలోనే చూడండి.



పత్రికలన్నిటికి కథలు రాసి... ఎన్నో ఏళ్ళయి పోయింది. ఆసక్తి ఉన్నా అవకాశం లేక మానేసిన నన్ను 'హాసం' తరఫున రమేష్ వచ్చి రాసి తీరాలి అన్నారు. తప్పించుకోటానికి 'సరే' అని తప్పుకుందామనుకున్నా పట్టువదలని విక్రమార్కుడి పోలికలున్న 'రమేష్' పట్టుకుని - పట్టుబట్టి ఇప్పటికి రాయించారు. థాంక్స్ టు రమేష్ - ఈ కథ రాయించినందుకు!

సత్యానంద్.
1.11.2001

సుందర్రావ్ వేటకి బయల్దేరాడు.

విల్లు అంబుల్లాటి సర్టిఫికెట్స్‌తో ఆఫ్రికా అడవిలాటి హైదరాబాద్ సిటీలో....

వుజ్జోగం అనే జంతువుని.... వే...టాడటానికి బయల్దేరాడు సుందర్రావ్.

సర్టిఫికెట్స్‌లో సుందర్రావ్ అసలు పేరు సుందర్రామయ్య పంతులు.... అని వుంటుంది. అది అతని తాతగారి పేరని... నాయనమ్మ ముచ్చట పడితే.... నాన్న పెట్టేశాడు.

జ్ఞానం వచ్చాక సుందర్రావుకి.... ఆ పేరు అటక మీద పాత సామానులా అసహ్యంగా అనిపించి... నాయనమ్మ మీద, నాన్న మీద చచ్చిన తాతగారి మీద యథాశక్తి కోపం తెచ్చుకున్నాడు. రెండు రోజులు కోపంగా వున్నాక.... 'సుందర్రావ్' అని మార్చుకున్నట్టు ఎనౌన్స్ చేసి.... అలా పిలవకపోతే చచ్చిపోతానని బెదిరించి, నూతి వరకు వెళ్లి.... ఇంట్లో వాళ్లు ఏడ్చిమొత్తుకోవటంతో ... వెనక్కి వచ్చేశాడు.

తర్వాత నుంచి సుందర్రావుగా సెటిల్ అయ్యాడు.

రోడ్డు మీద నడుస్తున్నాడు సుందర్రావు

"ధర్మం చెయ్యండి... బాబూ..." వినిపించగా తలతిప్పిన సుందర్రావ్‌కి దుక్కలా వున్న ఓ ముష్టాడు.... దీనత్వం నటించటానికి ప్రయత్నిస్తూ కనిపించాడు.

"నేను ధర్మం చెయ్యను" - విసుగ్గా అన్నాడు సుందర్రావు.

"పుణ్యం వస్తుంది బాబూ" - ఎంకరేజ్ చేసాడు ముష్టాడు.

"నాకు పుణ్యం వద్దు..." నిర్లక్ష్యంగాఅన్నాడు సుందర్రావు అనేసి స్పీడు పెంచి ముందుకు నడిచాడు.

సుందర్రావుకి... దానం... ధర్మం... న్యాయం వగైరా వాటి మీద పెద్ద నమ్మకం లేదు. అతను నమ్మింది - నమ్మకం వున్నది... 'ప్రేమ' మీద. కాలేజీలో వున్నప్పుడు అతను ఎడా-పెడా చాలా మందిని ప్రేమించేసి - లవ్‌లెటర్స్ రాయటం పార్ట్ టైమ్ జాబ్‌గా పెట్టుకుని... పరీక్షలు



కూడా తప్పాడు. అయిన పెద్దగా ప్రయోజనం కనిపించలేదు. కొందరమ్మాయిలు ... సారీ చెప్పారు.

కొందరు ఎడ్వాన్స్‌గానే వాళ్ళ 'హార్ట్'లు బుక్

ఈ కథపై పాఠకులు తమ అభిప్రాయాన్ని

సత్యానంద్,
502 యస్‌డిఇ శ్రీ సాయి రెసిడెన్సీ,
శ్రీనగర్‌కాలనీ,
హైదరాబాద్ - 500 073

అడ్రస్‌కే నేరుగా పంపవచ్చు. ఆయన మెప్పుపొందిన ఉత్తరాన్ని పంపిన వారికి 'హాసం' పత్రిక ఆరునెలల పాటు ఉచితంగా పంపిస్తాం.

అయిపోయాయని చెప్పారు.

కొందరు 'రాఖీ'లు తెచ్చి 'వీలున్నప్పుడు' కట్టుకో అని విసిరేసి పోయారు.

అయినా సుందర్రావ్ నిరుత్సాహ పడలేదు. ఎప్పటికైనా ఎవరో ఒకమ్మాయిని ప్రేమించే పెళ్ళి చేసుకోవాలని ఫిక్స్ అయిపోయాడు. ప్రస్తుతం ఈ వుద్యోగం వేట అయ్యాక... మళ్ళీ ఫ్రెష్‌గా ప్రేమించే కార్యక్రమం మొదలు పెట్టాలని అనుకుంటున్నాడు.

"దానం బాబు..." దుక్కలాటి ముష్టాడు ఫాలో అవుతున్నాడు.

"చెయ్యనని చెప్పానుగా..."

"ధర్మం చెయ్యనని చెప్పారు... కనుక దానం చేస్తారేమోనని..."

"నేను ఏదీ చెయ్యను. కనక ఇక నన్ను ఫాలో అవటం మానేయ్..." కాస్త ఖచ్చితంగా అన్నాడు సుందర్రావు అనేసి మళ్ళీ ముందుకు నడిచాడు.

సుందర్రావు జాతకంలో... ప్రేమించి పెళ్ళి చేసుకునే యోగం వుందని ఆ మధ్య ఓ గెడ్డం జాతకాల వాడు చెప్పాడు. నిజంగానా అని సుందర్రావ్ చిన్న హైజంప్ చేసి అడిగాడు. జాతకాల కంటె సైకాలజీ ఎక్కువ తెలిసిన ఆ గెడ్డం జాతకాల వాడు సుందర్రావు 'హైజంప్' చూసి ... రెచ్చిపోయి 'నా మాట అబద్ధమైతే నేను జాతకాలు చెప్పటమే మానేస్తా నన్నాడు. వాడు ఏడాది క్రితమే మానేశాడనే విషయం తెలియని సుందర్రావ్ వాడికి ఓ వందనోటిచ్చాడు. ఆ రోజు ఆ జాతకాల వాడి జాతకం బావుంది. వాడు ఆ వందతో బ్రాందీ తాగి - బిరియానీ తినేసి సుఖపడ్డాడు.

"ఓ రూపాయి ఇయ్యండి బాబూ....'" దుక్కలాటి ముష్టాడు బీడి వెలిగించుకుంటూ అడిగాడు.

"నేను ఇవ్వనని చెప్పానుగా...."

"లేదు సార్... చెయ్యనని చెప్పారు. అది కూడా దానం, ధర్మం లాటి పనులు. అందుకే రూపాయి అడుగుతున్నా....." చిరునవ్వుతో అన్నాడు దుక్కముష్టాడు.

"ఫాలో అవ్వద్దని చెప్పానుగా..."

"పట్టుదల గల వాడ్ని సార్.... అనుకున్నది జరిగే వరకు ప్రయత్నించాలి...." జీవిత సత్యం చెప్పిన స్వామీజీలా అన్నాడు దుక్కముష్టాడు.

"సరే.... ప్రయత్నించు...." అనేసి ముందుకు నడిచాడు సుందర్రావ్.

## - 2 -

రోడ్డు హడావుడిగా వుంది. జనం కొంపలంటుకున్నంత కంగారుగా అటూ ఇటూ పోతున్నారు. సుందర్రావ్.... షాపింగ్‌కాంప్లెక్స్ పక్కగా... ఫుట్‌పాత్ మీద నుంచుని కార్లల్లో వెళ్ళేవాళ్ళని బైక్‌ల మీద పోయేవాళ్ళని చూస్తూ 'ఇంతమంది వున్నారు దేశంలో... ఒక్క వెధవేనా నాకు ఒక్క వుద్యోగం ఇచ్చి ఏడవచ్చుగా...'' అనుకుంటూ తల తిప్పాడు.

మూడడుగుల దూరంలో... రెండడుగుల పొడవు, అడుగున్నర ఎత్తు వున్న ఓ నల్లకుక్క సుందర్రావ్‌కేసి చూస్తోంది.

అతనికి గుండె ఆగినట్టయింది. సుందర్రావ్‌కి కుక్కలంటే చచ్చే భయం.

సింహం - పులి అయితే మనిషిని తినేస్తాయి. గొడవలేదు. వాటి కడుపు నిండుతుంది. కుక్క తినదు. కరిచి రుచి చూస్తుంది. దానివలన దానికి (కుక్కకి) కడుపు నిండదు సరిగదా మనిషికి కడుపు మీద బొడ్డు చుట్టూ ఇంజక్షన్స్. దాని కరుపు బాధ, ఇంజెక్షన్స్ నొప్పి, వాటి ఖర్చు, అంతా ఓ నరకం... కనక కుక్కకి సాధ్యమయినంత దూరంగా వుంటే జీవితం సుఖశాంతులతో వుంటుంది అనే ఫిలాసఫీ సుందర్రావుది.

అందుకే నల్లకుక్కని చూసి... రెండడుగులు దూరంగా వేశాడు సుందర్రావు.



కరెక్ట్‌గా కొలిచినట్టు అది కూడా రెండే అడుగులు.... సుందర్రావు కేసి వేసింది.

సుందర్రావుకి చెమటలు పట్టాయి.

రోడ్డు మీద ఇంతమంది వుండగా - అది కరవటానికి తననే సెలక్ట్ చేసుకుందనే అభిప్రాయానికొచ్చాడు సుందర్రావు. తను కదిలితే - అదీ కదులుతోంది.... తను పరిగెడితే అదీ పరిగెడుతుంది. ఏం చెయ్యాలనే ఆలోచనతో దాని వంక చూస్తూ నిలబడిపోయాడు. అది కూడా నాలికని ఓ సారి ప్రదర్శించి... ఏ రేంజ్‌లో కరిస్తే తన సరదా తీరుతుందో అన్నట్టుగా అతని వంక చూస్తోంది.....!

ఆ క్షణంలో.... ప్రక్కనున్న బ్యాంకులోంచి... చంద్రశేఖర్ గారు బ్రీఫ్ కేసుతో బయటికి వచ్చారు. ఆయన పెద్ద బిజినెస్ మాన్. డ్రా చేసిన పాతిక లక్షల రూపాయిలు బ్రీఫ్ కేసులో వుండడం వలన దాన్ని లేకలేక పుట్టిన బిడ్డలా గుండెలకి హత్తుకుని కాస్త దూరంలో వున్న తన కారు కేసి నడుస్తున్నాడు.

సరిగ్గా అదే క్షణంలో.... దొంగతనం ముఖ్యవృత్తిగా, ముష్టి అడుక్కోటం హాబీగా బతికే దుక్క ముష్టాడు.... ఆ పూటకి 'హాబీ' ఆపేసి ప్రొఫెషన్‌లోకి దిగుదామని సంకల్పించుకుని... అప్రయత్నంగా చంద్రశేఖరం గారిని ఆయన చంకలోని పెట్టిని చూసాడు. భయభక్తులతో ఆయన పెట్టిని పట్టుకోవడం గమనించిన అతనికి విషయం అర్థమయి ఆయనకేసి గబగబా నడిచాడు.

'కరవటం' అనే చిన్నకాలక్షేపం కోసం కుక్క ఎంతసేపయినా వెయిట్ చెయ్యగలదని సుందర్రావుకి అర్థమయింది. అర్జంటుగా - దాని ఊహకందని రీతిలో.... తను ఎటో దూకి... ఏదో ఎక్కి పారిపోక తప్పదనుకుని... పక్కగా వున్న ఆగిన కారుకేసి చూసాడు. ఒక్క ఎగురులో కారుపైకి, అవతల జనంలోకి దూకెయ్యాలని ప్లాను సెట్ చేసుకున్నాడు.



ఆ కారు ఓనరయిన చంద్రశేఖరం గారు... డోర్ దగ్గరకొచ్చి తెరవ బోతున్నారు. అనుకున్నది సాధించాలనే లక్ష్యంతో దొంగ ముష్టాడు లేదా ముష్టి దొంగాడు ఆయన దగ్గరకి వచ్చేశాడు. సుందర్రావ్ వూపిరి బిగించి కుక్కకి అనుమానం రాకుండా బాడీని బిగించి యాక్షన్‌కి సిద్ధపడ్డాడు.

చంద్రశేఖరం గారు డోర్ తెరిచారు. దొంగ ముష్టాడు ఆయన బాక్స్ లాగాడు. కారు మీదకి మెరుపులా ఎక్కేసిన సుందర్రావు అవతలకి దూకాడు. ఆయన 'దొంగ' అని అరిచాడు. దొంగ పెట్టెతో అడుగు ముందుకేసాడు. సుందర్రావు పైనుండి వచ్చి వాడిమీద లాండ్ అయ్యాడు. ఇదంతా క్షణంలో జరిగింది. పడిపోయిన దొంగని - జారిపోయిన పెట్టెని - దొంగ మీదకి సాహసంగా దూకిన యువకుడ్ని చూసిన చంద్రశేఖరం గారు "పోలీస్... పోలీస్..." అని అరుస్తూ తన పెట్టె అందుకున్నారు.

జనం చేరటం - పోలీసులు రావటం - సాహస యువకుడిని అంతా పొగడటం - దొంగని పోలీసులు కొట్టుకుంటూ పట్టుకుపోవటం - చిన్న దెబ్బలు తిన్న సాహస యువకుడ్ని కౌగిలించుకుని దెబ్బలు డాక్టర్‌కి చూపించాలని అతన్ని చంద్రశేఖరం గారు కారు ఎక్కించుకోటం.... గబగబ జరిగిపోయాయి.

కారు సీటులో వున్న సుందర్రావు... తనని కరవటం మిస్ అయి ఫుట్‌పాత్ మీదే వుండిపోయిన నల్ల కుక్కకేసి ధైర్యంగా చూసాడు. కారు కదిలింది. కొట్టటానికన్నట్టుగా... తననే చూసిన ఆ మనిషి హఠాత్తుగా ఎందుకు కారు మీదకు ఎగిరి దూకాడో

అర్థం కాలేదు ఆ నల్ల కుక్కకి. అది ఎప్పుడో విరిగిన తన కాలుని కష్టం మీద కదిపి - మరో రెండడుగులు వేసి నొప్పితో మళ్ళీ ఆగింది.

## 3

"ఇప్పుడు నువ్వేం చేస్తున్నావోయ్ సుందరం?" ఫామిలీ డాక్టర్ చేత ప్లాస్టర్స్ వేయించి మళ్ళీ అతన్ని కారులో తీసుకుని వెళుతున్న చంద్రశేఖరం గారు అడిగారు.

"నొప్పితో బాధపడుతున్నా" - సిన్సియర్‌గా చెప్పాడు.

"అది తెలుస్తోంది... నేనడిగింది.... నువ్విప్పుడు జాబ్ ఏం చేస్తున్నావని....?"

"జాబ్ కోసం... వెతికే జాబ్ చేస్తున్నాను..."

"నీలాటి డైనమిక్ యంగ్ ఫెలోకి ఉజ్జోగం దొరకప్పోవటం ఏమిటోయ్... ఏం చదివావ్...."

"ఉదయం ఆంజనేయ స్వామి దండకం - తరవాత 'హిందూ' పేపరు..."

"ఎడ్యుకేషన్.. ఎడ్యుకేషన్ ఏంటోయ్...."

"బి.ఎస్.సి చదివాను... తెలుగు ఎమ్.ఎ. కూడా చేసాను."

"వెరీగుడ్... ఓ నెల్లో మా కంపెనీలో ఏదో ఒక జాబ్ వేయిస్తాను. ఈలోగా మా పాప తెలుగులో పూర్. దానికి రోజూ వచ్చి ప్రయివేటు చెబుతూండు.... నీకు అవసరమైనంత డబ్బు జీతంగా తీసుకో...."

కారుని ఆ పెద్ద బిల్డింగ్ గేటులోంచి లోపలికి పోనిచ్చాడు చంద్రశేఖరం గారు.

సినిమా సెట్‌లా వున్న ఆ ఇంటి హాలుని షూటింగ్ చూడ్డానికి మొదటసారి వచ్చిన వాడిలా చూస్తున్నాడు సుందర్రావు.

డబ్బుతో ఇల్లు పొగరెక్కినట్టుంది.

కాఫీలు తెచ్చిన నౌకర్‌తో "పాపని పిలువ్..." అని చెప్పిన చంద్రశేఖరంగారు వెర్రి చూపులు చూసే సుందర్రావుతో

"పాప తప్ప నాకు ఎవరూ లేరయ్యా.... దానికి చదువంటే ప్రాణం.... చదువు తప్ప వేరేలోకం తెలీదు. తెలుగులో కాస్త వీక్... నువ్వు కాస్త కోచింగ్ ఇచ్చావనుకో...." ఇంకా ఏదో చెబుతున్నాడు.

"పిలిచారా.... డాడీ...."

అని వినిపించి, తొంభై డిగ్రీల యాంగిల్‌లో తల



తిప్పాడు సుందర్రావు.

అప్పుడు అక్కడ కనిపించింది అందం.

ఆ అందం... హుందాగా... చీర కట్టుకున్నా సింపుల్‌గా వుంది.

వినయం విశాలంగా కళ్ళలో పరుచుకుని వుంది!

మర్యాదతో కాస్త ధీమాగానే ముందుకు వచ్చిన ముక్కు...

నవ్విస్తే నవ్వటానికి రెడీగా వున్న పెదాలు... ముట్టుకుంటే మాసిపోతాయనిపించే చెంపలు వుండాలి కనక వున్నానన్నట్టు వున్న నడుము, సదరు సరంజామాతో ముందుకు వచ్చే ఆ అందాన్ని చూసి.... క్షణం మూర్ఛ 'పోయి' వచ్చేశాడు సుందర్రావు.

"అమ్మాయి సంధ్య! పాప అని పిలవటం మాకు అలవాటు" అని సుందర్రావుతో అని కూతురుతో "ఇతను సుందరం అని... బ్యాంక్ దగ్గర డబ్బుకొట్టేసే దొంగని కొట్టి... బాక్సని, నన్ను సేవ్ చేసాడమ్మా.... " అన్నాడు ఆయన.

ఎడ్మయిరింగ్‌గా సుందరాన్ని చూసింది సంధ్య.... సుందరం మొహమాటం నటిస్తున్నాడు.

"కారు పై నుండి.... థ్రిల్లింగ్‌గా దూకి.... ఎగిరి ఎడమ కాలితో దొంగని తన్ని.... వాడితో పాటే నేల మీద పడి వాడ్ని కదలకుండా చేసాడు. రియల్లీ గ్రేట్... అన్నట్టు రేపట్నించి ఇతను నీకు ప్రయివేటు చెబుతాడమ్మా...."

బెదిరినట్టు చూసి... "ఫైటింగులోనా?" అని అడిగింది.

సుందరం శుభం సీనులో హీరోలా నవ్వి "కాదండి... తెలుగు" అన్నాడు.

"బతికించారు." హసించింది సంధ్య.... 'హం' అని ప్రాణాలు వదిలినంత పనిచేసాడు సుందరం.

## 4

సుందర్రావు సంధ్యకి ప్రయివేటు మాస్టారుగా సెటిల్ అయ్యాడు. అయిన దగ్గరనుంచి అతనికి అద్దంతో అనుబంధం పెరిగిపోయింది. అద్దం ముందు నుంచుని ఏ ఎక్స్‌ప్రెషన్‌లో తను ఎక్కువగా హాండ్‌సమ్‌గా కనిపిస్తున్నాడో ఎక్స్‌పెరిమెంట్‌లు చేసి కొన్ని 'లుక్స్ ' ఫిక్స్ చేసుకున్నాడు.

సెలూన్‌కి వెళ్ళి బార్బర్‌తో డిస్కషన్స్ చేసి 'పవన్ కళ్యాణ్' కటింగ్ తన ఫేస్‌కి నప్పుతుందని ఫీలయి.... తల క్షురకునికి అప్పగించాడు. అతగాడు సుందర్రావ్ బుర్ర మీద మాగ్జిమమ్ రీసెర్చ్ చేసి - దగ్గర దగ్గరగా పవన్ కళ్యాణ్ లుక్ తెప్పించాడు. మిగిలిన బార్బర్స్ అంతా చప్పట్లు కొట్టి 'భేష్' అన్నారు.

సుందర్రావు తన్మయత్వం చెందాడు.

## ఇంటింటి రామాయణం

బొమ్మలు: బాలి

ఒకే పిల్లాడుంటే తక్కువ కిందే లెక్క!
కానీ ఇద్దరుంటే చాలా,
చాలా ఎక్కువ కింద లెక్క!
- అల్లరి పిల్లల తండ్రి ఈక్వేషన్





వేగంగా నడిచే వాహనంలో టైము నెమ్మదిగా సాగుతుంది.
- చిన్న పిల్లల 'థియరీ ఆఫ్ రెలిటివిటీ'

అలాగే 'అప్పులు' బాది, బట్టల్లో కూడా వెరయిటీలు కొనేశాడు,

కొత్త షూస్ కొనేసి.... అవి ఏకధాటిగా కరిచేస్తున్నా వాటితోనే పడుకోటం కూడా చేసి అలవాటు చేసుకున్నాడు... సుందర్రావ్ గ్లామర్‌గా తయారయ్యాడు.

"ఇవేళ... మీ డ్రస్ బావుంది మాస్టారూ...." పాఠం మధ్యలో ఓ రోజు సంధ్య అంది. సుందర్రావ్ మనసు కథాకళి చేసింది. పైకి సింపుల్‌గా నవ్వి "థాంక్స్" అన్నాడు. ఇంటికొచ్చి తలుపులేసుకుని మంచం మీద మూర్ఛపోయాడు. మరోసారి 'సవర్ణదీర్ఘ సంధి' గురించి చెబుతూ - సంధ్య సుతారంగా మొహం మీద పడే వెంట్రుకలు వెనక్కి తోసే యాక్షన్ చూసి అతను ముచ్చట పడుతుంటె "మీ హెయిర్ స్టయిల్ చాలా మోడరన్‌గా వుంటుంది...." అంది ఆమె.

అద్దం ముందు ప్రాక్టీసు చేసిన ఓ మంచి ఎక్స్‌ప్రెషన్ ఇచ్చి "అలాగా" అన్నాడు! ఇంటికి వచ్చేటప్పుడు... సెలూన్ దగ్గర ఆగి.... సదరు కటింగ్ చేసిన బార్బర్‌ని కౌగలించుకుని "నీది ప్రొఫెషన్ కాదు - ఆర్ట్" అని వాడికి సర్టిఫికెట్, ఓ వంద ఇచ్చి వచ్చేశాడు.

రోజులు గడుస్తున్నాయి.

సంధ్య చూపుల్లో తన మీద ఎడ్మిరేషన్... మధ్యమధ్య కాంప్లిమెంట్స్ ... పాఠాలు అయ్యాక కూడా కబుర్లు చెప్పటం.... ప్రత్యేకంగా 'కాఫీ' తనే చేసి ఇవ్వటం, అన్నిటికి బట్టి సుందర్రావుకి అర్థమైంది... సంధ్యకి తనంటె ఇష్టమని!

ఓ రోజు పాఠాలు అయ్యాక అనుకోకుండా - చర్చ సాహిత్యం మీదకు మళ్ళింది.

శరత్ 'దేవదాసు' గురించి సుందర్రావు తన విజ్ఞానం ఒలకబోస్తున్నాడు.

"పాపం... దేవదాసు తాగుబోతు కావటానికి కారణం.... ప్రేమ అంటారా? పార్వతంటారా మాస్టారూ" అని అడిగింది సంధ్య.

ఇలాటి టాపిక్స్ కోసమే కాసుక్కూర్చున్న సుందర్రావ్ రెచ్చిపోయాడు.

"ప్రేమకాదు... పార్వతి కాదు... అతని పిరికితనం.... అన్నిటినీ అందర్నీ కాదనుకుని తెగించి ఇష్టపడ్డ మనిషితో వెళ్ళిపోయే ధైర్యం కావాలి ప్రేమకి.... " బాగా చెప్పానన్నట్టు ఫీలయి ఆగాడు సుందర్రావు.

అసలే సంధ్యవి అందమైన పెద్దకళ్ళు. అవి మరింతగా పెద్దవి చేసి అతన్ని చూసింది.

"ఏది ఏమయినా ఆస్తులు - అంతస్తులు... ప్రేమకి అడ్డమవుతాయి కదా మాస్టారూ...." అంది సంధ్య.

"వాటిని వదులుకోవాలి... కోరుకున్న మనిషికంటె.... ఇవేం గొప్పవి కాదు..." సుందర్రావు అన్నాడు.

"కానీ ఇన్నేళ్లు మన మీద ఆశలు పెంచుకున్న పెద్దాళ్లని బాధపెట్టటం తప్పుకదా...." సంధ్య అంది.

"మరొకరి బాధకోసం ఆలోచిస్తే -బతుకంతా మనం బాధపడాలి...

అయినా ఎవరి జీవితాన్నీ ఎవరి కోసం... ఎవరూ త్యాగం చెయ్యకూడదు"

మొహం అంతా గంభీరాన్ని రాసుకుని హీరోలా చెప్పాడు సుందర్రావు.

ఆలోచనగా - పూలరథంలాగ, వెన్నెల ముద్దలాగ కిటికీ కేసి నడిచిన సంధ్య బైటకి చూస్తూ....

"అన్నిటికి కాదనుకుని.... అందర్నీ వదులుకుని పోవటం... మగవాడి విషయంలో ఓ.కె. కానీ ఆడపిల్ల అంత ధైర్యం చెయ్యగలదా...."

ఆమె మనసులో స్ట్రగుల్ అర్థమయిన సుందర్రావ్ ఇక ఆలస్యం చెయ్యలేదు. కృష్ణుడు గీత బోధించిన టైప్‌లో అందుకున్నాడు-

"ఆడయినా మగయినా ప్రేమ విషయంలో ధైర్యం చెయ్యాలి. పిరికితనం ప్రేమకి విషాదం మిగులుస్తుంది. లైఫ్‌లాంగ్ ఏడుస్తూ బ్రతకటం అంత శాపం వేరేలేదు. నీ మనసుని గాయ పరచటం నేరం.... ప్రేమని దాచుకోటం పాపం... ప్రేమించిన మనిషితో గడపక పోవటం ఘోరం. పెద్దలని ఎదిరించాలి... ప్రేమని గెలిపించాలి... అనుకున్నది సాధించాలి.. అదీ జీవితం.... "కాస్త ఆయాసం వచ్చి మంచినీళ్లు తాగాడు. సంధ్య అతనికేసి తిరిగింది. వందోసారి ఎడ్మయిరింగ్‌గా చూసింది! మెల్లగా గోదారిపాయలా అతని కేసి ప్రవహించింది. అతని ముందు నిలబడింది. సుందర్రావు బిగుసుకుపోయాడు. ఆమె తలదించకుండా కళ్ళు దించింది. కుడి చేత్తో మెడలో లాకెట్‌ని పెదాల మధ్య పెట్టుకుని క్షణం ఆగింది. మెల్లగా చాలా మెల్లగా.... "మాస్టారూ ... నేను మిమ్మల్ని-----" -- అనే ఆమె వాక్యానికి "అమ్మా... పాప..." అంటూ వచ్చిన చంద్రశేఖరం గారు బ్రేక్ వేశారు.

జీవితంలో మొదటసారిగా సుందర్రావుకి మర్డర్ చెయ్యాలనే కోరిక విపరీతంగా కలిగింది. చంద్రశేఖరం గార్నేకాదు... హీరో హీరోయిన్స్ మధ్య ఇంపార్టెంట్ సీన్‌లో ఎంట్రీ ఇచ్చే ఎవడినైనా మర్డర్ చెయ్యటం సబబే అని ఫీలయ్యాడు సుందర్రావు.

కానీ ఆ పెద్దాయన్ని మర్డర్ చెయ్యటానికి కత్తి, అవకాశం... ధైర్యం ఏదీ కూడా లేక పోవడంతో ఆ కార్యక్రమాన్ని విరమించి, "వెళ్ళొస్తా...." అని బైలు దేరాడు.

గదిగుమ్మం దాటి వెళ్ళబోతుండగా.... అతని పక్కనుంచి పశ్చిమ పవనంలా వెళ్ళిపోతూ అతనికే వినిపించేటట్టుగా.... ఏదో చెప్పే తండ్రికి వినిపించకుండా - రహస్యం లాగ

"రేపు లెటర్‌లో రాస్తా"అంది సంధ్య.

సుందర్రావు ఆ మాటతోను, ఆమె మీదనుంచి వచ్చిన ఓ మధురమైన సువాసనతోనూ, చేతిలో పుస్తకాలతోనూ కలిసి మైకంగా ఆటోలో పడి కొంపకి చేరుకున్నాడు.

***

ప్రయివేటు మాస్టారుగా తర్జుమా అయిన సాహస యువకుడు సుందర్రావ్ అందమైన అమ్మాయి సంధ్య మనసుకి వేటువేసి... ప్రేమలో పడేసినందుకు ఆ రాత్రి అతను చాలా ఆనందించాడు. కాస్త బ్రాంది సపోర్ట్ కూడా వుంటె ఆనందం రెట్టింపు అవుతుందని 'క్వార్టర్' తెచ్చుకుని... అది సేవించి సోలో పెర్‌ఫార్మెన్స్ చేసి మత్తెక్కి - సగం మంచం మీద సగం నేల

## ఇంటింటి రామాయణం

బొమ్మలు: బాలి



స్నానం సగంలో ఉండగా ఫోన్ బెల్లు మోగని కేసుల్లో డోరు బెల్లు మోగుతుంది.

- ఒంటరిగా ఉండే ఇల్లాలి అబ్జర్వేషన్

ఎవరైనా డిన్నర్‌కి పిల్చినప్పుడు జిడ్డు గ్లాస్ వచ్చేది - అప్పటిదాకా ఆరోగ్యం గురించి లెక్చరిచ్చిన అతిథికే!

- ఆతిథ్యం ఇచ్చే ఇల్లాలి మొత్తుకోలు

మీద బాడీని పరిచేసి పడుకున్నాడు. నిద్రపట్టే ఆఖరి క్షణంలో....

సంధ్య ... ఆమె పెదాలు... పెదాల మధ్య లాకెట్... లీలగా కనిపించి... ఆ లాకెట్ తనే అయిపోయాడు.

* * *

ఇంటి హాలులోకి వచ్చిన సుందర్రావుకి ఆడపనిమనిషి ఎదురొచ్చి

"అమ్మాయిగారు ఇమ్మన్నారు" అని ఓ కవరు అందించింది.

ఆ పనిమనిషి మొగుడికి అభ్యంతరం వుంటుందనే ఆలోచనతో ఆగాడు గాని లేదంటే దాన్ని కౌగలించుకుని. ముద్దెట్టుకోవాలనిపించింది సుందర్రావుకి.

"తను ఎక్కడ....?"

"బైటకెళ్ళారండి....." చెప్పి లోపలికి పోయింది పనిమనిషి.

చుట్టూ చూసి ఎవరూ లేకపోటంతో లెటర్ పట్టుకుని ...సోఫా మీదకి ఎక్కి చిన్న డాన్స్ చేసి కిందకి దిగాడు. ఆ లెటర్ని ముద్దెట్టుకుని ఇక వుండబట్టలేక చింపి కాగితం తీసి చదివాడు.

"డియర్ మాస్టారూ...

నిన్న డాడీ రాకముందు'' నేను మిమ్మల్ని----" అని మొదలుపెట్టి

ఆపేసిన వాక్యంతో ఈ లెటర్ మొదలు పెడతాను.

"నేను మిమ్మల్ని అడిగిన ప్రశ్నలకి మీరిచ్చిన జవాబులు నా సమస్యకి పరిష్కారం చూపించాయ్.

ప్రేమకి తెగింపు వుండాలి... ప్రేమించిన మనిషికి ధైర్యం వుండాలి...

పెద్దవాళ్ళకోసం ఆలోచించకూడదు అని మీరు ''మాస్టారు'' సినిమాలో చిరంజీవిలా చెప్పిన పాఠం నా గుండెలో నాటుకుంది. నాకు ప్రోత్సాహాన్ని ఇచ్చింది.అందుకే నేను ప్రేమించిన - పేదవాడయిన సుబ్బారావు అనే అబ్బాయితో లేచిపోతున్నాను.

నా ప్రేమకి ధైర్యాన్ని నూరిపోసిన మీకు థాంక్స్....

మీ శిష్యురాలు,

సంధ్య!

సుందర్రావ్ బాలెన్స్ తప్పి... సోఫాలో పడబోయి నేలమీద కూలబడ్డాడు. కళ్ళముందు హఠాత్తుగా అర్ధరాత్రి అయినట్టు చీకటి. ఆ చీకటిలో




"రాస్కెల్.... గెటప్.... " అని క్రూరమయిన వాయిస్.

కళ్ళు నలుముకుని - చీకటిని దులుపుకుని చూసిన సుందర్రావుకి ఎదురుగా చంద్రశేఖరరావు గారు.... గదలేని భీముడిలా... పాశం లేని యముడిలా నుంచున్నాడు. ఆయన చేతిలో వాళ్ళమ్మాయి రాసిన మరో లెటర్ వుంది. ఆ లెటర్లో సారాంశం ఆయన మొహం అంతా వుంది.

"రాస్కెల్.... వుద్యోగం లేని వెధవ్వని - పాపకి పాఠాలు చెప్పరా అని తీసుకొస్తే పెద్దల్ని పట్టించుకోక -'ప్రేమ - పారిపో..." అని దగుల్బాజీ కోర్స్ చెబుతావా.... నువ్విచ్చిన ఎంకరేజ్మెంట్ వలనే ధైర్యం తెచ్చుకుపోతున్నా అని రాసింది. రేయ్ ... నా కూతురు కనక అది ఎవడ్ని కట్టుకున్నా క్షమిస్తాను. కానీ నిన్నూ..." ఏంచేస్తే బెటర్ అని ఆలోచించి... "షూట్ చేసినా పాపం లేదు. సమయానికి గన్... ఎక్కడ పెట్టానో మర్చిపోయా కనక బతికి పోయావ్... టైగర్'' అన్నాడు ఆయన. ఆవేశంతో ఆయన తన పేరు 'టైగర్' అనుకుని వాక్యాన్ని అలా ముగించడేమో అని ఫీలయిన సుందర్రావు కరక్ట్ పేరు చెప్పబోయి ఆగాడు. ఆయన వెనకనుంచి ఆయన ఆ రోజే కొన్న ఖరీదైన కుక్క ముందుకు వచ్చింది. సుందర్రావు గుండె ఆగినంత పని అయింది. 'కరిచే' తన కళానైపుణ్యాన్ని ప్రదర్శించనా అన్నట్టు ఆ కుక్క యజమాని వంక చూసింది. ఆయన అమిత - మితభాషి లాగ "ఉష్కో" అన్నాడు. అంతే!

## ఇంటింటి రామాయణం

బొమ్మలు: బాలి






చేతిలోంచి డిన్నర్ ప్లేట్లు జారిపడి కొన్ని పగిలితే - ఆ పగిలిన వాటిలో అంతకు ముందే పెచ్చులూడిన ప్లేట్లు ఉండవు గాక ఉండవు.

\- ఇంటిపనిలో సాయంచేసే భర్త

రేడియో ఆన్ చేయగానే వినబడే ఆఖరి చరణం మనకెంతో నచ్చిన పాటదే అయివుంటుంది.

\- సంగీతాభిమానిగోల






# ఒక్కసారి చెప్పలేవా...

ఈ పాటను వివరణాత్మకంగా
కావాలని కోరినది
**పి. జగదీష్ బాబు**, ఆమనగల్లు

| |
|---|
| చిత్రం : నువ్వు నాకు నచ్చావ్ (2001) |
| బ్యానర్ : స్రవంతి మూవీస్ |
| సమర్పణ : సురేష్ మూవీస్ |
| నిర్మాత : రవికిషోర్ |
| దర్శకత్వం : కె. విజయ భాస్కర్ |
| రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి |
| సంగీతం : కోటి |
| గానం : కుమార్‌సాను, చిత్ర |
| అభినయం : వెంకటేష్, ఆర్తి అగర్వాల్ |

సమస్య సున్నితమైనది. పరిస్థితి క్లిష్టమైనది. అటువంటి పరిస్థితిలో పాట... అదీ పదిమంది మధ్యలో పాడవలసిన సన్నివేశం... ఒకరి అభిప్రాయాలు ఇంకొకరికి చెప్పుకోవాలి. చుట్టూ ఉన్నవాళ్ళకి అర్థం కాకూడదు. నర్మగర్భంగా ఉండాలి. హృదయాల్ని ఆవిష్కరిస్తూ తేటతెల్లమవుతూ ఉండాలి...

ఇదీ రచయిత ముందు నిలిచిన సవాల్!
ఆ సవాల్‌కి నేపథ్యంగా ఉన్న కథేంటంటే...



ఆ : ఒక్కసారి చెప్పలేవా నువ్వు నచ్చావని
ఓ.. చెంత చేరి పంచుకోవా ఆశనీ శ్వాసనీ
మన గుండె గుప్పెడంతా తన ఊహ ఉప్పెనంతా
ఒదిగుండమనక ఒదిలేయమంటు బతిమాలుతున్న వేళా
అ : వెన్నెలేదో వేకువేదో నీకు తెలుసా మరీ
ఓ.. నిదురపోయే మదిని గిల్లి ఎందుకా అల్లరీ
అ : చందమామ మనకందదనీ
ముందుగానే అది తెలుసుకుని
చేయి చాచి పిలవద్దు అని
చంటిపాపలకు చెబుతామా
ఆ : లేని పోని కలలులెందుకని మేలుకుంటే అవి రావు అని
జన్మలోనె నిదురోకు అని కంటిపాపలకు చెబుతామా
అ : కలలన్నవి కలలని నమ్మనని
అవి కలవని పిలవకు కలవమని
మననడిగి చేరుతుందా ॥ఒక్కసారి॥
ఆ : అందమైన హరి విల్లులతో బంతివేసి చిరు జల్లులతో
చుక్కలన్ని దిగి వస్తుంటే కరిగిపోని దూరం ఉందా
అ: అంతు లేని తన అల్లరితో
అలుపులేని తన అలజడితో
కెరటమెగిరి పడుతూ ఉంటే
ఆకాశం తెగిపడుతుందా
ఆ: మనసుంటే మార్గం ఉంది కదా
అనుకుంటే అందనిదుంటుందా
అ : అనుకున్నవన్నీ మనకందినట్టె అనుకుంటె
తీరిపోదా ॥ఒక్కసారి॥

పెద్దలు కుదిర్చిన సంబంధానికి ఒప్పేసుకున్న ఓ అమ్మాయికి ఇంకో కుర్రాడిని చూడగానే గుండెల్లో ప్రేమ మొదలవుతుంది. ఆ అమ్మాయి తండ్రి, తన తండ్రి ప్రాణస్నేహితులని ఈ కుర్రాడికి తెలుసు. ఆ అమ్మాయి ఆ సంబంధాన్ని ఒదులుకుని తనకు దగ్గరవ్వాలని ప్రయత్నిస్తోంది. తనకు ఆ అమ్మాయిపై ఎంత అభిమానం ఉన్నా అది తమ పెద్దవాళ్ల మధ్య దూరాన్ని సృష్టించకూడదన్నదే ఈ కుర్రాడి మనసులో బాధ. అసలు జీవితమే ఓ రాజీ అని, చాలా విషయాలు మనకు ఇష్టం లేకుండానే జరుగుతూ ఉంటాయని, అడ్జెస్ట్ అయిపోతూ ఉండాలని చెబుతూ ఉంటాడు. ఆ అమ్మాయికివేవీ సమంజసంగా అనిపించవు. తనకు సంబంధం నిశ్చయం అయిన తరువాత ఇంకో కుర్రాడిపై ప్రేమ కలగటం... ఆ ప్రేమ రోజురోజుకీ పెరగటమే తప్ప తరగక పోవటం... ఇవన్నీ అంత కొట్టిపారెయ్య దగ్గ విషయాలు కావనీ ఆమె నమ్మకం.

అందుకే అడుగుతుంది- ఒక్కసారి చెప్పలేవా నువ్వు నచ్చావని... చెంత చేరి పంచుకోవా ఆశనీ శ్వాసనీ -అని! గుండె గుప్పెడంతే అయినా ఊహలు ఉప్పెనంత అంటూ వివరిస్తుంది.

దానికతడు - చందమామ మనకందదు. అది మనకు ముందుగానే తెలుసు. అలా అని చెయ్యి చాచి పిలవద్దని చంటిపిల్లలకు చెప్పం కదా... చందమామ రావే అంటూ ఆడిస్తాం కదా... నీతో నేను ఇన్నాళ్ళూ చనువుగా ఉండడం కూడా అలాంటిదే అని అనుకోవచ్చుకదా- అని వివరిస్తాడు.

ఆ ఆర్గ్యుమెంటుకి ఆమె మనసొప్పుకోదు - లేనిపోని కలల వల్ల ప్రయోజనం ఉండదు... సరే..., మేలుకుంటే అసలు కలలు వచ్చే అవకాశమే ఉండదు.. అలా అని జన్మలోనే నిద్దురపోకు అని కంటిపాపలకు చెప్పగలమా- ఆకలి, భయం, నిద్ర, సుఖంలాగ ప్రేమకూడా సహజమైనదే కదా అయినా మదినంటుకున్న మధురానుభూతి మన పర్మిషన్ అడిగి మనసులోకి వస్తుందా!?- అని ప్రశ్నిస్తుందతడిని. పైగా 'చుక్కలు దిగివచ్చినట్టుగా నా అంతట నేనే దిగి మరీ అడుగుతున్నాను కదా... అలాంటప్పుడు ఈ దూరాలు చెరిగిపోవా' అని బ్రతిమాలే ధోరణిలో అడుగుతుంది.

దానికతడు - "పిచ్చిదానా... కెరటం ఎంత ఎగిసి పడినా ఆకాశం తెగిపడదు కదా... అలాగే నేనంత ఆశపడినా నీవెంత మనసుపడినా ఇది జరిగే పనికాద'ంటాడు.

"మనసులో అనుకుంటే ఆ మాత్రం పరిష్కారం మన సమస్యకి దొరకపోతుందా" అని నిలదీస్తుందామె.

"అనుకోవటమే.. అసలు సమస్య మనకి. నన్ను నువ్వు కావాలనుకుంటున్నావు. మనవల్ల మన పెద్దలు వేరు కాకూడదని నేననుకుంటున్నాను. అన్నీ అనుకోవటంలోనే ఉన్నాయి కనుక నువ్వు కోరుకున్నవన్నీ నీకు అందాయనే అనుకుని తృప్తి పడవచ్చుకదా!?" అంటూ సైకలాజికల్‌గా కన్విన్స్ చేయడానికి ప్రయత్నిస్తాడు!

కథని, సన్నివేశాల్ని, పాత్ర స్వభాలను తీర్చిదిద్దటం ఎంత కష్టమైన విషయమో వాటన్నిటినీ ప్రతిబింబించేలా సంభాషణలు రాయటం అంతకన్నా కష్టం... ఎందుకంటే మనిషి స్వభావం, మదిలోని భావం తెలిసేది మాటబట్టేకదా...!

ఇదిలా ఉండగా... ఇదే సన్నివేశాన్ని పాట ద్వారా చెప్పాల్సివస్తే... ఎలా చెప్పాలి...!? ఓ వైపు భావం ఉన్నతంగా ఉండాలి... మరోవైపు భాష సామాన్యుడికి అందుబాటులో ఉండాలి... ఎట్ ది సేమ్ టైమ్... అందంగా ఉండాలి.!! ఎవరి వాదన వాళ్ళకి సబబుగా ఉన్నట్టుండాలి. ఈ అంతస్సంఘర్షణ అంతా కరక్టేనని ప్రేక్షకుడు ఫీలయ్యేలా ఉండాలి... లేకపోతే ఇంత శ్రమా వృధా అవుతుంది. పెట్టిన పెట్టుబడి బూడిదలో పోసిన పన్నీరవుతుంది. ఒక్కొక్కసారి అది కెరీర్‌కే ముప్పుతెస్తుంది.

ఇటువంటి సమయంలో రచయితకి భావసంపద, భాషాపరిజ్ఞానం మాత్రమే సరిపోవు వాటిని ఎంతమోతాదులో ఉపయోగించాలన్న తెలివీ, ఎంత కన్విన్సింగ్‌గా చెప్పాలన్న తేటా ముఖ్యం. అప్పుడే 'చంటిపాపలు/కంటిపాపలు' వంటి శబ్ద సౌందర్యాలు, 'మది మీటుతున్న మధురానుభూతి మననడిగి చేరుతుందా' వంటి శాశ్వతంగా నిలిచిపోయే ఆలోచనా భరితమైన అమృతాక్షరాలు పుడతాయి.

ఈ పద్ధతిలో ఆలోచించుకుంటూ పక్కనున్న పాటని ఎన్నిసార్లు వీలైతే అన్నిసార్లు చదువుకోండి. ఎప్పుడు వీలుంటే అప్పుడు ట్యూన్‌తో సహా వినండి. మనసు ప్రశాంతంగా ఉన్నప్పుడు మళ్ళీ మళ్ళీ తలచుకుంటూ బేరీజు వేసుకోండి- ఇది ఎంత గొప్ప పాటో తెలుస్తుంది!!

# 16-31, అక్టోబరు 2001 సంచికలో శ్రీ జనార్ధన మహర్షి రాసిన "గుడు గుడు గుంచం" కథకు వచ్చిన స్పందన



"గుడుగుడు గుంచం"... గురించి కొంచెం

మనిషి... అత్యాశకు, అజ్ఞానానికి, మనసులోపలి అంధకారానికి కారణం 'కోరిక' అన్నాడు బుద్ధుడు.

"నిన్ను నిన్నుగా ప్రేమించుటకు... తోడొకరుండిన అదే భాగ్యము" అని పాటలో శ్రీశ్రీ అనేసాడు గానీ... అది సాధ్యమవద్దూ.

'To be... or not to be' అన్నది హామ్లెట్ కాలంనుంచి నేటి ఇంటర్నెట్ కాలం వరకూ ఉన్న జబ్బే!

డబ్బు, పొజిషన్, అందమైన భార్య వున్నవాడ్ని చూసి... ఆ... వాటిల్లో ఏవుంది... ఆ మాత్రం మనం సాధించలేమా... అనుకుని తమ చేతకానితనానికి అందమైన ముసుగుల్ని వేసుకోవటం... ఆ ముసుగు లోపల వూపిరాడక... సబ్‌కాన్షియస్‌లో.. సుబ్బలక్ష్మి అయితే... ఎంత బావుండేదో... అనుకుని... అందని రిమోట్ కోసం... శూన్యంలో చేతుల్ని ఆడించటం అందరూ చేసే పనే!...

ఈ కథలోని అటెండర్ సుబ్రమణ్యం లాగా... ప్రతి ఒక్కరిలోని... ఇంకో మనిషి.. మనీ కోసమో... పొజిషన్ కోసమో... అందమైన భార్యకోసమో... అసంతృప్తితో... అలాగైతే ఎలాగుండేదో... అనుకోవటం... కామన్...

అందుకే... ప్రతి మనిషి.. జీవితంలో... ఏదో ఒక బిందువు వద్ద సంతృప్తి పడాలి... అలా పడలేనప్పుడు... అసంతృప్తి అంటుకుంటే... అది జీవితాల్ని... ప్రతి సందర్భంలోనూ కాలుస్తూనే వుంటుంది... అన్న విషయాన్ని... క్లుప్తంగా... గుప్తంగా... తనదైన హాస్య ధోరణిలో... నడిపిన జనార్ధన మహర్షి అభినందనీయుడు... ఎందుకంటే...

Comedy is nothing but the zenith of tragedy కాబట్టి!

అభినందనలతో

**-త్యాగరాజ ఎం., యూసఫ్ గూడ బస్తీ,**
8-3-256 హైద్రాబాద్

ప్రస్తుత రొటీన్ స్టీరియోటైప్డ్ అన్‌క్లియర్ అస్పష్ట జాడ్యపు హాస్పిటల్ రొచ్చు కంపు దురవస్థా నరకంలోకి-సాహితీ కూపంలోకి-నాటి భారత ఇతిహాసంలో మహా ప్రస్థాన పర్వంలో కర్ణునితో సహా భీమార్జున, నకుల సహదేవ కుంతీ పాంచాల్యాదులు నరకంలో బాధలు పడుతుంటే ధర్మరాజు ఆగమనంతో సుగంధ పరిమళ భరిత శీతల వాయువులు వీచి ఆ పుణ్య స్పర్శకి పులకించి పోయిఆయనని అక్కడనే ఉండి పొమ్మన్నారట. అలాంటి పవిత్ర భావననే మీ కథ కలిగించిందంటే అది ఎటువంటి పరిస్థితుల్లోనూ ముఖస్తుతికాదు! అతిశయోక్తి కాదు! ఏమనుకోకండి! మీ ప్రాపకం కోరి అస్సలే కాదు. నిజాయితీగా అక్షరాలా సాక్షిగా మనస్ఫూర్తిగా చెబుతున్నాను. మీ కథకి సొంత గొంతుక ఉంది. భేష్ శభాష్ అనే పెద్దరికం నాకులేదు గనుక భళా అని అనే అధికారం లేదు గనుక చాలా రసవంతంగా ఉంది అంటున్నా.

ముఖ్యంగా... ఇందులో...

పానుగంటి లక్ష్మీనరసింహం, చిలకమర్తి నరసింహం తాతయ్యలయొక్కా... మనిమాణిక్యం, శ్రీపాద సుబ్రహ్మణ్యం, ముళ్ళపూడి రమణ అంకుళ్ళయొక్కా కొడవటిగంటి అన్నయ్య్య -ప్రహసనాల గల్పికలయొక్క పోలికలు పుణికి పుచ్చుకుందీ చిన్నారి కథ. చాల్లెద్దురూ బడాయి... మన సత్తిగాడు ఎంత మనం సృష్టించిన క్యారెక్టరైతే మాత్రం కాయిన్ విసిరితే ముష్టివెధవ బొచ్చెలో పడితే అందులో. కరెక్టుగా 40 కాయిన్లే ఉండి అంత ఖచ్చితంగా సగం బొమ్మలు సగం బొరుసులుగా ఎలా ఉంటాయి?

శైలి విషయానికొస్తే వైవిధ్య భరితంగా ఉంది. శిల్పంలో రచనా చాతుర్యం బాగా వ్యక్తమైంది. మనిషిలోని డైలమేటిక్ ట్రెండ్, స్వైరకల్పనల అలవాటూ, ఆర్థిక పోరాటమూ, జీవన వైఫల్యాలు, రేఖా మాత్రంగా స్పర్శించే వేదనా విచారం, నిరుత్సాహం, ఆశా చాపల్యం, ఆరాటం, అసూయ, అనుమానం, ఆర్భాటం, ఆవేశం, ఆనందంలాంటి అనేకానేక మిశ్రమ లక్షణాలు కలిగిన మధ్యతరగతి ఆనందార్ద్రుల చిత్రణమిది. మేరు పర్వతాన్ని మించలేక కుళ్ళుతో కుచ్చితంతో ఉడికిపోయి బ్రతుకంతా ఏడుపుమయం చేసుకుని నారదుని వద్ద వాపోయిన వింధ్య పర్వతాన్ని గుర్తుకుతెస్తోందీ కథ. మీరు కెమేరా ముందు నిల్చుని కామెంట్రీ ఇస్తూ ఈ పాత్రలను సజీవంగా పరిచయం చేస్తూ ఓ సందేశాత్మక ప్రదర్శన యిస్తున్న అనుభూతి నాకు కలుగుతోంది. అయితే ఇదొక గొప్ప సాహసమే కాగలదు. కథకన్నా వస్తువుకన్న, విషయం కన్నా, టెక్నిక్ డామినేషన్ కూడా యిందులో లేక పోలేదు.

ధన్యవాదాలతో

**-వి.ఎ.కె.ఎ.శర్మ కావలి.**

* * * * * * * * * * * * * * *

ధనార్జన మహర్షి గారి 'గుడుగుడు గుంచం' కథ 'హాసం' పత్రికలో చదివి, ఆయనపై మాకున్న అభిమానాన్ని ఇంకా వృద్ధి చేసుకున్నాము.

జీవితంలో ఇంచుమించుగా ప్రతీ ఒక్కరికి ఎదురయ్యే సందిగ్ధావస్థ తద్వారా అసంతృప్తి మీ కథలో సాక్షాత్కరించాయి. నవ్వించి చదివించే ఈ కథ కొద్దిగా... కాదు కాదు.. 'ఎక్కువ'గానే ఆలోచింపజేసింది.

కథ చదువుతుంటే... ఎందుకో చెప్పలేను కాని... శ్రీ రమణ గారి 'వాడు-నేను' అనే ఓ చిన్న కథ జ్ఞప్తికి వచ్చింది (దానిని 'కథ' అని అనకూడదేమో)

మరొక విషయం -టైటిల్ 'గుడుగుడు గుంచం' నాకు ఎంతో బాగా నచ్చింది. ఎందుకంటే అదే సందేహాల పుట్ట కనుక.

**-శరత్, బేగంపేట్, సికింద్రాబాద్.**

* * * * * * * * * * * * * * *

**'హాసం'** పత్రికలో ప్రచురితమైన ఈ కథను చదివాను. పేరు చదవగానే చిన్నతనపు ఆట గుర్తుకొచ్చింది. కథ ఆసాంతం చదివాక ఈ కథకు తగిన పేరు అనిపించింది. గానుగెద్దు జీవితానికి గమ్యం లేనట్టే ఈ వేళ ప్రతి మనిషిలో పెరిగిపోతున్న అశాంతికి, చిత్త చాంచల్యానికి ప్రధాన కారణం తృప్తి లేక పోవడం. ప్రతీదానికి బాధపడటం ఓ రోగం ప్రతి బాధను ఆనందంగా మలచుకోవడం ఓ భోగం.

మనిషి కృషితో ఋషిలా గడిపితే బ్రతుకే ఓ పండగని, లేకుంటే జీవితం దండగని అర్థం వచ్చేలా ఈ చిన్నకథలో పెద్దసత్యం ఆవిష్కరించారు. అక్షరాభ్యాసం నాడే అమెరికా యాత్ర ఊహల్లో పరుగులు పెడుతూ అలిసిపోయే నేటి యువతకు ఈ కథ ఓ కనువిప్పు. వెరైటీగా కథా గమనం సాగింది. ధన్యవాదాలు.

**-పెండ్యాల సుబ్బారావు, కాకినాడ.**

అసంఖ్యాకంగా వచ్చిన ఉత్తరాలలో పై నాలుగు బావున్నాయని వాటిలో త్యాగరాజు ఎం. రాసిన లెటర్ బహుమతికి అర్హమైనదని జనార్ధన మహర్షి తెలిపారు.

ప్రకటించిన ప్రకారం బహుమతి గ్రహీతకు 6 నెలలపాటు 'హాసం' పత్రికను ఉచితంగా పంపుతున్నాము. తక్కిన ముగ్గురికీ 'హాసం' 16-30 నవంబరు,2001 సంచికను సముచితంగా పంపుతున్నాము.

-ఎడిటర్




## నువ్వు - నేను



'చిత్రం'తో అనుకోకుండా హీరో అయిపోయిన ఉదయకిరణ్ రెండో సినిమా కోసం ఏడాదిన్నర ఆగి మళ్ళీ తేజ దర్శకత్వంలోనే 'నువ్వు-నేను' చేసాడు. 'ఫ్యామిలీ సర్కస్' పరాజయం వల్ల తేజ సక్సెస్ సాధిస్తాడని ఎవ్వరూ నమ్మలేదు. హీరోగా ఉదయ్‌కిరణ్‌ని అంతకన్నా నమ్మలేదు. అయితే 'నువ్వు నేను' సినిమా రిలీజై కుర్రకారు గుండెల్లో తిష్ట వేసింది. ఉదయకిరణ్ క్రేజీస్టార్ అయిపోయాడు. ఈ ఇరవయ్యేళ్ళ కుర్రాడిని తన సినిమాలో ఏ పాట బెస్ట్ అనేది చెప్పమంటే ఠక్కున చెప్పలేదు. బాగా ఆలోచించాడు. అలా ఆలోచించిన తర్వాత 'నా గుండెలో నీవుండి పోవా', 'గాజువాక పిల్లా' ఈ రెండు పాటలూ నాకిష్టమే. ఒకటి పార్టీ సాంగ్ అయితే, మరోటి ఫోక్ సాంగ్. ఈ రెండింటికీ చాలా కష్టపడి, యిష్టపడి డాన్స్‌లు చేసాను. ముఖ్యంగా గాజువాక పిల్లలాంటి ఫాస్ట్‌బీట్ సాంగ్‌లంటే ఎవరికి మాత్రం ఇష్టముండదు!? ఆ పాటను ఆలపిస్తుంటేనే ఓ ఊపు వస్తుంది" అని చెప్పాడు ఉదయకిరణ్.

## డాడీ



ఈ సినిమాలో చిరంజీవికి ప్రాణ స్నేహితుడిగా నమ్మించి, డబ్బు కోసం ఆ స్నేహాన్ని దుర్వినియోగం చేసుకుని, చివర్లో ఆ స్నేహితుడి వల్లనే ప్రాణాలు నిలబెట్టుకున్న వ్యక్తిగా నటించిన అచ్యుత్‌ని 'డాడీ'లో మీకు నచ్చిన పాట ఏదని అడగ్గానే ఠకీమని 'గుమ్మాడీ గుమ్మాడీ ఆడిందంటే అమ్మాడీ, డాడీ ఊపిరిలో మురిసే కూచిపూడి' అని చెప్పారు. "ఏంటండీ.... ముందే ప్రిపేర్ అయినట్టు అడగ్గానే ఠక్కున ఈ పాట చెప్పేసారు" అని అంటే "ఆ పాటతో నాకు మంచి అనుబంధం వుంది. ఆ పాటలో నేను నటించలేదు గానీ, నన్ను నేను మాత్రం చూసుకున్నాను. నేను, మా పాప పాడుకుంటున్నట్టే అనిపించింది. తండ్రీ కూతుళ్ళ మధ్య వుండే అనురాగానికి నిలువుటద్దం ఆ పాట, నాలాగే అందరు తండ్రులూ ఈ పాటలో తమని తాము చూసుకుని మురిసిపోయింటారు. ఆ పాటని వింటున్నా చూస్తున్నా నాలో నేను లవ్లీగా ఫీలవుతుంటాను" అని చెప్పారు అచ్యుత్.

## నువ్వు నాకు నచ్చావ్



'మీకు ఇష్టమైన పాట ఏది' అడగ్గానే "నా చూపే నిను వెదికినది నీవైపే నను తరిమినది నాకెందుకిలా అవుతోంది. నా మది నడిగితే చెబుతుంది నువ్వే నువ్వే తనలోనే ఉన్నావంటూ నీకే నీకే చెప్పాలి అంటున్నది" అంటూ మొత్తం పల్లవి అంతా పాడి వినిపించారు జెడి చక్రవర్తి. స్రవంతి మూవీస్ బేనర్‌తో ఈయనకు మంచి అనుబంధముంది. ఇంతకుముందు ఈయన ఈ బేనర్‌లో 'ఎగిరే పావురమా' అనే మ్యూజికల్ హిట్ పిక్చర్ చేసారు.

ఇలా తనకు ఇష్టమైన పాట గురించి వివరణ ఇస్తూ "పాట మెలోడియస్‌గా వుండటం ఒక కారణమైతే, ఇందులో మాటలు స్పష్టంగా వినిపిస్తున్నాయి. అన్నిటికీ మించి సందర్భోచితంగా వుంది. చాలామంది కేవలం వినడానికి మాత్రమే బాగుండేలా పాటలకు ప్రిఫరెన్స్ ఇస్తారు. సందర్భం గురించి అంతగా పట్టించుకోరు. ఇందులో సమయం, సందర్భం, సాహిత్యం, సంగీతం అన్నీ సమపాళ్ళలో కలిసాయి. అందుకే నన్ను బాగా ఆకట్టుకుంది. నిజం చెప్పాలంటే సినిమా నేనింతవరకూ చూడలేదు. అయితే పాట నచ్చింది. పాటలోని మాట నచ్చింది. మాటలోని మనసు నచ్చింది. మనసులోని ప్రేమ నచ్చింది" అని చెప్పారు జెడి. ఈ సందర్భంగా పాటను ఆలపించిన చిత్రను ప్రత్యేకంగా ప్రశంసించారాయన.

## మనసంతా నువ్వే



సింగీతం శ్రీనివాసరావు, జయంత్ వంటి ప్రముఖ దర్శకుల వద్ద పని చేసిన ఆదిత్య 'మనసంతా నువ్వే' చిత్రంతో బిజీ దర్శకులయిపోయారు. ఈ సినిమాలో ఆయనకి 'కిటకిట తలుపులు" పాటంటే చాలా యిష్టమట. "ఆ పాటతో నాకు పర్సనల్‌గా ఓ ఎటాచ్‌మెంట్ వుంది. దర్శకుడినయ్యాక నేను ఫస్ట్ ఓకే చేసిన ట్యూన్ అది. అలాగే ఫస్ట్ ఆ పాటకే లిరిక్ రాయించుకున్నాను. మొట్టమొదట నేను చిత్రీకరించిన పాట కూడా అదే" అని చెప్పుకొచ్చారు ఆదిత్య. ఈ ప్రేమకథాచిత్రంలో పిల్లల మీద ఆ పాట ఎందుకు తీసారని అడిగితే - "పన్నెండేళ్ళ పాటు ఆ అమ్మాయి, అబ్బాయి ఒకరినొకరు గుర్తు పెట్టుకోవాలంటే మంచి డెప్త్ కావాలి. ఆ డెప్త్ కోసమే ఆ పాట పెట్టడం జరిగింది. ఆ పాట చిత్రీకరణ విషయంలో చాలా కేర్ తీసుకున్నాను. ఒక్క ఇంచ్ రాంగ్ స్టెప్ వేసినా ఆ డెప్త్ మిస్సయ్యేది. నాకిష్టమైన విజువల్స్ ఆ పాటలో వున్నాయి. అరకులోయలోని అందమైన ప్రదేశాల్లో ఆ పాట తీసాం" అని వివరించారు ఆదిత్య.

# ఆనందం



'బాచి', 'ఇట్లు శ్రావణిసుబ్రమణ్యం' చిత్రాలతో మ్యూజిక్ డైరెక్టర్‌గా మంచిరేంజ్‌ని సంపాదించుకున్నారు చక్రి. 'ఆనందం'లో మీకు నచ్చిన పాట ఏదని చక్రిని అడిగితే "కనులు తెరిచినా కనులు మూసినా కలలు ఆగవేల, నిజము తెలిసినా కలని చెప్పినా మనసు నమ్మదేల' పాట ఆ ఆడియోలోనే హైలెట్. ట్యూన్‌తో పాటు లిరిక్స్ కూడా చాలా హార్ట్ టచింగ్‌గా వున్నాయి. లిరిక్ పాడుకోవడానికి కూడా చాలా ఈజీగా వుంది. దేవిశ్రీప్రసాద్ ఇచ్చిన మంచి ట్యూన్‌కి మంచి సాహిత్యం జతకలవడంతో పాట వింటుంటే ఎక్కడో తెలియని 'ఆనందం'. సాధారణంగా ట్యూన్ బాగున్నా గానీ, సాహిత్యం ఎక్కడెక్కడికో అర్థంగాని విధంగా వుంటుంది. కానీ ఈ పాటలో అందరికీ తెలిసిన పదాలు వున్నాయి. 'అద్దంలో నా బదులు అరె నువ్వే కనిపించావే నేనే ఇక లేనట్టే నీలో కరిగించావే' లాంటి మంచి చరణాలు మనసుని కదిలిస్తాయి' అని వివరించారు.

# స్నేహమంటే ఇదేరా



పరిశ్రమలో అడుగు పెట్టిన అతి కొద్దికాలంలోనే అవార్డుల దాకా వెళ్ళిపోయిన గీత రచయిత కులశేఖర్. 'స్నేహమంటే ఇదేరా' సినిమాలో ఆయన రాసిన టైటిల్‌సాంగ్ చాలామంది ప్రశంసలనందు కుంటోంది. ఆ సినిమాలో 'మీకే పాట యిష్టం.... ఎందువల్ల!?' అని అడిగితే కులశేఖర్ చెప్పిన సమాధానం ఇదీ. "రాముడు విభీషణుడితో, సుగ్రీవునితో, హనుమంతుడితో, గుహుడితో, ఆఖరికి ఉడతతో కూడా తన సౌహార్ద్ర హృదయాన్ని పంచుకున్నాడు. అంటే తన స్నేహబంధాన్ని అన్ని స్థాయిల్లోనూ వెదజల్లాడన్నమాట. అందుకే 'నరాణం వానరాణాంచ కథ మాశీత్ సమాగమః' అని రామాయణంలో వాల్మీకి చెప్పారు. ఆ శ్లోకం ప్రేరణగా 1986లో నేను 'రామరసవాహిని' అనే పుస్తకంలో 'ప్రకృతి ఒడిలో ఆకృతిదాల్చిన స్నేహమిది అంది. స్నేహానికి అవధులు లేవంది' అంటూ వర్ణించడం జరిగింది. అవన్నీ 'స్నేహమంటే ఊపిరికదరా" పాట రాస్తున్నప్పుడు ఉపయోగ పడ్డాయి. అందుకే 'సృష్టికి అనాదిగాను పునాదిరాయి స్నేహమేరా' అంటూ రాయడం జరిగింది అంటూ ఆ టైటిల్ సాంగ్ గురించి లోతుగా వివరించాడతడు.

# స్టూడెంట్ నెం.1



ప్రముఖ నటులు దేవదాస్ కనకాల తనయుడైన రాజీవ్ కనకాల తండ్రి బాటలోనే నడిచి నటుడిగా మంచి పేరు సంపాదించుకున్నాడు. బుల్లి తెరపై ఆల్ రౌండర్ అనిపించుకున్న రాజీవ్ కొన్నాళ్ళుగా సినిమాల్లో బ్రేక్ కోసం ప్రయత్నిస్తున్నాడు. 'స్టూడెంట్ నెం.1' చిత్రం రాజీవ్‌కి ఆ బ్రేక్‌ని యిచ్చింది. ఇందులో హీరో జూ. ఎన్‌టిఆర్‌కి దీటైన పాత్ర పోషించి మెప్పించాడు. ఇష్టమైన పాట ఏదంటే 'ఫేర్‌వెల్ సాంగ్' అని చెప్పాడు. కుర్రాళ్ళు కాబట్టి ఈ పాట నచ్చిందా అని అడిగితే "ఏమండీ.... ఈ పాట కుర్రాళ్ళకే పరిమితం కాదు. హైస్కూలు చదివే కుర్రాళ్ళ దగ్గర్నుంచీ, రిటైరై పోయిన వాళ్ళ వరకు అందరికీనచ్చుతుంది. అలాగే తామూ ఫేర్‌వెల్ చేసుకోవాలని కుర్రాళ్ళు భవిష్యత్తుకోసం ఉవ్విళ్ళూరితే వయసయిపోయిన వాళ్ళు తమ కాలేజీ స్మృతుల్ని మళ్ళీ వెలికి తీసుకుని మురిసిపోతారు. ఈ పాట అందుకే అందర్నీ ఆకట్టుకుంది. నేను కూడా కాలేజ్ ఏజ్‌లో అల్లర్లు చేసాను. ఈ పాట వింటుంటే ఆ అల్లర్లు అన్నీ గుర్తుకు వస్తున్నాయి. పాట మంచి ఫీల్‌తో రాసారు. చిత్రీకరణలో కూడా మంచి ఫీల్ వుంది. సరదా కోసమే ఈ అల్లర్లు చేసామని పాజిటివ్ వేలో చెప్పడం బాగుంది. అన్నాళ్ళు కలిసిమెలిసి తిరిగిన వాళ్ళు విడిపోయే ముందు కలిగే ఎమోషన్‌ని పాటలో బాగా నింపారు" అని చెప్పాడు రాజీవ్ కనకాల.

# ఇట్లు శ్రావణి సుబ్రమణ్యం



'సిందూరం'లో హీరోగా చేసిన రవితేజ ఆ తర్వాత చాలా సినిమాలు చేసినా గానీ సరైన బ్రేక్ రాలేదు. అంతా 'సిందూరం - రవితేజ' అనే అంటారు. దాన్ని బ్రేక్ చేసి రవితేజకుకొత్త లైఫ్‌ని యిచ్చిన సినిమా 'ఇట్లు.... శ్రావణి సుబ్రమణ్యం'. మ్యూజికల్ హిట్టయి శతదినోత్సవం వైపు పరుగులు తీస్తున్న ఈ చిత్రంలో తనకు బాగా నచ్చిన పాట ఏదని అడిగితే రవితేజ ఇలా చెప్పుకొచ్చారు. 'మళ్ళీ కూయవే గువ్వా', 'హేపీడే...' ఈ రెండు పాటలూ నా కిష్టమే. ముఖ్యంగా 'హేపీడే' పాటంటే మరీమరీ ఇష్టం. ఆ పాటలో మంచి బీట్ వుంది. విన్న వాళ్ళకి, చూసేవాళ్ళకి హుషారునిస్తుందీ పాట. తను ఎవరికోసమైతే ఆత్రంగా ఎదురు చూస్తున్నాడో ఆ అమ్మాయి క్షేమంగా వుందని తెలిసిన క్షణం అతని హృదయంలో పొంగే ఆనంద సముద్రపు కెరటమే ఈ పాట" అని అన్నారు రవితేజ.

# ఖుషీ



'బ్యాచిలర్స్' 'కాలేజ్' తదితర చిత్రాల్లో హీరోగా నటించిన శివాజీ 'ఖుషీ' సినిమాలో పవన్‌కళ్యాణ్ స్నేహితుడుగా సినిమాలో ఆయువు పట్టులాంటి పాత్రను పోషించారు. అసలు శివాజీ ప్రేమకోసమే ఆ సినిమాలో పవన్‌కళ్యాణ్, భూమికలు ఏకమవుతారు. 'ఖుషీ' సినిమాలో తనను ఖుషీ చేసిన పాట గురించి శివాజీ చెబుతూ 'గజ్జె ఘల్లుమన్నాదిరో - గుండె జల్లుమన్నాదిరో' పాటంటే నాకిష్టం. ఎందుకిష్టమంటే మాత్రం కరెక్ట్‌గా చెప్పలేను. కొన్ని కొన్ని అంతే. మనసుకి నచ్చేస్తాయ్. ఆ ట్యూన్ బాగుంది నచ్చింది" అని తెలిపాడు.

# జాబిలి



రోజా మూవీస్ అనగానే మనకళ్ళముందు ఎన్నో హిట్ సినిమాలు కదలాడతాయి. ఆ పతాకం పేరిట ఎం.అర్జునరాజు నిర్మించిన 'జాబిలి' సినిమా ఈ పత్రిక మీ చేతుల్లోకి వచ్చే సరికి థియేటర్లో ఉంటుంది. 'జాబిలి' సినిమాలో 'చిగురాకు ఎవరో చినుకైనదెవరో చిగురంత పేరే ప్రేమ' పాట తనకు నచ్చిన పాటగా పేర్కొంటూ "ఈ పాటలో సెంటిమెంట్ ఉంది. యూత్‌ఫుల్ పెయిన్ ఉంది. పెయిన్ అంటే ఏమిటో అనుకునేరు. యువతకు కావలసిన తియ్యనిబాధ అన్నమాట. అది ఖచ్చితంగా హృదయాలను పట్టేస్తుంది. పాడిన ఉన్నికృష్ణన్ వాయిస్ ఈ పాటకు ఎసెట్. వీణ తీగలు ఆయన గొంతులో ఉన్నాయేమోనన్నట్టు గుండెను మీటుతున్నట్లు పాడేడు. ఇక రచయిత అశోక్ తేజ ప్రేమను నిర్వచించటంలో బ్యూటిఫుల్ ఎక్స్‌ప్రెషన్స్ ఇచ్చాడు. ఓ వైపు అర్థం అవుతూనే మత్తుగా, మెత్తగా, హత్తుకునేట్టు రాశాడు. ప్రేమను కృష్ణపరంగా చెప్తారు కాబట్టి ఈ ప్రేమగీతంలో 'కృష్ణమాయ'... అంటే చిత్రీకరణ పరంగా దర్శకుడు కృష్ణారెడ్డి చేసిన మాయకూడా గమ్మత్తుగా ప్రేక్షకులను ఆకర్షిస్తుంది. అందుకే నాకీపాట నచ్చింది" అని తెలిపారాయన.



హాస్యచిత్రాలు ఇతోధికంగా రావడానికి "హాసం" చేసే కృషిలో భాగంగా

**పి.జి.ఉడ్‌హౌస్** రాసిన

'మాంటీపెర్ల్‌స్' అనే నవల కథా సంగ్రహం ఇస్తున్నాం.

రకరకాల హాస్య పాత్రలు, పలురకాల హాస్య సంఘటనలు గల

ఈకథ సినిమావారికి సెంట్ పర్సంట్ ఫిట్.

చదివి పాల్గొనే పాఠకులకి థౌజెండ్ టైమ్స్ బెనిఫిట్.

అదేమిటో కథ పూర్తయ్యాక తెలుస్తుంది. ఇక కథ చదవండి మరి-






# ప్రేమకోసమై జాబులోపడెనే...

అనగనగా హీరో.

అతనికి వారసత్వంలో డబ్బు కలిసివచ్చింది.

అతనికో గర్ల్ ఫ్రెండ్.

వాళ్ల నాన్నకీ డబ్బుంది కానీ కష్టార్జితంపై ఆధారపడిన వాడికే కూతుర్నిస్తానన్నాడు.

అందుచేత వారసత్వపు డబ్బు ముట్టుకోకుండా డబ్బు సంపాదించి ఆయనకి చూపిద్దామని హీరో తాపత్రయం.

## ఇంటింటి రామాయణం

బొమ్మలు: బాలి



ఎంత ఎత్తు నుంచైనా పడొచ్చు గానీ నేల మీద నుండీ ఎవరూ పడలేరు.

- సహజ సూత్రం



ఈ సహజ సూత్రాన్ని నేర్చుకోవడానికి పసిపాపలకు మూడేళ్లు పడుతుంది.

- ఓ తల్లి



ఈ సూత్రాలేవీ తాగుబోతులకు వర్తించవు

- అనుభవజ్ఞురాలి ప్రకటన





ఓసారి ఓడలో హీరో, గళ్ ఫ్రెండు వస్తూండగా ఓ డబ్బున్నాయన, భార్య కనబడ్డారు. భార్యకో ఖరీదైన నెక్లెసు ఉంది కానీ అది బయటపడితే పన్ను కట్టవలసి వస్తుంది. అది అవిడకి సుతరామూ ఇష్టం లేదు. హీరో, ఫ్రెండు కలిసి టెడ్డీబేరులో పెట్టి ఆ నెక్లెసును బయటకు స్మగుల్ చేసే శారు. తర్వాత పోలీసులకి చెప్పేస్తామని ఆయన్ని బెదిరించారు. డబ్బున్నాయన 'ఎవరికీ చెప్పక, మా అడ్వర్టయిజ్మెంట్ కంపెనీ ఓ బ్రాంచ్‌లో ఉద్యోగం ఇస్తా. చేసుకో'' అన్నాడు.

హీరో పని చేసే కంపెనీలోనే అతని సెక్రటరీగా ఓ అమ్మాయి చేరింది. అతనంటే ఆరాధన పెంచుకుంది. కానీ హీరో ఆలోచనలన్నీ గళ్ ఫ్రెండ్ చుట్టూరా తిరుగుతూ ఉంటాయి. సెక్రటరీని ఓ ఫ్రెండుగా భావించి విషయాలన్నీ చెబుతుంటాడు. ఓ ఏడాది నడిపాక ఇక చాల్లే అనుకుని బ్రాంచ్ మూసేసాడు. సెక్రటరీని వేరేచోట ఉద్యోగం చూసుకోమని చెప్పాడు. గళ్‌ఫ్రెండు తండ్రి వద్దకు వెళ్లి పెళ్లికి అనుమతి అడిగేడు. నువ్వు ఈ ఉద్యోగం ఎలా సంపాదించావో మా అమ్మాయి చెప్పేసింది. ఇది కష్టార్జితం కాదు. వెళ్లి కష్టపడి సంపాదించుకురా అన్నాడు. చేతిలో డబ్బున్నా హీరో ఉద్యోగం వేటలో పడ్డాడు. అప్పుడు అక్కరకు వచ్చింది సెక్రటరీ.

ఇప్పుడా అమ్మాయి ఓడలో కలిసిన డబ్బున్నాయన భార్య దగ్గర సెక్రటరీగా పని చేస్తోంది. ఆవిడ ఆయనకు ఐదవ భార్య. చాలా డామినేటింగ్. డబ్బున్నాయనకు పేరుకే డబ్బుంది. కానీ అంతా భార్యతో జాయింటు ఎక్కవుంటులో ఉంది. అనుభవించడానికి లేదు. మనసారా తిండి తినడానికి లేదు. (అనారోగ్యం ఉందిలెండి). సెక్రటరీ తన యజమానురాలి వద్దకు హీరోని తీసుకెళ్లి ఓ జమీందారు మేనల్లుడని చెప్పి, ప్రస్తుతం ఉద్యోగం కావాలని చెప్పింది. డబ్బున్నాయన కారు డ్రైవరుగా మాత్రమే ఉద్యోగమే ఖాళీ ఉందంటే దానికి సరేనన్నాడు హీరో. తన స్వంత డబ్బుతో ఆయనకు అవీ ఇవీ కొనిపెట్టి ఆత్మీయుడయి పోయాడు. భార్య అతనిచేత బలవంతంగా డైటింగ్ చేయిస్తూంటే జాలిపడ్డాడు. ఓ అర్థరాత్రి సెక్రటరీ ప్రోద్బలంతో ఆయనకోసం కేకు పట్టుకెళుతూంటే ఆయన సవతికూతురు కళ్లల్లో పడ్డాడు. ఆమె ఇతన్ని దొంగ అనుకుని గదిలో పెట్టి గడియవేసింది. డబ్బున్నాయన సహాయంతో హీరో ఎలాగోలా తప్పించుకుని బయటపడ్డాడు.

ఈ సవతికూతురు డబ్బున్నాయన ప్రస్తుత భార్యకు పూర్వ వివాహం వల్ల పుట్టిన అమ్మాయి. పెళ్లి కాలేదు. వేరేచోట ఉంటుంది. తల్లి దగ్గర ఉన్న ఓ ఖరీదైన ముత్యాలహారం గురించీ మహావర్రీ అవుతూ ఉంటుంది. దాన్ని పెళ్లికి బహుమతిగా ఇస్తానని తల్లి ప్రామిస్ చేసింది. అదెక్కడ పోతుందోనని ఆమెకు భయం. తల్లికి చెప్పి ఓ డిటెక్టివ్‌ను ఏర్పాటు చేయించింది. వాడే ఓ నాసిరకం దొంగ. ఆర్భాటం చేసుకుంటూ వచ్చేసరికి ఇంట్లో అప్పటికే తిష్ట వేసుకుని కూచున్న ఓ టక్కరిజంట కనబడ్డారు. ఆ జంటలో భర్త స్కీములు పేరు పెట్టి జనాలను ఆకర్షిస్తూ ఉంటాడు. భార్య ఇంకా ధైర్యవంతురాలు. సమయం చూసి వస్తువులు మూట గట్టుకుని పారిపోతూ ఉంటుంది. వాళ్లను చూడగానే గుర్తుపెట్టి డిటెక్టివ్ బేరానికి దిగాడు. వీళ్ల దగ్గర్నుంచి హారం కొటేద్దాం. నాకు 60% తక్కినది మీకు అన్నాడు. ఆ పప్పులేం ఉడకవ్ అన్నారు వాళ్లు. పగలు హీరోని చూసి సవతికూతురు అనుమానపడింది. రాత్రి తనకు ఎదురయిన దొంగ

## ఇంటింటి రామాయణం

బొమ్మలు: బాలి

భూమికి సమాంతరంగా ఉండే ఏ ఖాళీ జాగాయైనా సరే చూస్తుండగానే వస్తువులతో నిండి పోతుంది.

- ఓ ఇల్లాలి గోడు



ఓ గృహస్తు తన ఇంట్లో కదలకుండా నిలబడడానికి, టవల్ స్టాండుగా మారడానికి మధ్య వ్యవధి పది నిమిషాలు!

- నస్మరంతి టైపు తండ్రి తీర్పు



వీడేనా అని, తల్లిని హెచ్చరించబోయింది. 'అబ్బే, అతను ఓ జమీందారు మేనల్లుడు' అని కొట్టి పారేసింది తల్లి. హారం కొట్టేయడానికి టక్కరిజంట ఓ ప్లాను వేశారు. "ఎవరో దొంగ బయట నుండి వచ్చినట్టు హడావుడి చేసి ఆవిణ్ని బయటకు లాక్కొస్తాను. నువ్వు వెళ్లి హారం పట్టుకొచ్చేయ్." అని భర్తకు చెప్పింది భార్య. అలాగే చేసింది కానీ భర్త దొంగిలించే సమయానికి అక్కడికి డిటెక్టివ్ దాపురించాడు. జాగ్రత్త అని హెచ్చరించి వదిలేసాడు. దొంగాడు కనబడక తిరిగొచ్చిన డబ్బున్నావిడ వద్దకు కూతురు వచ్చి "హీరోయే దొంగాడు. నిన్ను చూసి పారిపోయివుంటాడు' అని మళ్లీ చెప్పింది.

ఈలోగా హీరో తన గర్ల్‌ఫ్రెండుకి తన పరిస్థితిని వివరిస్తూ ఉత్తరం రాసాడు. ఆ అమ్మాయి అమాయకంగా తండ్రికి అంతా చెప్పేసింది. ఓ జమీందారు మేనల్లుణ్నని అబద్ధం చెప్పుకుని హీరో ఉద్యోగం సంపాదించడం అతనికి నచ్చలేదు. డబ్బున్నాయన్ని డిన్నర్‌కి పిలిచి మీ డ్రైవరు సంగతి ఇదీ అని చెప్పేశాడు. డబ్బున్నాయన హీరోనే సమర్థించాడు. ఇంటికి తిరిగొచ్చి ఇలాంటి కండిషన్లు పెట్టే అమ్మాయిని పెళ్లి చేసుకోకు అని ఉచిత సలహా పారేశాడు. సెక్రటరీలాటి మంచి అమ్మాయిని చేసుకో అన్నాడు. "లేదు ఆ అమ్మాయి వేరెవర్నో ప్రేమిస్తోంది. అతన్ని వెతుకుతూనే ఈ ఊరువచ్చానని నాతో చెప్పింది" అన్నాడు హీరో. నిజమే, ఆ అమ్మాయి బహిరంగంగా హీరోతో తన ప్రేమ వెల్లడించలేక అలాగే చెప్పింది.

ఇది ఇలా ఉండగా ఊళ్లో ఓ పార్టీ జరిగింది. అక్కడ డబ్బున్నాయన, హీరో, సెక్రటరీ వెళ్లి డాన్సు చేసి నానా హడావుడి చేసేరు. పోలీసులు పట్టుకోవడానికి వస్తే తప్పించుకుని పారిపోబోయారు. అప్పటిదాకా సరదాగా కబుర్లు చెప్పిన హీరో పాత ఫ్రెండు తను మఫ్టీలో ఉన్న

# మీరే సినీ రచయిత



**ఏజెంట్లకు, పాఠకులకు బహుమతులు**

ఈ కథను గనుక ఎవరైనా నిర్మాత తెలుగులో సినిమాగా తియ్యదలుచుకుంటే మనకున్న నటీనటుల్లో ఎవరు ఏ పాత్రకు సరిపోతారన్నది బాగా ఊహించి ఈ కింది కూపన్‌లో తుడుపులు, కొట్టివేతలు లేకుండా నీటుగా రాసి 30-11-2001లోగా పంపండి. ఫ్రమ్ అడ్రస్ రాయడం మరచిపోవద్దు. ఈ కథను ప్రముఖ దర్శకుడు **రేలంగి నరసింహారావు** గారికి వినిపించడం జరిగింది. ఏయే పాత్రలకు ఎవరెవరు సరిపోతారో ఆయన సూచించారు కూడా. ఆయన ఊహకు దగ్గరగా వున్న సూచనను పంపిన వారికి రూ.500/-లు ఒక తప్పుతో పంపినవారికి రూ.300/-లు రెండు తప్పులతో పంపినవారికి రూ.200/-లు బహుమతిగా పంపడం జరుగుతుంది. **ఆయా విజేతలకు ఈ పత్రికను విక్రయించిన ఏజెంట్లకు కూడా బహుమతులు అదే పద్ధతిలో వుంటాయి.**

ఇలా పాఠకులు కూడా తాము చదివిన 'కామెడీ బేస్‌గా వున్న ఇంగ్లీషు నవల' యొక్క కథా సంగ్రహాన్ని గానీ, సినిమాకు పనికొచ్చే విధంగా తాము స్వంతంగా రాసిన కామెడీ కథ గాని పైన రాసినట్టుగా సింగిల్ లైన్ ఆర్డర్‌లో రాసి మాకు పంపొచ్చు. 'ఏమో... గుర్రమెగరా వచ్చు' అన్నట్టు క్లిక్ అయితే మీరే ఓ సినీ కథా రచయిత అవుతారేమో...!? ప్రయత్నించి చూడండి.

## పాత్రలు - పాత్రధారులు

| | | | |
|---|---|---|---|
| పాత్రలు - | హీరో | గర్ల్‌ఫ్రెండు | సెక్రటరీ |
| పాత్రధారులు - | | | |
| పాత్రలు | డబ్బున్నాయన | ఆయన భార్య | ఆయన సవతికూతురు |
| పాత్రధారులు - | | | |
| పాత్రలు | టక్కరిజంటలో భర్త | భార్య | డిటెక్టివ్ |
| పాత్రధారులు - | | | |

పంపినవారి పేరు, చిరునామా.......................................................

.......................................................వయస్సు.............

న్యూస్ ఏజెంట్ పేరు, అడ్రస్సు.......................................................

పోలీసునని చెప్పి అరెస్టు చేయబోయాడు. సెక్రటరీ వెంటనే ఓ చెత్తబుట్ట అతని నెత్తి మీద కుమ్మరించి హీరోను, యజమానిని రక్షించింది. ఈ త్యాగానికి మురిసిపోయాడు డబ్బున్నాయన. కార్లో తిరిగి వచ్చేటప్పుడు హీరోకి నచ్చ చెప్పాడు. - ఆ గళ్‌ఫ్రెండుని వదిలేసి ఈ అమ్మాయిని పెళ్లి చేసుకో. ఆమె ప్రేమించేది నిన్నేట. అని. (అప్పుడా అమ్మాయి కారు వెనకసీట్లో నిద్రపోతోంది). 'ఇవాళ ఆమెతో డాన్సు చేస్తూ ఉంటే నాకూ అదే అనిపించింది. కానీ ఆ గళ్ ఫ్రెండుతో నాకు ఎంగేజ్‌మెంట్ అయిపోయింది. మాట తప్పడం మా వంశంలో లేదు. ఆమె అంతట ఆమె తెగతెంపులు చేసుకుంటే తప్ప నేను ఎంగేజ్‌మెంట్ బ్రేక్ చేయను' అన్నాడు హీరో.

సవతి కూతురికి ఓ జ్యూవెలర్‌తో పరిచయం అయింది. అతని సలహా మేరకు ఇంట్లో ఉన్న ముత్యాల హారం, మిగతా నగలు తక్షణం బ్యాంక్‌లో పెట్టించేయమని తల్లికి ఫోన్ చేసింది. ఆవిడ డిటెక్టివ్‌ను పిలిచి రేపు బ్యాంకులో ఇవన్నీ పెట్టేసిరా అంది. డిటెక్టివ్ పొంగిపోయాడు. హాయిగా విజిల్ వేసుకుంటూ తిరుగుతూంటే టక్కరిజంటలో భార్య కనబడి ఏమిటి సంగతి అంది. హుషారులో చెప్పేశాడు. నేను కష్టపడనక్కర లేకుండా అవి నా చేతికే వస్తున్నాయి. పట్టుకుని ఉడాయిస్తా అని. 'అలాగా!? అయితే ఇప్పుడే వెళ్లి ఆవిడకి చెప్పేస్తా. నువ్వు నన్ను ఎక్స్‌పోజ్ చేసినా ఫర్వాలేదు. నీకు మాత్రం దక్కనివ్వను" అంది. అయితే ఏం చేయమంటావ్ అన్నాడు డిటెక్టివ్ వెర్రిమొహం వేసి. "జ్వరం వచ్చిందని చెప్పు. నగలు ఇంట్లోనే ఉంటే ఎప్పుడో ఒకప్పుడు మరో ఛాన్సు రాకపోదు" అంది ఆమె.

ఆ ప్రకారమే డిటెక్టివ్ జ్వరం అని చెప్పేసాడు. దాంతో ఇక గతిలేక హీరోని పిలిచి నువ్వే బ్యాంక్‌కి వెళ్లు అని చెప్పింది డబ్బున్నావిడ. యజమాని వద్దకు వెళ్లి చెప్పాడు హీరో. ఎగిరిగంతేశాడు డబ్బున్నాయన. ఒప్పుకో అని బలవంత పెట్టాడు. ఎందుకని అడిగితే చెప్పుకొచ్చాడు. చేతిలో డబ్బు ఆడక కటకటపడి, భార్య నగల మీద కన్నేశాడాయన. మెరుగు పెట్టిస్తానని చెప్పి పట్టుకెళ్లి డూప్లికేటు నగలు ఇచ్చి అసలువి అమ్మేసుకుని ఖర్చు పెట్టేశాడు. ఇప్పుడు బ్యాంకుకి వెళితే అసలు సంగతి బయట పడుతుంది. లేకపోయినా రేపు పెళ్లి అయ్యాక కాబోయే అల్లుడు జ్యూవెలర్ కాబట్టి పసిగట్టేస్తాడు. అందుకని హీరోయే వాటిని పట్టుకెళ్లినట్టు పట్టుకెళ్లి ఈయనకు ఇచ్చేయాలి. ఆవిడ అడిగితే దొంగలు వచ్చి కొట్టి పట్టుకెళ్లిపోయారని చెప్పాలి.

ఇదంతా విని దీనిలో నాకేం లాభం? అనుమానించి పోలీసు రిపోర్టు ఇస్తే నేను జైలు కెళ్లాలి అన్నాడు హీరో. మరీ మంచిది, జైల్లో ఓ సారి పడ్డావని తెలిస్తే నీ గళ్‌ఫ్రెండు నాన్న మండిపడతాడు. నీలాటి మర్యాద హీనుడితో సంబంధం తెంపుకోమని కూతురికి చెప్తాడు. ఆమె అంతట ఆమె ఎంగేజ్‌మెంటు బ్రేక్ చేసేస్తుంది. నీ ప్రతిజ్ఞకు భంగం వాటిల్లకుండా నువ్వు బయటపడవచ్చు. సెక్రటరీని పెళ్లాడవచ్చు. అన్నాడు డబ్బున్నాయన. సరేనన్నాడు హీరో. కానీ ఆ ప్లానుకి అవాంతరం వచ్చింది, టక్కరిజంటలో భార్యవల్ల.

హీరో నగలు తీసుకుని బ్యాంక్‌కి వెళుతూండగా ఆమె దారిలో కనబడి లిఫ్టు అడిగింది. సరేనని ఇచ్చినదాకా ఉండి కాసేపటికి పిస్తోలు తీసి నగలు మర్యాదగా అప్పగించమంది. కానీ ఆమె సంతోషం కొద్దిసేపు కూడా నిలవలేదు. డిటెక్టివ్ వచ్చి ఆమెను బెదిరించి నగలు తీసుకుని పారిపోయాడు. ఆమె గొల్లుమంటే హీరో ఓదార్చాడు, అవి నకిలీవేనని. ఈ లోపుల గళ్‌ఫ్రెండు తండ్రి ఫోన్ చేసి హీరో గురించి డబ్బున్నావిడను హెచ్చరించడంతో హీరో కథ ఆవిడ నమ్మకపోవడం, హీరో అవి నకిలీవన్న విషయం చెప్పేయడం జరిగింది. విషయం బయటపడిపోవడంతో అనేక పరిణామాలు జరిగేయి.

మొగుడు చేసిన మోసం విని డబ్బున్నావిడ విడాకులు ఇచ్చిపారేసింది. పీడా పోయింది. హాయిగా ఇంకో పెళ్లి చేసుకోవచ్చనుకున్నాడాయన! గళ్‌ఫ్రెండు తండ్రి కూతుర్ని ఓ పోలీసాఫీసరుకి ఇచ్చి పెళ్లి చేస్తానన్నాడు. గళ్‌ఫ్రెండు తనంతటతానే ఎంగేజ్‌మెంట్ బ్రేక్ చేయడంతో హమ్మయ్య అనుకుని హీరో, సెక్రటరీని పెళ్లి చేసుకున్నాడు.

**ఇదీ కథ!**

**- మంజీర**





**నవంబరు 11 రమణారెడ్డి వర్థంతిని పురస్కరించుకుని రావికొండలరావు రాసిన ప్రత్యేక వ్యాసమిది**

# రెడీ కామెడీకి ఎవరెడీ రమణా 'రెడ్డీ'

సన్నగా పొడుగ్గా వున్న రమణారెడ్డి,

కొంగలా ఒకాలు చెట్టు మీదకి మడతపెట్టి రెండో కాలు మీద వంగి నించుని,

చేతిలో అగ్గిపెట్టి తిప్పుతూ, సిగరెట్లు ఊదుతూ వచ్చిన వాళ్లతో కబుర్లు చెబుతూ

కాలక్షేపం చేసేవారు. బాగా బిజీతార అయిన తర్వాత, ఆ చెట్టు కింద ఆయన కనిపించకపోతే,

షూటింగులో వున్నట్టు - కనిపిస్తే 'ఫ్రీ'గా వున్నట్టు. కొంతసేపు చెట్టు కిందా కొంతసేపు క్లబ్‌లోనూ కాలక్షేపం చేసేవారు రెడ్డి. సాధారణంగా కమేడియన్స్ నవ్విస్తూ తాము నవ్వుతారు. రమణారెడ్డి మాత్రం చిన్నగా జోక్స్ వేస్తూ నవ్వించడమే గాని, తాను నవ్వే వారు కాదు. సాధారణంగా సీరియస్‌గానే వుండే వారు. మాట కూడా మెత్తన. నెమ్మదిగా, వినీ వినిపించకుండా సౌమ్యంగా మాట్లాడ్డం కూడా ఒక లక్షణమే.

రమణారెడ్డిది నెల్లూరు ప్రాంతం. అంచేత నెల్లూరు యాస బాగా ఒంట బట్టింది. నెల్లూరులో శానిటరీ ఇన్‌స్పెక్టరు ఉద్యోగం; సద్యోగం నాటకాల్లో వేషాలు వెయ్యడం, మోనో యాక్టింగ్ చెయ్యడం.

మద్రాసులోని పాండీ బజార్‌లో చెట్లు వుండేవి.

ఒక చెట్టు పేరు ఆ చెట్టుకు తెలీదుగాని, సినిమా వాళ్లకి తెలుసు. దాని పేరు "రమణారెడ్డి చెట్టు".

సినిమాలకి రాకముందు, వచ్చిన తర్వాత కూడా అతను ఆ చెట్టునే నమ్ముకున్నాడు.

ఆ చెట్టే ఆయనకి నీడా తోడూ.

ఈ సద్యోగం అతన్ని కిర్రెక్కించి, సినిమాల వైపు తిప్పింది. మద్రాసుకి నెల్లూరు దగ్గరే గనక, ఏ ఆదివారం నాడో వచ్చి దర్శకుల్నీ నిర్మాతల్నీ కలుస్తూ సాగించిన సినిమా ప్రయత్నానికి నిర్మాత శంకరరెడ్డి ఓదారి చూపించారు. 1951లో ఆయన తీసిన "మాయపిల్ల"లో రమణారెడ్డికి హాస్యపాత్ర ఇచ్చారు. పాత్ర మంచిదే, అతనూ బాగానే చేశాడనిపించుకున్నా, సినిమా బాగా నడవక, రమణారెడ్డి ప్రజల, నిర్మాతల దృష్టిలో పడలేదు. ఎలాగూ రంగ ప్రవేశం జరిగిపోయింది గనక, ఉన్న ఉద్యోగానికి గుడ్ బై చెప్పి, మద్రాసులో డైరక్టర్లకీ ప్రొడ్యూసర్లకీ గుడ్‌మార్నింగ్‌లు చెబుతూ వచ్చాడు. అదిగో, అప్పుడే ఆ చెట్టు సెలక్షను. భర్త కనిపించక పోతే జానపద చిత్ర నాయిక పుట్టనీ గట్టునీ చెట్టునీ అడిగినట్లు రమణారెడ్డి చెట్టుని సలహాలడిగే వారు. "ఎవర్నీ కలవాలి? ఎలా కలవాలి?" అని. ఆ కల్పవృక్షం ఏం చెప్పేదోగాని, రమణారెడ్డి తన ప్రయత్నాలు ముమ్మరం చేశాడు. టాలెంటు, ప్రయత్నమూ, వృక్షాశ్రయం వున్నవాడికి అసాధ్యం ఏముంది? పాత్రలు రాసాగాయి. నిదానంగా రమణారెడ్డి హాస్యపాత్రల్లో స్థిరపడ్డారు. ఆ టైములోనే ఆయన డబ్బింగ్ చిత్రాలకి 'కంఠదానం' కూడా చేశారు. "నిజంగానే కంఠదానం చేశాను. చాలామంది డబ్బులు ఎగ్గొట్టారు!" అని చెప్పేవారు రెడ్డి.


'కలవారికోడలు' చిత్రంలో

దీక్ష, మానవతి, కన్నతల్లి వంటి కొన్ని సినిమాల తర్వాత, 'బంగారుపాప' లాంటి సినిమా వచ్చింది. అందులో అతను 'ముక్కుగొంతు' పెట్టి తమాషాగా మాట్లాడ్డంతో అధికంగా ఆకర్షించాడు. 'మిస్సమ్మ'తో ఎక్కువ ఆదరణ పొందాడు. అతని పర్సనాలిటీ జనానికి నచ్చింది. అతని నటనా నచ్చింది. సన్నగా పొడుగ్గా చెరకు గడలా వుండి, రబ్బరు బొమ్మలా అటూ ఇటూ వంగిపోతూ, తన శరీరాన్నీ, తోలు బొమ్మలాటలో కేతిగాడి చేతుల్లాంటి పొడగాటి చేతుల్నీ తిప్పుతూ ఆడిస్తూ, కావలసిన చోట





దభాలున పడిపోతూ, తన హాస్య నటనకి శరీరాన్ని ఉపయోగించుకున్నారు రమణారెడ్డి. ఆ పర్సనాలిటీలో మార్పు లేదు. వచ్చినప్పుడు ఎలా వుందో, చివరి వరకూ అలాగే 'మైంటైన్' అయింది. రేలంగి - రమణారెడ్డి జంటగా వుంటే - హాస్యమే హాస్యం. ఇద్దరూ కలిసి బంగారు పంటలు పండించిన సినిమాలు ఎన్నో.

"నన్ను ప్రోత్సహించిన ప్రకాశరావు గారు నాచేత నారదుడు వేయించారు. నేను వద్దు మొర్రోమన్నాను. నా అస్థిపంజరము, వక్షస్థలం, కనిపించ నీయకుండా ఫుల్‌చేతుల జుబ్బా తొడిగారు. ఆ 'జుబ్బా నారదుణ్ణి' జనం సహిస్తారా? 'కృష్ణప్రేమ'లో సూర్యకుమారి స్త్రీ గనక జుబ్బా తొడిగారు. నేను పురుషుణ్ణి గనక, నాకు తొడిగారు. తేడాలతో రెండూ వక్ష స్థలానికి సంబంధించినవే" అని చెప్పేవారు రమణారెడ్డి - తన నారద పాత్రధారణ గురించి అడిగినప్పుడు.

"ఆ పాత్ర అయిపోతూ వుండగా, 'మరి నాచేత






హనుమంతుడి వేషం ఎప్పుడు వేయిస్తారు?' అని అడిగాను ప్రకాశరావుగారిని. మెడ పట్టుకుని కొట్టబోయారు - అంతే!" అన్నారు రెడ్డిగారు.

ఆయనకి మాజిక్ సరదా వుండేది. ఆ సరదాని అలా అలా పెంచుకుని, మెజీషియన్ అయి, చాలాచోట్ల ప్రదర్శనలు ఇచ్చారు. సేవా సంఘాల సహాయ నిధికి రమణారెడ్డి ఇచ్చిన ప్రదర్శనలు ఎక్కువ. "ధన సంపాదనకి సినిమా వుంది. ప్రజల సహాయానికి మాజిక్ వుంది" అని చెప్పేవారు ఆయన. 'అక్కచెల్లెళ్లు' సినిమాలో రమణారెడ్డి మెజిషియన్ పాత్ర ధరించారు. "సినిమాలో మాజిక్ రక్తి కట్టదు. నిజంగా ట్రిక్స్ చేసినా, సినిమా ట్రిక్స్ అనుకుంటారు" అన్నారు రమణారెడ్డి.

ఒకటుంది. ఆయన ఏపాత్ర చేసినా, ఆ పాత్ర నెల్లూరు మాండలీకమే మాట్లాడుతుంది - "ఎట్టా! జేసినా!" అంటూ, 'మాయాబజార్'లో చినమయ పాత్ర కూడా ఆ భాష నుంచి తప్పించుకోలేదు. లంబు, జంబులు 'అస్మదీయులు'కి వ్యతిరేక పదంగా 'తసమదీయులు' అని చెప్పగారే, "ఓరి నీ తెలివి నువ్వూ! అస్మదీయులకి విరుగుడు తస్మదీయులని వీడు పుట్టించాడు ప్రభూ!" అని చినమయ నెల్లూరు యాసలోనే అనడం మనకి జ్ఞాపకమే. "నా భాష అది. ఎట్టా తప్పించుకుంటా! కాకపోయినా డైరెక్టర్లందరూ అలాగే, నా స్టయిల్‌లోనే చెప్పమనే వారు" అనే వారు రెడ్డి. ఐతే, 'రంగుల రాట్నం'లో మాత్రం పెద్ద చిక్కువచ్చింది. ఆయన ధరించిన పాత్ర తూర్పు ప్రాంతపు భాష మాట్లాడాలి. "అవస్థ పడ్డాను. ఆ భాష తెలిసిన వాళ్లని పక్కన పెట్టుకుని, ఆ యాస ప్రాక్టీసు చేశాను" అని చెప్పారు ఆయన.

వ్యక్తిగా సౌమ్యుడు రెడ్డిగారు. షూటింగ్ కొస్తే తన పాత్ర, తన గొడవా తప్ప ఇతర విషయాలు మాట్లాడేవారు కాదు. ఏవో జోకులు వేసినా, నెమ్మదిగానే, సైలెంట్‌గానే, సీరియస్‌గానే. ఎవరి గురించీ చెడు మాట్లాడ్డమో, విమర్శించడమో ఉండేదికాదు. ఐతే, తొలినుంచి ఆయన ఆరోగ్యం అంతబాగుండేది కాదు. అందర్నీ నవ్వించగలిగిన రమణారెడ్డి తన ఆరోగ్యాన్ని మాత్రం నవ్వించలేకపోయారు! హాస్యంతో కూడిన లిటిగెంట్ పాత్రలు, అవతలివాళ్లని తిప్పలు పెట్టి తను ఇబ్బందుల్లో పడే పాత్రలు రమణారెడ్డి పాత్రలు. 'గుండమ్మ కథ' 'జయభేరి' 'సత్యహరిశ్చంద్ర' 'వెంకటేశ్వర మహాత్యం' 'కులగోత్రాలు' 'ఇల్లరికం' 'దాగుడుమూతలు' లాంటి కొన్ని సినిమా పేర్లు చెబితే చాలు - వందలాది సినిమాలు గుర్తుకు వస్తాయి.

'గుండమ్మకథ' చిత్రంలో...





ఈ పాటను పెండ్యాల నాగేశ్వరరావు గారు ట్యూన్ చేశారు. హాస్యరసం బాగా చొప్పిస్తూ జిక్కి, పిఠాపురం పాడారు.

ఇంకో చిత్రంలో కూడా రమణారెడ్డి మేజిక్ చేసే వేషం వేశాడు. ఈసారి స్టేజి మీద ప్రదర్శనలిచ్చే మెజీషియన్‌గా కాక, రోడ్డు మీద విద్య ప్రదర్శించే గారడీ వాడి వేషం. ఇది జగ్గయ్యగారు తీసిన 'పదండి ముందుకు' చిత్రంలో కథకు అవసరం కాబట్టి, పాత్రను ఈ విధంగా ఆ సన్నివేశంలో చూపెట్టవలసి వచ్చింది. స్వాతంత్ర్యోద్యమం ఉధృతంగా సాగుతున్న రోజుల్లో, కట్టుదిట్టంగా జైలులోని దేశభక్తుల్ని తప్పించటానికి పోలీసుల కళ్లు కప్పి వేసుకొన్న పథకాన్ని సఫలం చేసే పాత్రగా ఈ సన్నివేశంలో నటించాడు. ఒక పాట పాడుతూ అడుగడుగునా ట్రిక్కులు చేస్తూ వేసుకొన్న పథకాన్ని విజయవంతం చేయటం ఈ దృశ్యం ముఖ్యోద్దేశం. ఆ సందర్భంలో రాసిన పాట...

**తమాష దేఖో తస్సదీయ్యా,**
**కనికట్టు సేస్తాం సూడవయ్యా**
**అరె మంత్రం తంత్రం మాయామర్మం**
**మైమరపిస్తా రారా భయ్యా!!**

**చేతిలో లాఠీ మెడలోన పట్టీ**
**సీమదొరగారి తలమీద టోపీ**
**ఘుమఘుమలా వాసనలా**
**జేబులో ఉందిరా అత్తరు బుడ్డీ**
**కన్నులు మూసీ తెరిసేలోగా**
**టోపీలో పడ్డది సూస్కోరా బుడ్డీ॥**

**తాళం పెట్టిన దర్వాజా బందు**
**చుట్టూ గస్తీ పకడుబందు**
**సీమైనా లోపలకు దూరేదాన్కి**
**లేదురా సందు**
**కాపలా వాళ్ల కన్నులు గప్పీ**
**కోన్‌కిస్కా కొట్టాడు మస్కా॥**

చలన చిత్రాలలో వినోద ప్రదర్శనకు మ్యాజిక్కు నేర్చుకొన్న రమణారెడ్డి తన చేతిలో ఉన్న ఆ విద్యను నిజ జీవితంలో కూడా సద్వినియోగం చేస్తూ స్టేజీ మీద ఎన్నో ప్రదర్శనలు, ఎన్నెన్నో ఊళ్లలో ఇచ్చాడు. అవి ఎంతగానో రాణించాయి. గాలిలోంచి వస్తువులు తీయటం, బ్లేడులు మింగి వాటిని మళ్లా బైటికి తియ్యటం, ఎక్స్‌రే కళ్లు, సహాయకురాలిని గాలిలో తేల్చడం మొదలైన అన్ని ఫీట్లూ, చకచకా హాస్యోక్తులతో చేశాడు. ఎటొచ్చీ వీటికి పాటలు అక్కరలేదు. కొన్ని ప్రదర్శనలలో మాత్రం నేనతనికి చేదోడుగా ఉన్నాను. ఎలాగా అంటే - అది వృత్తి రహస్యం. మెజీషియన్‌గా తీసుకొన్న ప్రమాణం ప్రకారం అది బైట పెట్టకూడదు!

**హా**స్యనటుడు రమణారెడ్డి వివిధ చిత్రాలలో వైవిధ్యం గల పాత్రలు ధరిస్తూ ఉండేవాడు. ఆ పాత్రలకు తగ్గ పాటలు రాసే అవకాశాలు నాకు దొరుకుతూ ఉండేవి

'అక్కాచెల్లెళ్ళు'లోని చిత్రంలో అతడు ఒక మెజీషియన్ వేషం వేశాడు. ఆ పాట కోసం అతడు మ్యాజిక్ నేర్చుకొన్నాడు. ఆ పాత్రకు తగ్గ సన్నివేశాలను సృష్టించడానికి, సంభాషణల రచయితగా నేనూ మ్యాజిక్ నేర్చుకొన్నాను. ఇద్దరం కూడబలుక్కుని రక్తికట్టే సీనులు సృష్టించాం. రమణారెడ్డి 'మెస్రిద్రి' అనే స్టేజి పేరు గల ఎం.శేషాద్రి అనే మెజీషియన్ దగ్గర నేర్చుకొంటే, నేను ఇంకొక వృత్తి మెజీషియన్ దగ్గర నేర్చుకొన్నాను.ఆ చిత్రంలో కూడా రమణారెడ్డి కో పాట పెట్టాను. అది కూడా ప్రేమ పాటే. తన దగ్గర అసిస్టెంట్‌గా ఉన్న అమ్మాయినే అనుకుంటా ప్రేమించాడు. ఆ పాట...

**హా హా:** ఇండియాకు రాజధాని ఢిల్లీ - నా
గుండెల్లో ప్రేమరాణి లిల్లీ
నన్ను చూసి నవ్వకే, నిన్ను చూసినంతనే
గెంతుతుంది నా మనసు తుళ్లి తుళ్లి
నీ ప్రతి మాటా నా తలలో మ్యూజిక్కు
నీ ప్రతి చూపు నా తలలో మ్యాజిక్కు

**లిల్లీ:** నీతో వచ్చింది చెడ్డచిక్కు - తెలుసుకో
ప్రేమంటే కాదు సుమా కామిక్కు
ఇంగ్లండుకు రాజధాని లండన్
నా గుండెల్లో నీ ప్రేమా ఎమ్డన్
కన్ను కలసినంతనే - నిన్ను చూచినంతనే
పగులుతుంది నా మనసు ధనాధన్!!
ఎందుకయ్యి పడతావు హైరానా
నే నిచ్చాగా నా మనసు బయానా

**హాహా:** దాచాను చరణాల ఖజానా
అది అర్పిస్తానన్నా;
సాటిలేనివాడు వీడు హా హా
యిక జీవితాన విచారం స్వాహా

**లిల్లీ:** డైమాను రాణిని - యిస్పేటు రాజువి
మన జోడీయిక మీదట వహ్వా

**హాహా అండ్ లిల్లీ:** కాశ్మీరుకు రాజధాని శ్రీనగర్
మన హృదయాలకు రాజధాని ప్రేమనగర్
కలకలమని నవ్వుతూ కలిసిమెలిసి తిరుగుతూ
గడుపుదాము జీవితాన్ని బరాబర్.

**- ఆరుద్ర**

('ఆరుద్ర సినిమినీ కబుర్లు' నుంచి)

# తండ్రికి తగిన తనయ

# అనౌష్కా రవిశంకర్



# తండ్రి అడుగు జాడల్లో నడిచే కుమారులు ఎందరో ఉన్నారు.

# కానీ తండ్రి వారసత్వాన్ని చాటే కుమార్తెలు మాత్రం కొద్దిమందే!

ప్రపంచం మొత్తానికి తన సంగీతం వినిపించి, తనకు, తన సంగీతానికి ఎల్లలు లేవని చాటిన అరుదైన కళాకారుడు పండిట్ రవిశంకర్. అయితే ఆయన కుమార్తెగానేకాక, సితారు వాదనలో దిట్ట అనిపించుకున్న అనౌష్కాశంకర్ తూర్పు పశ్చిమ దేశాలకు, ఆ బాణీలకు, వారధిగా నిలవటం ఈ శతాబ్దపు విశేషం!

అనౌష్కా శంకర్ సితారు వాదనలోనే కాక ఆమెలోనూ ఎన్నో ప్రత్యేకతలున్నాయి. తొలికాలం నుంచి నేటి వరకు పండిట్ రవిశంకర్ వద్దే శిష్యరికం చేయడం ఆమె ప్రత్యేకత! ఇందులో ప్రత్యేకత ఏమిటి? ఎందరో శిష్యులు ఆయన వద్ద శిష్యరికం చేశారు కదా అనవచ్చు. నిజమే.... ఎందరికో పండిట్ సంగీతం నేర్పారు. కానీ వారిలో ఎవ్వరూ సంపూర్ణంగా ఆయన వద్దే నేర్చుకోలేదు. కొన్నాళ్ళో, కొన్నేళ్ళో మాత్రమే నేర్చుకున్నారు. ఇక అనౌష్కా విషయానికొస్తే ఆమె తొలినాటి నుంచి నేటివరకు తండ్రి వద్ద నేర్చుకొంది. ఇది నిజంగా ప్రత్యేకతే కాదు - రికార్డు అని కూడా కొందరు వాదిస్తున్నారు!

అనౌష్కాకి చిన్నతనం నుంచీ తండ్రి వద్ద చనువు ఎక్కువనే చెప్పాలి. తన రంగంలో అసమానుడు, సముద్రం అంతటి సంగీతజ్ఞుడైన పండిట్‌జీ చిన్నారి అనౌష్కాకి సరిగమలు నేర్పడానికి ఎన్నో 'మెట్లు' దిగిరావలసి వచ్చేది. అర్థం చేసుకోలేని అనౌష్కా 'తప్పటడుగులు' వేస్తుంటే సహించలేని స్థితిలో కూడా ఆయన ఓర్పు వహించేవారు.

తొమ్మిదేళ్ళ వయసులో అనౌష్కా సితారు పట్టికూర్చోవడం తెలుసుకోగలిగింది. పన్నెండో ఏటికి ఆమె తంత్రుల మీద చిరు విన్యాసాలు ప్రారంభించింది. ఇక అప్పట్నించీ సితారు లేకుండా ఆమె లేదు. అదే ప్రపంచంగా జీవిస్తోంది.

అనౌష్కా బాల్యంలో ఎక్కువభాగం ఇంగ్లండు, అమెరికాల్లో గడిపింది. పాశ్చాత్య సంగీతాన్ని తనివితీరా వింది. ఆనందించింది. అలా అని భారతీయ సంగీతానికి దూరమైందనడానికి వీల్లేదు.

అనౌష్కా మాటల్లో చెప్పాలంటే - "మానసికంగా నేను విదేశీ వనితనే. కానీ నా హృదయం నిండా మాత్రం భారతీయత ఉంది! నా వేళ్ళు ఈ కర్మ భూమిలో ఉన్నాయి. భారతీయతే నా చిరునామా" అందుకే ఆమె ఈ నేల మండి దిగిన రసరమ్య గీతిక!

అనౌష్కా తొలి కచేరీ చాలా తమాషాగా జరిగింది. పండిట్‌జీ తన 75వ జన్మదినం వేడుకలు ఏర్పాటు చేయడాకిని రంగం సిద్ధం చేశారు. తనకు నచ్చిన రాగాలను ఎంపిక చేసుకొని అతిథులను ఆహ్లాదపరుస్తున్నారు. చిన్నారి అనౌష్కా తన సితారుతో తండ్రి పక్కన చేరింది. పది నిముషాలు మించని 'సోలో'ని తండ్రికి పుట్టిన రోజు కానుకగా వినిపించింది. అతిథులందరూ ఆశ్చర్య పోయారు. పండిట్‌జీ ముఖంలో ఆనందం వెల్లివిరిసింది!

ఏ తండ్రికైనా ఇంతకన్నా మించిన జన్మదిన కానుక మరేముంటుంది!

తన సంగీతానికి ఎందరో వారసులున్నా తన కుమార్తె నిజమైన వారసురాలుగా నిలబడటం మాత్రం ఆయన భగవంతుడి ప్రసాదంగా భావించారు.

అది జరిగింది 1995 ఫిబ్రవరి 27న. అప్పటినుంచీ అనౌష్కాకి బెదురులేదు. మరో కచేరీలో ఓ తమాషా సంఘటన జరిగింది. తండ్రీ కూతుళ్ళిద్దరూ సితారు వాయిస్తున్నారు. ఒక దశలో పండిట్‌జీ తన కుమార్తెకు అవకాశం ఇస్తూ ఆగారు. ఆ కచేరి తదనంతరం కొందరు అభిమానులు "అనౌష్కా వాయిస్తుంటే మీరు వాయిస్తున్నట్టే భావించాం. ఆమె రూపంలోనే కాదు సంగీతంలోనూ మీ నోట్లోంచి ఊడిపడినట్టే" అని అభినందించారు. అది ఒక కాంప్లిమెంట్ మాత్రమే కాదు. అనౌష్కా భవిష్యత్తుకు పెద్ద రహదారి వేయడం అన్నమాట!

సాధారణంగా సంగీత విద్వాంసులను, సాహితీవేత్తలను పుంభావ సరస్వతిగా అంటే.... పురుషరూపంలో వున్న సరస్వతిగా అభివర్ణిస్తుంటారు. ఇక్కడ అనౌష్కాను స్త్రీరూపంలో వున్న పురుషుడు (రవిశంకర్)గా చెప్పుకోవడం అన్నివిధాలా సమంజసం.

అనౌష్కా గత అయిదారు సంవత్సరాల కాలంలో అమెరికా, ఇంగ్లండుల్లోనే కాక ఇతర దేశాల్లో తండ్రితో పాటు ఎన్నో కచేరీల్లో పాల్గొంది. సోలో ప్రదర్శనలిచ్చింది. భారత్‌లో కూడా ఆమె ప్రదర్శనలిచ్చింది. తండ్రి నీడ నుంచి దాటి ఎదిగే ప్రయత్నం ఆమె ప్రతీ కచేరీలోనూ కనిపిస్తుంది, అన్నది విమర్శకుల అభిప్రాయం. సంప్రదాయం ఒక్కటే కానీ స్వరకల్పనల్లో మాత్రం అనౌష్కా ప్రత్యేకత 'వినిపిస్తోంది'.

అనౌష్కాది కలలు కనే వయసే. అయితే ఆమె కలలన్నీ ఢిల్లీలో 'చాణక్యపురి'లో నిర్మితమవుతోన్న 'రవిశంకర్ సెంటర్' మీదే ఉన్నాయి. అదొక సంగీత ప్రపంచంగా రూపుదిద్దుకోబోతుంది. అందులో పండిట్ రవిశంకర్ విడుదల చేసిన కేసెట్లు, సి.డిలు తదితర ఆల్బమ్‌లన్నీ ఉంటాయి. ఒక థియేటర్, ఓపెన్-ఎయిర్-ఆడిటోరియం, రికార్డింగ్ స్టూడియోలు అన్నీ ఉంటాయి. ప్రపంచంలో ఏ మూల నుంచి ఎవరైనా వచ్చి అక్కడ ఉంటూ సంగీతం అభ్యసించడానికి సదుపాయాలు కల్పిస్తున్నారు. కచేరీలు నిర్వహించడానికేకాక, చర్చలు జరపడానికి, సంగీతం నేర్పడానికి 'గురుకుల' పద్ధతిలో అన్ని సదుపాయాలు అమరుస్తున్నారు. ఈ 'రవిశంకర్ సెంటర్'కి భవిష్యత్తులో యజమానురాలు, నిర్వాహకురాలు, అనౌష్కా మాత్రమే. అది ఆమె కలల ప్రపంచం. అందుకే దానిపై ఆమె ఎంతో ఆసక్తేకాక శ్రద్ధ కూడా చూపుతోంది.

ఇప్పుడు చెప్పండి ఆమె తండ్రికి తగిన తనయా కాదా!? కాదని ఎవరు మాత్రం అనగలరు?

-సి.హెచ్.లక్ష్మి






**సాక్షిసంఘంలో ఆ రోజు చర్చ రాబోయే ప్రళయం గురించే - ఎవరో ఎండలు ఎక్కువగా ఉన్నాయని వాపోయారు. దాంతో జంఘాలశాస్త్రి ఉపన్యాసం అందుకున్నాడు -**



# వచ్చేస్తోంది ప్రళయం..




"కావూ మరి! ఇంకా ఎక్కువవుతాయి. ఏ సంవత్సరానికి ఆ సంవత్సరం ఎండలు హెచ్చయిపోతున్నాయి. వర్షాలు తగ్గిపోతున్నాయి. భూమిలో సారం తగ్గిపోతోంది. భూగర్భంలో ఉండే అగ్ని అధికం అయిపోతోంది. ఏడుతరాల క్రితం జీవించిన మనుష్యులు ఒకవేళ మళ్లీ పుడితే వాడు మన జాతి అని మనం అనుకోం. వాడూ మనని అనుకోడు. గేదెముందు లేతపెయ్యల్లా వాడి కంటికి మనం కనబడతాం. మన కింకా ఎలాటి కొంకినక్కలు పుడతారో!

దీని కంతా కారణం - ఈ ఎండ. సూర్యుడి ఆకర్షణ శక్తి ఎక్కువకావడం చేత భూమి దినదినానికి సూర్యుని సమీపిస్తోంది. మన తాత తండ్రుల కాలం కంటె మన్టైములో ఇంకా దగ్గరికి పోయింది. ఆహా, ఇక ముందు ముందు ఏమవుతుందో, ఏమో! నిమిష నిమిషం, అగ్నిగుండానికి దగ్గరవుతున్నాం. ఎప్పుడో, ఏ పగలు భోజనం చేసేటప్పుడో, రాత్రి నిద్ర పోతూండగానో ఈ భూమి, హోమంలో నేతిబొట్టులా, మంటలో మిడతలా - వెళ్లి ఆ గ్రహకూటమిలో పడిపోయి అంతరించిపోతే..

పోనీ దీనికి ఇంకా టైముందని మనను ఓదార్చుకున్నా ఇంకో ముప్పు రాబోతోంది. ఇవాళ పత్రిక చూడండి. గ్రహగతుల గురించి పారిస్‌నుండి వెలువడే పత్రిక ఇది. దీనిలో ఏం రాసాడో తెలుసా? ఇక కొన్ని సంవత్సరాలకు ఒక గొప్ప తోకచుక్క పుడుతుందట. దాని తోక మైళ్లకొద్దీ పొడుగట. నడక విచిత్రమట! అంత గొప్పతోకతో అది మన భూమిని ఫెడీలున ఒక్కటి తంతుందట. దెబ్బకి ఇంత లావు భూమీ ఫుట్‌బాల్‌లా ఎగిరిపడుతుంది. ఎక్కడ పడుతుందని ఆలోచించడానికి ప్రయత్నించకండి. మన ఊహకు అందదు.

కానీ ఆ తోపులో, ఆ ఊపులో అలా, అలా అంతరిక్షమార్గంలో భూమి వెళ్లిపోతూండగా మన గతి ఏమిటో ఆలోచించి చూడండి. చెట్టు దులిపినపుడు నేరేడుపళ్లు జలజల రాలినట్లు, చెప్పుతీసుకుని మూతిమీద కొడితే పళ్లు టపటప రాలినట్లు - భూమినుండి చెల్లాచెదరై - అదిరిపడి అంతరిక్షం నుండి జలజల - జరజర - బిరబిర కిందకు పడిపోమూ? అన్నట్టు కింద అంటే అర్థం ఏమిటి? అసలు కింద ఎక్కడ ఉంది? భూమిని వదిలిపెట్టినవాడికి కిందేమిటి? మీదేమిటి? అలా అంతరిక్షంలో నుండి దిబుకు దిబుకుమని ఎన్ని యుగాలు దిగిపోతామో!?

అదీకాక మాటవరుసకు చెబుతున్నా - అలా తోకచుక్క దెబ్బకు భూమి ఎగిరినపుడు మనం

స్తంభాలను గట్టిగా పట్టుకుని కానీ, భార్యాపిల్లలను అంగవస్త్రంతో గానీ, తాళ్లతో గానీ మంచం కోడుకి వేసి కట్టేసుకుని భూమినుండి ఎగిరిపోకుండా జాగ్రత్తపడితే ఫరవాలేదని ఆలోచన చేస్తున్నారేమో! అలా చేసినా ఉపద్రవం దాటిపోదు. ఎందుకంటే తోకచుక్క దెబ్బతిన్న భూగోళం యమస్పీడుతో, రంయిరంయిమని చెవులు గింగురులు పడే శబ్దం చేసుకుంటూ దారి, తెన్నూ లేకుండా అంతరిక్షంలో వెళుతూంటే ఏమవుతుందనుకుంటున్నారు? తన దారి కడ్డువచ్చిన మరో గోళంతో ఢీ కొట్టడం ఖాయం. ఢీ కొడితే పండు దోసకాయ విచ్చినట్లు మన గోళం విచ్చుకుపోతుంది. మనం గొట్టంలో నుంచి వెన్నముద్దలు ఎగిరిపోయినట్లు పైకి ఎగిరిపోమూ? మనలో కొందరు ఇతర గోళాలలో పడిపోకుండా ఉంటారా?

పోనీ ఇవన్నీ జరగవనే అనుకుందాం. ఇదే పత్రికలో 37వ పేజీలో ఏం రాశారో చూసారా? ఇది రాసినతను ప్రకృతిశాస్త్రంలో పండితుడు. సూర్యునిలో వంటచెరకు తరిగిపోతోందట. అందుచేత సూర్యుని కాంతి తగ్గిపోతోందట. ఇలా తగ్గి, తగ్గి కొంతకాలానికి సూర్యుడు ఆరిపోతాడుట. సూర్యుడే చల్లారిపోయినప్పుడు చంద్రుడు, తక్కిన నక్షత్రాల మాట ఏమిటి? ప్రపంచం అంతా గాఢాంధకారం అయి పోదూ! రోజంతా కాళరాత్రే గదా! ఎవరికీ కళ్లు కనబడవు కదా.. ఒకరు గుడ్డివాళ్లయితే తక్కినవారు దారి చూపవచ్చు. అందరూ గుడ్డివాళ్లయితే ఏది గతి? పైగా చలికి వణికిపోయి, కొయ్యబారి పోతామేమో? అన్నం వండుకుందామన్నా, చలికాచుకుందామనుకున్నా - అగ్గిపుల్లయినా వెలుగుతుందో లేదో!?

అవునూ ఆరిపోయిన సూర్యునికి ఆకర్షణశక్తి ఉంటుందా? గ్రహాలకు రాజైన సూర్యుడికే దిక్కులేనపుడు ఇతర గోళాలు మాత్రం అంతరిక్షంలో నిలుస్తాయా? పైన ఉండే గోళం ఒకటి దబుక్కున మన మీద పడుతుందేమో..అప్పుడేమిటి గతి? అబ్బ, అసలు ఆ దృశ్యం ఆలోచిస్తేనే భయం వేస్తోంది. ఈ పాడు పత్రిక చూసినప్పటినుండీ నరాల బింకం పోయి, కాళ్లు పట్టుదప్పి తల ప్రాణం తోకకు వచ్చింది. మనసు చెదిరిపోయింది. అన్నం సయించటమే లేదు." అంటూ జంఘాలశాస్త్రి పెద్ద నిట్టూర్పు విడిచి కూచున్నాడు.

ఈ వార్తలన్నీ విని సభలో అందరూ తెల్లబోయారు. అందరూ నిట్టూర్పులు విడుస్తూ తమ తమ ఆలోచనల్లో పడ్డారు. వారిలో మొదటివాడు కాలాచార్యులు. బ్రహ్మచారి. పోగొట్టుకోవడానికి భార్య గానీ పిల్లలు గానీ లేనివాడు. అయినా అందరికంటె ఎక్కువ దుఃఖ సముద్రంలో మునిగిపోయాడు. అతని బాధ ఏమిటంటే అతనికి ముక్కుపొడి అలవాటు. అదీ అరువు తీసుకుని పీల్చే అలవాటు. సూర్యుడి ఎండ లేకుండా పొగాకు ఆరబెట్టడం ఎలా జరుగుతుందాని ఒక చింత. ఎలాగోలా ఆరి, ఎవరైనా పొడి చేసుకుని పెట్టుకుంటే వారిని అరువు అడగడానికి చీకటిలో వెళ్లగలమా లేదా అని మరో చింత.

తర్వాత చెప్పవలసిన వ్యక్తి వాణీదాసుడు. ఇతను ఒక కవి. తోకదెబ్బ తగిలి ఎగిరిపోయే భూమి ఇంకో గోళంతో ఢీకొంటే, తను వెళ్లి వేరే గోళంలో పడితే ఆ గోళంలో వారికి తెలుగు రాకపోతే ఎలా




అని ఇతనికి వర్రీ. తెలుగురానివాళ్లు తన కవిత్వాన్ని ఆస్వాదించలేరు కదా, తనను మెచ్చుకోలేరు కదా అని బాధ.

ఇక తక్కినవవారు కూడా తమ తమ ఆలోచనలలో మునిగి ఉన్నారు. భూమిలో పాతిపెట్టిన వరహాలముంత ఏమవుతుందని ఒకడు, ప్రస్తుతం కోర్టులో జరుగుతున్న కేసులో తన తరఫున తీర్పు వచ్చేసమయంలో ఇదేం ముప్పురా దేవుడా అని ఒకడు, ఎందుకైనా మంచిది, రావలసిన పద్దులు గబగబా వసూలు చేసుకుంటే మంచిది కదా అని ఒకడు ఆలోచించడం మొదలుపెట్టారు. తూర్పు ప్రాంతం నుండి వచ్చిన ఒకామె "అయ్యో, మా పిన్నమ్మ నిన్న నేను వచ్చేసరికి కొత్తగా పెట్టిన ఆవకాయ ఎండబెట్టింది. అది యెండకుండానే సూర్యుడు ఆరిపోతాడా?" అని బాధపడుతూ అడిగింది.

ఇదంతా చూసేసరికి నాకు తోచిన ఆలోచన చెప్పబుద్ధి వేసింది. "సోదరులారా! మనకున్న దుఃఖాలు చాలనట్లు ఈ కొత్త ఏడుపులు ఒకటా? చేటలో పడిన దగ్గర్నుంచి కాటిలో పడేవరకూ మనం ఏడవవలసిన నానారకాల ఏడుపులు చాలనట్లు ఈ ఏడుపులు కూడా ఎందుకు? చలితో బాధపడేవాడు మంచుగుడ్డ తలకు కట్టుకున్నట్టు, జ్వరం వచ్చినవాడు మంచం కింద కుంపటి పెట్టుకున్నట్టు మనం లేనిపోని కష్టాలు ఎందుకు కొని తెచ్చుకోవాలి? మనకు బుద్ధినిచ్చిన దెందుకు? దుఃఖాన్ని పోగొట్టుకోవడానికి మార్గాలు వెతకడానికి. ఏవేవో ఊహించి, ఎప్పుడో రావలిసిన కష్టాలు ఇప్పుడే వచ్చినట్టు ఏడవడానికి కాదు. శత్రువులనుండి కాపాడుకోవడానికి ఇచ్చిన కత్తితో తన తలకాయ కోసుకున్నట్టుంది.

అసలు ఈ ప్రళయం అనే ఆపదే తీసుకుంటే - అది వస్తుందో రాదో సందేహించదగినది. వచ్చినా కలియుగం నాల్గవపాదంలో రావడాననికి వీల్లేదు. సర్వనాశనం అయినతర్వాత విచారించడానికి కూడా మనమూ మిగలం. విచారమూ మిగలదు. ఇలాటి ముప్పురాకుండా మనం చేయగలిగేదీ లేదు. అటువంటి ఆపదలు ఇప్పుడే వచ్చినట్లు ఏడ్చేవాడిని ఏమనాలి? ప్రపంచంలోని వస్తువులు నశించేవి, నీలో ఉన్న పదార్థము శాశ్వతంగా ఉండేది అని తెలిసి కూడా బాధపడడం ఎందుకు? ఏ మహాతేజం ముందు సూర్యుడు వెలవెలబోతాడో, అటువంటి తేజం నీలోనే ఉంది. అటువంటప్పుడు కంటికి కనబడే సూర్యుడు ఆరిపోతే నీకేం? గురుశుక్రులు ఇద్దరూ ఢీకొని పొడిఅయిపోతే నీకేం? లేనిపోని బెంగలు పెట్టుకుని మనసు పాడుచేసుకుని చేష్టలుడిగి కూచోకండి. మీ పనులు మీరు చేసుకుంటూనే ఉండండి." అని లెక్చరు ఇచ్చా.

**(గమనిక - ఈ వ్యాసం 1913 లో రాయబడింది. అప్పటినుండీ ఇప్పటిదాకా ప్రళయం వస్తోందని ఎన్ని సార్లు, ఎన్ని రకాల హడావుడి చేశారో ఒక్కసారి ఆలోచించి చూడండి. అప్పుడు ఈ వ్యాసం ఇప్పటికీ అన్వయిస్తుందని పరిస్తుంది.)**



అతను తన పన్నెండవ ఏట తన కెరియర్‌ను ప్రారంభించాడు. గత పద్దెనిమిదేళ్లుగా పాడుతూనే వున్నాడు. ప్రపంచంలో బ్రహ్మాండమైన సెన్సేషనల్ పాప్‌స్టార్ అతను. మైఖేల్ జాక్సన్ కంటే ఎక్కువగా అతని ఆల్బమ్స్ కొన్ని మిలియన్ల కాపీలు హాట్ కేక్‌లా అమ్ముడుపోతున్నాయి.

**అతనే రికీమార్టిన్....**




అతని పేరు చెబితేనే ప్రపంచ వ్యాప్తంగా టీనేజర్స్ దగ్గర నుండి పెద్దవాళ్ల వరకూ జనం ఉద్రేకంతో ఊగిపోతారు. అతని లేటెస్ట్ ఆల్బమ్ పదిహేను మిలియన్ల కాపీలు అమ్ముడుబోయింది. ప్రపంచ వ్యాప్తంగా అసంఖ్యాకమైన అభిమానుల్ని



# సక్సెస్ శాశ్వతం కాదంటున్న రికీ మార్టిన్

పాపులారిటీని కైవశం చేసుకున్న రికీమార్టిన్ తన ఫీలింగ్స్ గురించి ఈ మధ్య ఓ అంతర్జాతీయ పత్రికలో ఈ విధంగా చెప్పుకున్నాడు.

"నా సంగీతం ఎక్కువగా లాటిన్ అమెరికా బీట్స్ ద్వారా ప్రేరణ పొందింది. కేవలం అమెరికా సంగీతం అయితే నేను ఎప్పుడో ఇంటికి వెళ్ళిపోయే వాడిని.... అదే విధంగా కొంత భారతీయ సంగీతం కూడా స్పెయిన్ జిప్సీ సంగీతాన్ని పోలి వుంటుంది... రాక్ మ్యూజిక్‌కు సంబంధించిన ఫీల్డ్ అంతా తాగుడు, డ్రగ్స్, మితిమీరిన శృంగారం మొదలైన వాటితో ఎక్కువగా మిళితమై వుంటుందన్న అభిప్రాయం వుంది కానీ అదంతా వ్యక్తిగత విషయం. ఫ్రాంక్ సినాట్రా. ఎల్విస్ ప్రెస్లీ తదితరులు క్రమశిక్షణ లేకుండా పతనం అయ్యారు. మా తరం వారికి అదంతా ఓ గుణపాఠం...".



"మడోనా, ఎల్టన్‌జాన్, స్టింగ్. బిల్లీజోల్ తదితర పాప్‌స్టార్‌లతో కలిసి షోలు చేసాను. మా మధ్య ఇగో సమస్యలు లేవు. ఇతరుల నుంచి ఏమైనా నేర్చుకోవాలని నేను నిరంతరం ప్రయత్నిస్తాను.... భారతీయ సంగీతం అంటే నాకు ఎంతో ఇష్టం. భాంగ్రా సంగీతమన్నా, జాకీర్ హుస్సేన్ అన్నా నాకు చాలాచాలా ఇష్టం. నా సంగీతంలో అక్కడక్కడా సితార్ శబ్దం విన్పిస్తుంది... భారతీయ ఆధ్యాత్మికత" ముఖ్యంగా కర్మ సిద్ధాంతం పట్ల నాకు ఎంతో గౌరవం వుంది.... నేను పాప్‌స్టార్ కాకపోయి వుంటే డిస్క్ జాకీ అయివుండేవాడిని....."

"నన్ను సెక్స్ సింబల్‌గా కొలుస్తుంటే ఆశ్చర్యంగా వుంటుంది.... నా సంగీతం కంటే నా లుక్స్. సెక్సీనెస్ గురించి చర్చలు ఎక్కువగా జరుగుతుంటాయి. ఇదంతా నాకు ఇష్టం వుండదు అయినా కూడా ఏమీ చేయలేని పరిస్థితి. ప్రపంచ వ్యాప్తంగా అమ్మాయిలు నన్ను ఆరాధిస్తున్నారంటే నాకు ఒక్కోసారి ఎంతో గర్వంగా వుంటుంది.... మడోనాని కలవటం ఓ అనుభవం అయితే పోప్‌ను కల్సుకోవటం మరో అద్భుతమైన అనుభవం...".

"నా గురించి పత్రికల్లో రకరకాలుగా వ్రాస్తుంటారు. కొందరు నేను అమ్మాయిలు పిచ్చాడిని అని మరోటని ఇంకోటని ఏవేవో అంటారు. నేను వీటిని పట్టించుకోను. ఎందుకంటే వీళ్ళు దేముడిని కూడా తిడుతూ వుంటారు నేనెంత? నేను ఓ రోజు జర్నలిస్టుగా ఇంటర్వ్యూ చేయాల్సి వస్తే మహాత్మాగాంధీ, ఐన్‌స్టీన్, దలైలామాలను ఇంటర్వ్యూ చేయాలనుకుంటాను...."

"నేను పాప్‌స్టార్ కావటం వల్ల నా బాల్యాన్ని కొంత కోల్పోయినా కూడా చాలామంది అమ్మాయిలతో డేటింగ్ చేస్తూ వచ్చాను.... టీనేజర్స్ మాదిరిగా లైఫ్ ఎంజాయ్ చేస్తున్నాను కాబట్టి నో రిగ్రెట్స్.... సక్సెస్ ఒక్కోసారి మన మీద మనకు అదుపు కోల్పోయేలా చేస్తుంది. అందుకే యోగా, మెడిటేషన్ చేస్తాను... ఆధ్యాత్మిక ప్రదేశాలైన ఇండియా, నేపాల్ దేశాలంటే నాకు చాలా ఇష్టం...."

"జనరల్ హాస్పిటల్ అనే టీవీ సీరియల్లో నటించాను, కానీ సంగీతం ఇచ్చినంత సంతృప్తి నాకు నటన ఇవ్వదు.... నేను ఏ పని చేసినా పూర్తి సంతృప్తితో చేయాలని ప్రయత్నిస్తాను. లేకపోతే చేయకుండా వుండేందుకు ప్రయత్నిస్తాను.... ప్రేమించటం, అమ్మాయిలు అంటే నాకు ఫాసినేషన్ వున్నమాట వాస్తవం... ప్రేమ కారణంగానే మనమంతా బ్రతుకుతున్నాం.... నేను సాంస్కృతిక రాయబారిగా వుండి సంగీతం, సాహిత్యం కోసం కృషి చేయాలనుకుంటున్నాను. ఏదో ఓ రోజు సిన్మా కూడా డైరెక్ట్ చేసాను... నేను యవ్వనంలో వుండి ఏదైనా చేయగల శక్తి సామర్థ్యాలు వుండగానే చాలా చేయాలని వుంది... సంగీతాన్ని నా తుదిశ్వాస వరకు వదిలిపెట్టను..."

**ఇవీ రికీమార్టిన్ పర్సనల్ ఫీలింగ్స్....**

**-ఆదెళ్ళ శివకుమార్**



# లబ్ధప్రతిష్ఠ సంగీత దర్శకుడు

# కాజీ నజ్రుల్ ఇస్లాం



ఇంద్రాణీ సేన్

**దేశంలో తొలిసంగీత దర్శకుడైనా 1000 గీతాలకు పైన స్వరపరచినా రావలసిన పేరు ఎందుకు రాలేదు!?**

**భారతదేశంలో హిందుస్తానీ, కర్ణాటక - రెండు ప్రధాన సంప్రదాయాల గురించి మాత్రమే ప్రస్తావిస్తే బెంగాలీలు విభేదిస్తారు. వారికి 'రబీంద్ర సంగీతం' ప్రాణంతో సమానం. పద కవితా పితామహుడు అన్నమాచార్యనుంచీ బాలమురళీకృష్ణ వరకు ఎంతోమంది వాగ్గేయకారులు తెలుగు గీతాల్ని సుసంపన్నం చేశారు. వాగ్గేయ కారులు ఒన్నివందల మంది ఈ గడ్డ మీద జన్మించడం విశేషమైతే, లలిత సంగీతానికి మాత్రం వంగదేశమే తొలి పట్టినిల్లు. రవీంద్రనాథ్ టాగూర్ కన్నాముందు కాజీ నజ్రుల్ ఇస్లాం అనే వాగ్గేయకారుడు ఇరవయ్యో శతాబ్దంలో 'నజ్రుల్ గీతి'ని దేశానికి పరిచయం చేశారు. ఆయనే బెంగాలీల తొలి వాగ్గేయకారుడు. అంతేకాదు దేశంలో తొలి సంగీత దర్శకుడు కూడా ఆయనే!**

2001 మే నెల 25న

బెంగాల్ ముఖ్యమంత్రి 'నజ్రుల్ మంచ్' కార్యక్రమంలో పాల్గొని 'వంగ సంగీతానికి ఆది పురుషులు కాజీ నజ్రుల్ ఇస్లాం' అని కొనియాడారు. 'నజ్రుల్ గీతి' మాధుర్యాన్ని అశేష సంగీతాభిమానులకు పంచిన వారు ఇంద్రాణిసేన్. 'నజ్రుల్' ఒక సంప్రదాయంగా ఎదగడానికి, విస్తరించడానికి కృషిచేస్తోన్నగాయని ఇంద్రాణిసేన్.

ఇంతకీ ఈ నజ్రుల్ ఎవరు? వీరి సంగీతానికి ఉన్న ప్రాధాన్యం ఏమిటి? ఇవి ఎంతైనా ఆసక్తి కలిగించే అంశాలే.

అరవై ఏళ్ళ మాట! భారతదేశంలో చలన చిత్ర సంగీతం మెలమెల్లగా కూనిరాగాలు తీస్తున్న తరుణం. 'గ్రామఫోన్ కంపెనీ ఆఫ్ ఇండియా' అప్పటికే ఎన్నో గీతాలతో సంగీత ప్రపంచంలోతనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని స్థిరం చేసుకుంది. ఆ కంపెనీలో సంగీత దర్శకుడు కాజీ నజ్రుల్ ఇస్లాం. రెండు దశాబ్దాల పాటు ఆయన ఆ సంస్థలోనే పనిచేసి వెయ్యి గీతాలకు సంగీతం సమకూర్చారు. అందుకే ఆయన 'బంగ్లా ఆధునిక్ గాన్' సంప్రదాయానికి ఆద్యుడు.

వెయ్యి గీతాలకు బాణాలు కూర్చి వాటిని రికార్డు చేసి దేశం మొత్తం వినిపించిన ఆ అమరగాయకునికి ఎందుకని రావలసినంత పేరు రాలేదు? అంతేకాదు సంగీత ప్రపంచంలో ఆయన ప్రస్తావన కూడా ఉండదు ఎందుకని? అంటే... అదంతా 'విశ్వభారతి' వల్లే అంటారు. విశ్వ భారతి-రవీంద్రనాధ్ టాగూర్ స్థాపించిన సంస్థ. అది ఆ సంగీత వ్యాప్తికే కృషి చేయడంతో 'నజ్రుల్ గీతి' కాలక్రమేణా నిరాదరణకు గురైంది. సుమన్ ఛటోపాధ్యాయ, తదనంతర కాలంలో ఇంద్రాణి సేన్ ఆ బాధ్యతను తమ భుజాల పైకెత్తుకున్నారు.

భారతదేశంలో 'నజ్రుల్ గీతి'కి కొంత కాలదోషం పట్టినా, బంగ్లాదేశ్‌లో మాత్రం నజ్రుల్ శిష్య పరంపర అవిచ్ఛిన్నంగా కొనసాగుతోంది. 1960 తర్వాత మానవేంద్ర ముఖోపాధ్యాయ్, పూరబీ దత్తా, సుకుమార్ మిత్రా, ధీరేన్‌బసు వంటివారు ధీరేంద్ర చంద్ర మిత్రా, సిద్దేశ్వర ముఖోపాధ్యాయ్ వంటి గురువుల వద్ద శిష్యరికం చేసి 'నజ్రుల్ గీతి' సంప్రదాయ హృదయాన్ని పట్టుకోగలిగారు.

ప్రసిద్ధ హిందీగాయకుడు మహమ్మద్ రఫీ 'నజ్రుల్ గీతా'లను పాడటమేగాక అప్పట్లో ఎల్పీని కూడా విడుదల చేశారు. స్వయంగా కాజీ నజ్రుల్ ఇస్లాం కోడలు కళ్యాణి కాజీ ఆ 'ఎల్పీ'కి సంగీత దర్శకత్వం వహించడం విశేషం. అప్పట్లోనే ధీరేన్ బసు అనే సంగీత దర్శకుడు ఆశాభోన్స్లే చేత నజ్రుల్ గీతాలు పాడించారు. 'నజ్రుల్ గీతి' శత జయంతి వేడుకలు 1999లో జరిగాయి. ఆ సందర్భంగా 'బంగ్లా అకాడమీ' నజ్రుల్ మీద వచ్చిన వ్యాసాలన్నింటినీ పుస్తకంగా ప్రచురించడమేకాక ఆయన గీతాలన్నింటినీ సేకరించింది. హెచ్.ఎం.వి. సంస్థ అందుకు పూర్తి సహకారం అందించడ, ఈ సందర్భంగా గమనార్హం. ఆయన పాటల్లోని ఆణి ముత్యాలను సేకరించి అయిదు క్యాసెట్లు రూపొందించింది.

ప్రస్తుతం 'నజ్రుల్ గీతి'కి ప్రచారం కల్పిస్తోన్న గాయని ఇంద్రాణి సేన్. ఆమె మాటల్లో చెప్పాలంటే ''సంగీతానికైనా, సాహిత్యానికైనా ఆదరణ కల్పించడానికి, దాన్ని ఒక ఉద్యమంగా ప్రజల్లోకి తీసుకు వెళ్ళడానికి ఏదో ఒక సంస్థ గట్టిగా కృషి చేయాలి. 'రబీంద్ర సంగీత్' జీవించి ఉందంటే ఒక విశ్వవిద్యాలయం దానికోసం శ్రమిస్తోంది. నజ్రుల్ గీతికి అటువంటి ఆదరణ, ప్రోత్సాహం లేదు. అందుకే ఇది జనంలోకి వెళ్ళలేక పోతోంది' అంటారు.

నజ్రుల్ ముస్లిం జీవన విధానంలోని కళాత్మక, సృజనాత్మక అంశాలన్నిటినీ తన గీతాల్లో నింపారు. అలాగే హిందూదేవతలపై ఎన్నో కమనీయ గీతాలు కూర్చారు. ఆయన హిందూదేవతలపై కూర్చిన సంగీతంలో 'శ్యామా సంగీత్'కి అప్పట్లోనే కాక, ఇప్పుడు కూడా ఎంతో ఆదరణ ఉంది. 'శ్యామా సంగీత్' గీతాలు ఇంటింటా ఇప్పటికీ వినిపించడమే అందుకు నిదర్శనం.

ఇంద్రాణీ సేన్‌తో పాటు హైమంతీ శుక్లా, అజయ్ చక్రవర్తి, శ్రీకాంత్ ఆచార్య తదితరులు కూడా నజ్రుల్ గీతాల వ్యాప్తికి ఎంతో కృషి చేస్తున్నారు. అన్నమయ్య కీర్తనలకు తిరుమల దేవస్థానం వంటి బృహత్ సంస్థ సహకారం లభించినట్లు 'నజ్రుల్ గీతి'కి అటువంటి సహకారం లభించడం కష్టం. అయినా జనామోదం పొందిన సంగీతం ఎక్కడో చోట వినిపిస్తూనే ఉంటుంది.

దేశంలో తొలి సంగీత దర్శకుడైనా 1000 గీతాలకు పైన స్వరపరిచినా రావలిసిన పేరు ఎందుకు రాలేదు!?

**-సి. హెచ్. లక్ష్మి**



# హోటల్ స్పెషల్




పట్నంలో రెండు హోటళ్ళు ఎదురూ బొదురుగా వున్నాయి. పట్నానికి పనుండి వచ్చిన ఓ పల్లెటూరి ఆసామి "ఈ రెండు హోటళ్ళలో భోజనం ఎక్కడ బాగుంటుంది?" అని అడిగేడు దారిన పోతున్న పెద్దమనిషిని ఆపి.

"మీరు ఎందులో తిన్నా.... భోజనం అయిన వెంటనే.... అరెరే ఆ ఎదురుగుండా ఉన్న హోటల్లో తినుంటే బాగుండేదే... అనుకోవటం మాత్రం ఖాయంసార్...." తడుముకోకుండా చెప్పాడు పట్నం పెద్దమనిషి.



"ఏంటయ్యా... సర్వరు... సాంబారులో చిల్లర నాణేలు వస్తున్నాయ్".

"మర్చి పోయారా సార్! భోజనంలో కొంత 'ఛేంజ్' వుంటేగానీ మా హోటల్‌కి రానని క్రిందటి సారి మీరే అన్నారుగా".






"రసంలో చచ్చిన ఈగ వుందేంటయ్యా" ఫిర్యాదు చేశాడు కస్టమర్.

"చాలా రోజుల తర్వాత ఇవాళ రసం వెచ్చబెట్టాం సార్.., పాపం చచ్చిపోయి ఎంతో టైమ్ అయి ఉండదు... తీసేస్తానుండండి. లాగించేద్దురుగాని.."



"నువ్వు తెచ్చే బోడి అరకోడి మాంసం కోసం ఎంత సేపు కూర్చోవాలయ్యా..."

"ఎవరైనా వచ్చి మరో అరకోడికి ఆర్డర్ యిచ్చే వరకూ కూర్చోవలసిందే. మీ ఒక్కళ్ళ కోసం కోడిని నగవెలా చంపుతాం చెప్పండి"



"దుప్పట్లు శుభ్రంగానే వున్నాయి కదా?" హోటల్ గదిలో పడుకోటానికి సిద్ధమవుతూ అడిగేడు కస్టమర్.

"నేనే వాటిని ఈరోజు స్వయంగా ఉతికేను సార్... మీకు నమ్మకం లేకుంటే పడుకుని చూడండి. ఇంకా తడి తడిగానే ఉంటాయ్..."



తన గర్ల్ ఫ్రెండుతో కలిసి రెస్టారెంట్‌కు వెళ్ళాడు ఆనంద్. కాఫీఆర్డర్ యిచ్చాడు. వెయిటర్ కాఫీతెచ్చి ఇచ్చి వెళ్ళాడు. కాఫీలో వున్న పురుగును చూసి.... "వెయిటర్ ఈ పురుగుని తీసెయ్..." అని కేకేసి చెప్పింది గర్ల్ ఫ్రెండ్.

"అలాగేనమ్మా.... వుండండి వస్తున్నా..." అంటూ కోపంగావచ్చి పక్కనే ఆనంద్‌ని బయటకు విసిరేశాడు వెయిటర్.



"సర్వర్... సాంబారులో చచ్చిన పురుగు వచ్చిందయ్యా...."

"ఆ పురుగుకి ఈత రాదేమో సార్.... పాపం....".



# హోటల్ స్పెషల్






"ఏంటి... నాయనా ఈ కోడికి ఒక కాలే వుంది?" చికెన్ తినబోతూ అడిగేడు కస్టమర్.
"మా చేతనైనంత వరకూ మేం మంచివే పెట్టాలని చూస్తాం సార్.... బహుశా అది పందెంలో ఓడిపోయిన కోడై వుంటుంది..." నవ్వుతూ చెప్పాడు సర్వారావు.
"అలా అయితే ఈ ఆర్డర్ కాన్సిల్ చేసి గెలిచిన కోడిని పట్రా...."



భోజనం చేద్దామని హోటల్‌కి వెళ్ళాడు ఓ పెద్దమనిషి.
కూర్చుని గంట కావస్తున్నా తనని ఎవరూ పట్టించుకోక పోవడంతో విసుగుచెంది....
"ఈ రోజంతా నేను యిలా కూర్చుని వుండాల్సిందేనా?" అన్నాడు అసహనంగా.
"అక్కర్లేదు సార్... రాత్రి తొమ్మిదింటికి హోటల్ మూసేస్తాం.... " బదులిచ్చాడు ఓ కొంటె సర్వారాయుడు.



"సర్వర్... ఈ సాంబార్లో పడింది ఏమై ఉంటుందంటావ్?"
"ఖచ్చితంగా చెప్పలేను సార్.... ఈ మధ్యనే కొత్తగా చేరాను. ఒక దాని కొకటి చెబితే బాగుండదు కదా"




టీ త్రాగడానికి కాకా హోటల్‌కి ముగ్గురు వ్యక్తు లొచ్చారు.
"నాకో కప్పు టీ కావాలి... స్ట్రాంగ్‌గా "
"అలాగేసార్...."
"నాక్కూడా టీ కావాలి... వేడిగా"
"అలాగే సార్... మరి మీకు?"
"నాక్కూడా టీయే! అరువుగా"



ఓ హోటల్ ముందు 'కోడి భోజనం" రూపాయి మాత్రమే అని బోర్డు వుంది. అది చూసి టిక్కెట్ కొని హోటల్లో కూర్చుని లొట్టలు వేయసాగాడు ఓ ఆసామి.
కాసేపున్నాకా జొన్నలు ప్లేటులో తెచ్చి పెట్టాడు సర్వానందం.
"ఇదేమిటి జొన్నలు తెచ్చావ్?" కోపంగా అడిగేడు ఆసామీ.
"అవునండీ కోడి తినేవి ఇవేగా..." నవ్వుతూ అన్నాడు సర్వానందం.




## తారాగణం

**ఆకాష్, రేఖ, వెంకట్, తనూరాయ్**

తనికెళ్ల భరణి, చంద్రమోహన్, ఢిల్లీరాజేశ్వరి, సుధ, ఎమ్మెస్ నారాయణ, బ్రహ్మానందం, బెనర్జీ, మెల్కోటే

పాటల పుస్తక ప్రియుల కోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' పత్రిక అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది

## సాంకేతిక వర్గం

మాటలు: చింతపల్లి రమణ
పాటలు: సిరివెన్నెల, భువనచంద్ర, పోతుల రవికిరణ్, దేవిశ్రీ ప్రసాద్
సంగీతం: దేవిశ్రీ ప్రసాద్
కెమెరా: సమీర్ రెడ్డి
ఎడిటింగ్: కోలా భాస్కర్
ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్: వల్లూరిపల్లి వెంకటేశ్వరావు
నిర్మాణ నిర్వహణ: ఎ.వి. రావు
నిర్మాత: రామోజీరావు
స్క్రీన్ ప్లే, దర్శకత్వం: శ్రీనువైట్ల






రామోజీరావు



శ్రీను వైట్ల



దేవిశ్రీప్రసాద్



సీతారామశాస్త్రి



భువనచంద్ర

8 ఆనందం

---




పాటల పుస్తక ప్రియుల కోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' పత్రిక అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది

## తారాగణం

దిలీప్
రేఖ
చంద్రమోహన్
సుధ
చలపతిరావు
బ్రహ్మానందం
మల్లిఖార్జునరావు
ఎమ్మెస్‌నారాయణ
ఏవియస్
జయలలిత
విజయ భాస్కర్

## సాంకేతిక వర్గం

మాటలు: జనార్దనమహర్షి
పాటలు: వేటూరి, భువనచంద్ర, సుద్దాల అశోక్ తేజ
కెమెరా: శరత్
ఆర్ట్: శ్రీనివాస రాజు
ఎడిటింగ్: హరి
డాన్సు: సుచిత్ర
కాస్ట్యూమ్స్: బిగ్‌షాట్
నిర్మాత: ఎమ్. అర్జునరాజు
కథ,స్క్రీన్‌ప్లే, సంగీతం, దర్శకత్వం: S.V. కృష్ణారెడ్డి





ఎం.అర్జునరాజు



ఎస్.వి.కృష్ణారెడ్డి






వేటూరి



భువనచంద్ర



అశోక్‌తేజ

8 జాబిలి

రచన:పోతుల రవికిరణ్ **1** గానం: సునితారావు

చిక్ చిక్ చాం చిక్ చాం చాం చాం
ప్రతి నిముషం ఆనందం
చిక్ చిక్ చాం చిక్ చాం చిక్
చాం చిక్ చాం
మనసంతా ఆనందం
రంగుల లోకం అందించు
ఆహ్వానం ఆనందం
ఆశల జండా ఎగరేసే
స్వాతంత్ర్యం ఆనందం॥చిక్ చిక్ చాం॥
ఆ: హొయ్యారె హాయ్ హొయ్యారె
హొయ్యారి హొయ్
అ: ఊహించే ఊహల్లో
ఊరేగడమే ఆనందం
కవ్వించే కల కోసం
వేటాడడమే ఆనందం
అలలై ఎగసే ఆనందం

అలుపే తెలియని ఆనందం
ఎదురేవున్నా ఎవరేమన్నా
దూసుకుపోతూ ఉంటే
ఆనందం ఆనందం ॥చిక్ చిక్ చాం॥
దం అదం అదం ఆనందం
దం అదం దం ఆనందం
ప్రతి అందం మనకోసం
అనుకోవడమే ఆనందం
రుచి చూద్దాం అనుకుంటే
చేదైనా అది ఆనందం
ప్రేమించడమే ఆనందం
ఫెయిలవ్వడమే ఒక ఆనందం
కలలే కంటూ నిజమను కుంటూ
గడిపే కాలం ఎంతో ఆనందం
॥చిక్ చిక్ చాం॥

రచన : సిరివెన్నెల సీతారామశాస్త్రి **2** గానం: మల్లిఖార్జున్, సుమంగళి

కనులు తెరచినా కనులు మూసినా కలలు ఆగవేలా
నిజము తెలిసినా కలని చెప్పినా మనసు నమ్మదేలా
ఎదుటే ఎపుడూ తిరిగే వెలుగా
ఇదిగో ఇపుడే చూశా సరిగా
ఇన్నాళ్ళూ నేనున్నది నడిరేయి నిదురలోన
అయితే నాకీనాడే తొలిపొద్దు జాడ తెలిసిందా కొత్తగా ఆ: ॥కనులు॥
పెదవుల్లో ఈ దరహాసం
నీకోసం పూసింది
నీ జతలో ఈ సంతోషం పంచాలని పిస్తోంది
అ: ఎందుకనో మదినీ కోసం ఆరాటం పడుతోంది
అయితేనేం ఆ అలజడిలో ఒక ఆనందం ఉంది
ఆ: దూరం బహుచిత్రమని



జస్ట్ జాయిన్‌టు ఫాల్ ఇన్ లవ్
లక్కు పెద్దని లక్కు దక్కదుటా
వలేసినా అది చిక్కదంటా వలేసినా అది చిక్కదంటా
ప్రేమించడం గొప్ప ఆర్టు అంటా
ప్రేమించబడటం గిఫ్టు అంటా ప్రేమించబడటం గిఫ్టు అంటా
లవ్ గెలిస్తే జన్మ ధన్యమంటా
ఎటు చూసినా అది స్వర్గమంటా
ఫెయిలైతే చాల కష్టమంటా
లైటేసినా లైఫ్ చీకటంటా ॥ప్రేమంటే॥
ఆ: మనసుతోటి మనసునే ముడేసే మంత్రమే ప్రేమా
కళ్ళలోనే కాంతులేవో నింపే క్షేత్రమా
అ: కొత్త కొత్త ఊసులేవో నేర్పే భాష ఈ ప్రేమా
తీయనైన పాటలేవో పాడే రాగ మీ ప్రేమా
ఆ: కరిగిపోని కలల తోటి కంటెను గుండెనీ నింపెనీ ప్రేమా
లేని పోని ఆశలేవో రేపే మైకమే ప్రేమా
అ: ప్రేమే కదా శాశ్వతం ప్రేమించడమే జీవితం
ప్రేమకే మనసు అంకితం అంకితం
ఆ: ప్రేమే కదా శాశ్వతం ప్రేమించటమే జీవితం
ప్రేమకే మనసు అంకితం అంకితం
హోయ్ ప్రేమంటే ఏమిటంటే పక్కాగా చెప్పమంటే
ఇట్టాగే చెప్పాలి మామా
చూసినట్టు చెప్తుతుంటే నమ్మకేం చేస్తాము విని నేర్చుకుందాం
ప్రేమా ప్రేమా ప్రేమా ॥ప్రేమంటే॥
వుయ్ డోన్ట్ నో హావ్ టు ఫాల్ ఇన్ లవ్
బట్ ఇట్స్ రియల్లీ గ్రేట్ ఫాల్ ఇన్ లవ్ యార్
..



రచన: సుద్దాల అశోక్‌తేజ **1** గానం : కె.కె, చిత్ర

అ: గంగా యమునా గోదారి పుట్టిన చోట చూడు
ఒక్కో బొట్టే నీరై ఊరి ఏరై పారి నదిలా పొంగింది
ఓకేనా ఓమై ఫ్రెండ్ యు ఆర్ రైట్
ఆ: నువ్వు నేను అనుకుంటే కానిది ఏదీ లేదు
ఒక్కో మెట్టే కట్టే ఎక్కు ఎవరెస్టయినా జోహారంటుంది
రెస్టింకా మనకొద్దు ఓ నేస్తం
అ: నువ్వే నీ సైన్యం కావాలి నీ విశ్వాసం ఊపిరి నిండాలి
ఆ: ఆ నింగి టార్గెట్టవ్వాలి ఆశల సౌధం మన చుక్కానవ్వాలి ॥గంగా యమునా॥
ఆ: ఊహాల మేడలోనా కలని నిజమంటు ఋజువు చెయ్యాలి
అ: చీకటి రెప్పల్లోనా నిండు జాబిల్లి సొంతం కావాలి
ఆ: వికసించిందా ప్రేమా సాహసమె ఇక చిరునామా
అ: కాలానికి ఎదురీది తీరాలను చేరగలేమా
ఆ: మెరుపై కదిలే ప్రేమను ఆపేదెవరు
గనులను కొలిచే మనసే ఉంటే వజ్రధూళి సిందూరం కాదా
ప్రేమ కంటికే చూపై ఉంటే చేరువ కాదా దూరం ॥గంగా యమునా॥
అ: స్నేహమే దీపంగా మారి దారి చూపించి నడిపిస్తూ ఉంటే
ఆ: ప్రేమలే గుండెల్లో నిండి నిత్యం ఆక్సిజన్ అందిస్తూ ఉంటే
అ: అలుపు సొలుపే రాదు
మరి వెనకకు అడుగే లేదు
ఆ: స్టయిలు ప్రపంచం మీద యిక యూరోలే సంధిస్తే
అ: మనమే రేపటి లైఫ్ స్టయిలవుతాము
నల్లని రాళ్ళను ఉలితో చెక్కి డిజైను చేస్తే శిల్పారామం
ప్రతి నిమిషాన్ని ప్రేమతో చెక్కి డిజైను ఇస్తే లైఫే శిల్పం ॥గంగా యమునా॥



అ: దోస్తీ చేస్తామంటే ఏ డొనేషన్లు మేమడగం
ఆ: రిజర్వేషనే లేని స్నేహానికి సీటిచ్చేస్తాం
అ: పరిధే లేని మనసే మనదే ఫ్రెండు
ఆ: క్లాస్ షూసు బెల్టూ హాటు పైపైవేసే ఎక్స్‌ట్రాలు ఏ దేశానివైనా కాని
గుండెలు మాత్రం ఇండియా ॥జాలి జాలి॥

రచన: సుద్దాల అశోక్‌తేజ **6** గానం: హరిహరన్, స్నేహపంత్

అ: పద పదనీ ఇక మొదలవని
ఇది మన తియ్యని లవ్ జర్నీ
ఫుల్ ఫుల్ ఫుల్ ఫుల్ వండర్‌ఫుల్ మామామియా మామామియా
ఆ: పద పదనీ ఇక మొదలవని చేరాలి లవ్ లోకాన్ని
బుల్ బుల్ బుల్ బుల్ బ్యూటీ ఫుల్
అ: నింగీ నేలా పెదవులు కలిపే
ఆ: రంగుల రెయిన్‌బో రమ్మని పిలిచే
అ: కనపడుతుందా ఆపైనా
ఆ: కనివిని ఎరుగని మన ప్రేమా
మామామీయా మామామీయా
అ: మెరిసిన ప్రేమ జాబిలి చూడు మనకై పగలె వెన్నెలకాచె
మామామీయా ఓ మామామీయా ఓ...
ఆ: నడుమున చేయి వేసిన నాకు నీతో జతయే కలగా తోచె
అ: ఆ కలలోకే రివ్వున రానా
ఆ: మామామియా ఓ మామామీయా
ఆ: వస్తే చుక్కల మేనా కానా
లవ్‌లో ఉన్న మెరకిల్లిదేనా ఆ: "పదపద"
అ: పువ్వులె భాష తెలిసిన గాలి చెవిలో ఊదిన సీక్రెట్ ఏంటో
మామామీయా మామామీయా...
ఆ: నయాగర లాగ దూకె ఈడు స్పీడే నీదని గుసగుసలాడె
అ: మెరుపై నీవె నావెనకుంటే...
ఆ: మామామీయా ఓ మామామీయా...
ఆ: మేఘాలన్ని నివ్వెరపోయే
అ: ప్రణయ విమానం టేకాఫ్ మనదే ॥పద పదని॥
..

**రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి — 6 — గానం: చిత్ర**

దిరన దిరనన దిరననా దిరననా
దిరన దిరనన దిరనన
దిరననా దిరననా దిరనా
ఎవరైనా ఎపుడైనా
ఈ చిత్రం చూశారా
నడిరాతిరి తొలి వేకువ రేఖా
నిదురించే రెప్పలపై
ఉదయాలను చిత్రించే
ఒక చల్లని మది పంపిన లేఖా
గగనాన్ని నేలని కలిపే
వీలుందని చూపేలా

ఈ వింతల వంతెన
ఇంకా ఎక్కడి దాకా
చూసేందుకు అచ్చంగా
మన భాషే అనిపిస్తున్నా
అక్షరము అర్థం కాని
ఈ విధి రాత
కన్నులకే కనబడని
ఈ మమతల మధురిమతో
హృదయాలను కలిపే శుభలేఖ
ఓ.... ఓ.... ఓ...
॥ఎవరైనా॥

**రచన: దేవిశ్రీ ప్రసాద్ — 7 — గానం: దేవిశ్రీ ప్రసాద్, మల్లికార్జున్, సుమంగళి**

అ: ప్రేమంటే ఏమిటంటే పక్కాగ చెప్పమంటే
ఎట్టాగా చెప్పేది మామా
ఏదేదో అయ్యినట్టు ఏమైందో తెలియనట్టు
వింత వింతగుంటాది ప్రేమ
ఓయ్..... ॥ప్రేమంటే॥
అడ్వాన్సు వార్నింగు యివ్వకుండానే
డేటు టైమూ మనకు చెప్పకుండానే
గుండెల్లో చోటుందో లేదో కూడా చూడకుండానే
ఎట్లీస్ట్ మన అనుమతైనా అడుగకుండానే
పుట్టేస్తుందిరా ప్రేమా పుట్టేస్తుందిరా ప్రేమా
పుట్టేస్తుందిరా ప్రేమా హాయ్ హాయ్ ॥ప్రేమంటే॥
వుయ్ డోంట్ నో హౌ టు ఫాల్ ఇన్ లవ్



లోకం అనుకుంటుంది
కానీ ఆ దూరమే నిన్ను దగ్గర చేసింది
అ: నీలో నా ప్రాణం ఉందని
ఇపుడేగా తెలిసింది
నీతో అది చెప్పిందా
ఈ జ్ఞాపకాలే నా ఊపిరైనవని ఆ: ॥కనులు॥
అ: ప్రతి నిముషం నా తలపంతా
నీ చుట్టూ తిరిగింది
ఎవరైనా కనిపెడతారని
కంగారుగా ఉంటోంది
ఆ: నా హృదయం నీ ఊహలతో
తెగ ఉరకలు వేస్తోంది
నాక్కూడా ఈ కలవరమిపుడే పరిచయమయ్యింది
అ: అద్దంలో నా బదులూ అరె నువ్వే కనిపించావే
నేనే యిక లేనట్టు నీలో కరిగించావే
ఆ: ప్రేమా ఈ కొత్త స్వరమని అనుమానం కలిగింది
నువ్వే నా సందేహానికి వెచ్చనైన బుజువియ్యమంది మరి
అ: కనులు తెరిచి ఆ: ॥ఎదుటే ఎపుడూ॥
అ: ఇన్నాళ్ళూ నేనున్నది నడిరేయి నిదురలోన
ఆ: అయితే నాకీనాడే తొలిపొద్దు జాడ తెలిసింది కొత్తగా

**రచన: భువనచంద్ర — 3 — గానం: కల్పన, దేవిశ్రీ ప్రసాద్**

ఆ: మోనాలీసా....
పల్లవి: ఆ: మోనాలీసా నా సిస్టరే
ప్రైమిలిస్తానంటే సిక్సరే
వచ్చేయ్ చేసేద్దాం అల్లరే అల్లరే
నా మనసింకా వైట్ పేపరే
పెట్టేస్ కో నీ సిగ్నేచరే
రేపేస్తా నీలో హంగరే హంగరే
నా వగలే లేజర్ లుక్సులే



కపి కోరికతో కలలుగని నూరడుగులు నడిచివచ్చా
ఆ: కాక రెచ్చిపోతే కరగదీసెయ్‌నా
ఒడిగా వడివడిగా యిరగదీసెయ్‌నా
ఆ: ఓ జీన్సు బాబు
అ: ॥ఓ స్కర్టు పాపా॥ ॥ఇది అచ్చమైన॥

**రచన: సుద్దాల అశోక్‌తేజ — 5 — గానం: శంకర్ మహదేవన్, స్నేహ**

ఆ: వందే పద్మకరాం
ప్రసన్న వదనాం సౌభాగ్యదాం భాగ్యదాం
యారి యారి యారి యారి
అ: జాలి జాలి కాలేజి అంటే మీనింగ్ టీనేజీ
స్వీటీ స్వీటీ నాటి నాటి యాదే యాదే యిచ్చే లవ్‌పేజీ
కాలేజీ టీనేజీ ఎంజాయ్‌జీ...
ఆ: బికిని చోలీ పంజాబీ డ్రస్‌లకు అందం మాదే
నవ్వేపూలు నడిచేపూలు పలికే పూలరేకుల రంగోలి
అందాలపై పూల రంగోలి
అ: ఎంగేజి దాటి పోయాక ఈ లవ్‌పేజీ గుర్తుండేలాగా
అల్లరిలో పిహెచ్‌డి పొంది మన కాలేజీ గ్లామర్ పెంచాలి
అ: ॥జాలి జాలి॥
ఆ: రోడ్‌కు బ్యూటి ఉంటుందా కాలేజీ అమ్మాయిల బ్యూటి లేకుంటే
అ: డిస్కోకు మెరుపే వస్తుందా
కాలేజ్ స్టూడెంట్ల స్టెప్పే పడకుంటే
ఆ: అమెరిక ప్రెసిడెంటైనా అద్దంకిల ముసలాడైనా
అ: కబురులడిగితే చాలు తన కాలేజ్ డేసంటాడు
ఆ: అల్లరి చేసే ప్లేసే యిదికదా
అ: అందరికేమో వీకెండుల్లో ఆదివారమొకటే హాలీడే
ఎవ్రీ డే హాలీడేలాగ జల్సా ప్లేసే కాలేజి
అ: ॥జాలీ జాలీ॥
అ: మా హీరో మార్నింగ్ షో కోసం
కాలేజ్ మానేసే హీరోలం మేమే
ఆ: ఏ స్టారు సక్సెస్ ఫెయిలేంటో తేల్చే ఫర్‌ఫెక్టు జడ్జెస్ మేమేలే



**రచన: సుద్దాల అశోక్‌తేజ — 2 — గానం: ఉన్నికృష్ణన్, చిత్ర**

అ: చిగురాకు ఎవరో చినుకైనదెవరో
చిగురంత పేరే ప్రేమ
ఆ: పెదవైనదెవరో మురళైనదెవరో
పలికించు స్వరమే ప్రేమ
అ: పొగమంచులను కరిగించేసే వెలుగులదే ప్రేమా తెలుసా
ఆ: అదేమొ తెలియని యధార్థమేదో భరించటం ప్రేమా
అ: ప్రియా ఇదీ నీ దయా అని కలవరించటం ప్రేమ ॥చిగురాకు॥
అ: చెలి చూపులోన తలదాచుకున్న లేలేత ప్రేమా
ఉనికిని కనుగొన లేదా ఎద అలికిడి అది వినకుందా
ఆ: కనుపాపలోన తను స్నానమాడె కనిపించు ప్రేమా
మనసుకు మిగిలిన వరమే అది కదిలిన ఒక జ్ఞాపకమే
అ: తలపులలోన పువ్వులు పరచి మాయని గాయము హాయిగ చేసే
తీయనిదీ ప్రేమా తెలుసా
ఆ: వనాలకోసం ప్రయాణమైన వసంతమే ప్రేమా
అ: అశాంతివేళ ప్రశాంతలీల విశేషమే ప్రేమా ॥చిగురాకు॥
ఆ: ఈ కలల బరువు నే మోయలేను
నను చేరదీసే దయ గల దొర యిక రాడా
అని మరిమరి పిలిచెను రాధ
అ: నా వలన కాదు ఇక నిలవలేను నీ చెలిమి లేక
గడియొక యుగమవబోదా అని పరుగున హరి రాలేదా
ఆ: పిడికెడు గుండెలో జలపాతములా అదిమిన కొలదీ అవధులు దాటే
అమృతమే ప్రేమా తెలుసా
అ: చెలి చెలియని సరాగమాడే పరిమళం ప్రేమా
ఆ: చిరాయువై చిరు పెదాలపై ఇక తథాస్తు ఈ ప్రేమా ॥చిగురాకు॥

చూపులతో తీస్తా ఎక్సరే
అవి పడితే జోడి ఫిక్సరే ఫిక్సరే ॥మోనాలీసా॥
అ: మోనాలీసా...
చరణం: ఆ: ఆ సలసల కాగె నా వయసును చూడు
ఆ ఏదేదో చేసేస్తా రారా
ఆ మధువులు ఊరే నా పెదవులు చూడు
రా భూకంపం పుట్టిస్తా నీలో
అ: హౌ ఈజ్ దిస్ గర్ల్
వేర్ డిడ్ షీ కమ్ ఫ్రమ్
వాట్ షీ గోన్‌నా డూ టు అజ్ నవ్ ॥రిపీట్ 2 టైమ్స్॥
షీ ఈజ్ బ్రేకింగ్ మై హార్ట్ ॥రిపీట్ 2 టైమ్స్॥
మోనాలీసా...
చరణం: ఆ: నా డాన్సింగ్ హిట్సే న్యూ ఫాషన్ లుక్సే
రా నేర్పిస్తా ఎన్నెన్నో లెసన్సే
నా సిల్కీ బాడీ ఆ చాలా వేడి
ఏ కట్టేస్తా నీతోనే జోడి
అ: హౌ ఈజ్ దిస్ గర్ల్
వేర్ డిడ్ షీ కమ్ ఫ్రమ్
వాట్ షీ గోన్ నా డూ టు అజ్ నవ్ ॥రిపీట్ 2 టైమ్స్॥
షీస్ బ్రేకింగ్ మై హార్ట్ ॥రిపీట్ 2 టైమ్స్॥ ॥మోనాలీసా॥

రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి — 4 — గానం: ప్రతాప్

ఎవరైనా ఎపుడైనా
సరిగా గమనించారా
చలిచెర అసలెప్పుడు వదిలిందో
అణువణువు మురిసేలా
చిగురాశలు మెరిసేలా
తొలి శకునం ఎప్పుడు ఎదురైందో
చూస్తూనే ఎక్కడినుంచో
చైత్రం కదిలొస్తుంది

పొగమంచును పోపొమ్మంటూ తరిమేస్తుంది
నేలంతా రంగులు తొడిగి
సరికొత్తగా తోస్తుంది
తన రూపం తానే చూసి పులకిస్తుంది
ఋతువెప్పుడు మారిందో
బ్రతుకెప్పుడు విరిసిందో
మనసెప్పుడు వలపుల వనమయ్యిందో
ఓ.... ఓ.... ఓ...

ఆనందం

ఎవరైనా ఎపుడైనా
సరిగా గమనించారా
చలిచెర అసలెప్పుడు వదిలిందో
అణువణువు మురిసేలా
చిగురాశలు మెరిసేలా
తొలి శకునం ఎప్పుడు ఎదురైందో

రచన: పోతుల రవికిరణ్ — 5 — గానం: సునీతారావు

దిరన దిరన దిరన దిరన దిరన దిరన దిరనా దిరన దిరన
ఆ...
హా... ఒక మెరుపు మెరిసె నయనములో
చిరు చినుకు కురిసె హృదయములో
మది పలుకుతున్న సమయములో
శృతి కలుపుతున్న పవనములో
మనలో...ఓ...... మనకే.......ఏ ....
మనలో మనకే ఈ తెలియని అలజడి కలిగినదని ॥ఒక మెరుపు॥
దిరన దిరన దిరన దిరన నాదిర దిన దిరన దిరన దిరన
కనులు తెరిచి నిదుర మరచి
పరుగులతో జయిస్తు ప్రతి నిముషం
కలలు విరిసి మనసు మురిసి
అరుపులతో జపించు ప్రతి తరుణం
ఉరుములతో మాకు గుసగుసలేమో పెదవుల పిలుపులు పదనిసలే
రంగులతో నింగి ఎదురై నిలచిన చిరుత చురుకు రగిలిన రగడలో ॥ఒక మెరుపు॥
కలికి చిలకా అలక చిలికి
పొగరులతో ఒకింత అందములె
మెరుపు తునకా తళుకుమనకా
కులికెనులే ఒయ్యారి చందములై
మిసమిసలనే చూసి ఎగబడితే
తొలి రుసరుస చూసి పరుగెడితే
ఈ సమరములో మాది గెలుపైతే ఎద ఎగసి ఎగసి
ఉరకలు ఉరికెను ॥ఒక మెరుపు॥
మనలో.... మనకే....
మనలో మనకే
ఈ తెలియని అలజడి కలిగేనని ॥ఒక మెరుపు॥

ఆనందం

రచన: వేటూరి — 3 — గానం : ఉన్నికృష్ణన్

అ: వయసు తలుపు తెరిచే అలికిడికి మనసు ఎదుట నిలిచె
తనువు తనను మరిచే తపనలకు వలపు చినుకు కురిసె
ఇది పెదాలంటి ఎదే పాడు పదమా
కలే దాటి నిజాలైన క్షణమా
శృతే మించి లయల్లోకి దిగిన ముఖాముఖి సఖి రూపమా
ప్రియతమ సోయగమా రావే జాబిలిగా
నేనే వాకిలిగా ॥వయసు॥
బృందం: రుసరుసల రూపం ఎరుపు
పదనిసల పాదం పసుపు
ఎదిగిన సిగలో తలపు
నింగితో చేతులు కలుపు
చేతులు కలుపు చేతులు కలుపు
అ: ఆమె ఉంటె ఒడిలో వలపు నది కెన్ని ఎన్ని సుడులో
ఆమె లేత మదిలో పలికినవి ఎన్ని రాగ సుధలో
ఆ సొగసు లేవయసు ఇలకు ఇంద్రధనుసు
ఆ మెరుపు మైమరపు కనులకెంత మనసు
స్వాగతాల కలలన్ని కౌగిలింత వలలాయె
జగడపు చనువులలో వేగే వేసవిలో
రావే వెన్నెలగా ॥వయసు॥
అ: జాబిలమ్మ గుడిలో వెలుగు చిరు దీపమెర్రనంటా
సన్నజాజి తొడిమై వణుకు చెలి నడుము ఎక్కడంటా
ఆ తళుకూ ఆ బెళుకూ తారకందవంటా
లో వెలుగు పై మెరుగు తరుణి అందమంటా
చూపు కలియు శుభవేళ సొగసుకిన్ని తెరలేలా
అలజడి కలయికలో నీవే జాబిలిగా రావే నా చెలిగా "వయసు"

జాబిలి

రచన: భువనచంద్ర — 4 — గానం : ఉదిత్‌నారాయణ్, మహాలక్ష్మి

రండి బాబూ రండి బాబూ మనసును పట్టిలాగే
వేడి బజ్జీ వాడి బజ్జీ మసాలా బజ్జీ,
అరటి బజ్జీ, ఉల్లి బజ్జీ, మిరప బజ్జీ... ఉల్....
ఇది అచ్చమైన తెలుగు బజ్జీ నాటు మిరప బజ్జీ
కొరికీ చూస్తే నషా నెత్తికెక్కాలా
ఆ: ఇది నాణ్యమైన మసాల్ వడా
రారా అందగాడా టేస్టు చేస్తివంటే మతులు పోవాలా
అ: సరుకు చూడగానె నోరు ఊరాలా
ఆ: తింటూ తస్సదియ్యా చిందులెయ్యాలా
అ: ఓ స్కర్టు పాపా
ఆ: ఓ జీన్సు బాబూ ॥ఇది అచ్చమైన॥
అ: తేనె కళ్ళల్లో మెరుపేంటే ఓ భామా
ఆ: గుండె లోతుల్లో ఉప్పొంగె తొలి ప్రేమా
అ: లేత బుగ్గల్లో ఎరుపేంటే ఓ బొమ్మ
ఆ: చిలిపి ముద్దెట్టి పోయాడా చందమామ
అ: మిసి మిసి నీ నడుము బరువుతో వంగి పోతే
మదనుడు నా ఎదలో ములుకులు గుచ్చిపోతే
బిగి కౌగిలికే మనసుపడి నీ సరసకు పరుగునొచ్చా
ఆ: కొత్తా సొగసులని కానుకిచ్చేయ్‌నా
అ: చెలియా నీ ఒడినే కొల్లగొట్టనా
ఆ: ఆ పొగరు చూసి ఆ పొగరు చూసి
ఆ పొగరు చూసి దరికి వచ్చా నీకు మనసునిచ్చా
అ: కలనై కళ్ళలోనె ఒదిగి పోతాలే
ఆ: ఆగలేనంటూ పొంగాయి అందాలు
అ: కాస్త ఆరేస్తే పూస్తా శ్రీ గంధాలు జుంజా జుంజా జుంజా
ఆ: ఎలా తీరేనురో కన్నె తాపాలు
అ: పసి ఒంపుల్లో కురవాలె వర్షాలు
ఆ: గడసరి వాడివని కలువల రేడువనీ
చెకుముకి రాయంటి మగసిరి నీదని

జాబిలి




కె.వి.రావు



## 'మాట' నిలుపుకోని కిశోర్

డబ్బు దగ్గర ఎంతో నిక్కచ్చిగా వుండే కిశోర్ కుమార్ డబ్బు తీసుకుని కూడా పాడని సందర్భం ఒకటి వుంది.

సిద్ధివినాయక వారి 'ప్రేమ్ ప్రతిజ్ఞ' (దర్శకుడు బాపు) చిత్రానికి ఆయన పాడుతానని వచ్చారు. కాని, పారితోషికం ఇచ్చే నిర్మాత రికార్డింగ్ థియేటర్ దగ్గరలేడు.

'పారితోషికం ముందు తీసుకోకుండా పాడనుగా!' అన్నాట్ట కిశోర్‌కుమార్. 'నీ పారితోషికం ఎక్కడికీ పోదు, దాన్ని ఇప్పించే పూచీ నాది' అని సంగీత దర్శకుడు బప్పీలాహరి హామీ యిచ్చి పాడించారు.

పొద్దం పూర్తయ్యేసరికి నిర్మాత వచ్చాడు. ఆ పాట పారితోషికం ముట్ట చెప్పాడు.

అది తీసుకున్న కిశోర్‌కుమార్. "రేపు ఇంకోపాట వుందిగా, ఆ డబ్బు కూడా ఇచ్చేయండి" అన్నాడు, నిర్మాత మారుమాట లేకుండా మరో పాట పారితోషికం కూడా ఇచ్చేశారు. కానీ మర్నాడు కిశోర్‌కుమార్ పాట పాడడానికి రాలేదు. ఆ తర్వాత కూడా పాడలేదు.

ఆ రాత్రే ఆయన మరణించాడు.



## మల్లాది వారి సలహా

ఆచార్య ఆత్రేయ కవితా చిత్రవారి 'వాగ్దానం' (1961) చిత్రానికి దర్శకత్వం వహిస్తూ మల్లాది రామకృష్ణశాస్త్రిగారిని ఓ పాట రాయమని కోరారు. సన్నివేశం, పాత్రల వివరణలు అడిగిన తర్వాత ఓ ట్యూన్ కూడా వినిపించారు.

"పాట రాయడానికి 10, 15 రోజులు పడుతుంది" అన్నారట శాస్త్రిగారు.

"అంత వ్యవధి లేదు. 3, 4 రోజుల్లో రికార్డు చేయాలి. షూటింగు వుంది. సెట్ కూడా సిద్ధమయింది" అన్నారు ఆత్రేయ.

"అయితే, ఓ పని చెయ్యండి" అన్నారు శాస్త్రిగారు.

"అలాగే చెప్పండి" అన్నారు ఆత్రేయ కుతూహలంగా.

"ఆ సెట్ తీసెయ్యండి" అని శాస్త్రిగారు సెలవు తీసుకున్నారు.



## షూటింగులో కొబ్బరికాయ సంప్రదాయం

షూటింగులో మొట్టమొదట షాటు తీసేముందు కొబ్బరికాయ మీద కర్పూరం వెలిగించి, కెమెరాకు, సౌండ్ రికార్డర్‌కు చూపించి, నటీనటులు, టెక్నీషియన్లూ ఆ హారతిని కళ్లకు అద్దుకున్న తర్వాత ఆ కొబ్బరికాయను సెట్ బయట పగలకొట్టి షూటింగ్ మొదలెడతారు. ఈ ఆచారం ఇప్పటికీ వుంది.

ఆ రోజుల్లో వున్న మంచి స్టూడియోల్లో జెమినీ స్టూడియో ఒకటి (వీరు చంద్రలేఖ, అపూర్వ సహోదరులు, మంగమ్మ శపథం, అవ్వయ్యార్, బాలనాగమ్మ, మొ॥ చిత్రాలు నిర్మించారు. అక్కడ బయట నిర్మాతల షూటింగుకు అనుమతి యిచ్చేవారు కాదు. కాని వారి భాగస్తులయిన శ్రీరాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీ (శ్రీమతి కన్నాంబ, కడారు నాగభూషణం గారు భాగస్తులు) షూటింగు మాత్రం జరిగేది!

నాగభూషణం గారు జెమినీ స్టూడియోలో షూటింగు జరిగేముందు ఆ హారతిని చూపించినపుడు "తూర్పు ఎటు?" అని అడిగి తెల్సుకుని తూర్పువైపుకు తిరిగి, చెప్పులు వదిలి, ఆ హారతిని కళ్లకు అద్దుకుని షూటింగు ఆరంభించేవారు.

కాని ఈనాడు ఆ రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీగాని, జెమినీ స్టూడియోగాని అనవాలు లేకుండా పోయాయి. కాని, వారు నిర్మించిన చిత్రాలు వున్నాయి. షూటింగుకు ముందు హారతి యిచ్చే ఆచారం మిగిలివున్నాయి.



## అసలు రంగారావు

యస్.వి.రంగారావుది చాలా అరుదైన మన స్తత్వం. పెద్ద వాళ్ళతో పెద్దవాడుగానూ, చిన్న వాళ్ళలో చిన్నవాడు గానూ ఉండేవారు. షూటింగులో షాట్ పూర్తవగానే, తన నటన ఎలా వుందని ఎప్పుడైనా పక్కనున్న వారిని అడుగుతూ ఉండేవారు.

లక్ష్మీ ఎంటర్‌ప్రైజెస్ వారి 'సంపూర్ణరామాయణం' (1971) షూటింగులో ఒకసారి ఓ సన్నివేశం చిత్రీకరణ జరిగిన తర్వాత, పక్కనున్న లైట్‌బోయ్‌ని అడిగారు.

"ఏనప్పా! ఎప్పిడిల్లె ? రంగారావు పరవా ఇల్లెయా? (ఏమయ్యా! ఎలా వుంది? రంగారావు నటన ఫరవాలేదా?)".

"ఎన్నమో సార్! అంద అస్సల్ రంగారావై కాణం" (ఏవిటో సార్! ఆ అస్సల్ రంగారావే కనబడలేదు) అన్నాడా బాయ్.

వెంటనే రంగారావుగారు "మరో టేకు తీద్దాం సార్!" అని అడిగారు. వెంటనే ఇంకో టేక్ తీశారు. షాట్‌టేక్ అయింది. లైట్‌బోయ్ దగ్గరకు వచ్చి రంగారావుగారు.

"ఏనప్పా! ఇప్పో ఎప్పిడి? (ఏవయ్యా? ఇప్పుడెలా ఉంది?") అని అడిగారు.

"ఇప్పో సరిసార్! అంద అస్సల్ రంగారావు వందాచ్చి (ఇప్పుడు సరిగ్గా ఉంది సార్! ఆ అసలు రంగారావు వచ్చారు!") అన్నాడు.



ప్రముఖ గాయకుడు,
స్వరకర్త,
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు
**శ్రీ ఎం.చిత్తరంజన్**
సమర్పిస్తున్న శీర్షిక ఇది.

# లలిత సంగీతం



## బంగారు పాపాయి

రచన: కీ॥శే॥ మంచాళ జగన్నాథరావు
సంగీతం:యస్. రాజేశ్వరరావు
గానం:శ్రీమతి రావు బాలసరస్వతీ దేవి
రాగం:శుద్ధ ధన్యాసి తాళం : ఖండ చాపు (జంపెతాళం) 22వ మేళకర్త ఖరహరప్రియరాగ జన్యం
ఆరోహణ: స గ మ ప ని స
అవరోహణ: స ని ప మ గ స
ఔడవ-ఔడవ రాగం (ఆరోహణ లోను, అవరోహణ లోను కూడా 5 స్వరాలుంటాయని అర్థం)
ఆరోహణలో: షడ్జము, సాధారణ గాంధారం, శుద్ధ మధ్యమం, పంచమం, కైశికి నిషాదం, తారషడ్జము
అవరోహణలో: తార షడ్జము, కైశికి నిషాదం, పంచమం, శుద్ధ మధ్యమం, సాధారణ గాంధారం, షడ్జము.

పల్లవి: బంగారు పాపాయి బహుమతులు పొందాలి
పాపాయి చదవాలి మా మంచి చదువు ॥బంగారు॥

చరణం: పలుసీమలకు పోయి తెలివిగల పాపాయి
కళలన్ని చూపించి ఘనకీర్తి తేవాలి
ఘన కీర్తి తేవాలి ఘన కీర్తి తేవాలి ॥బంగారు॥

చరణం: మా పాప పలికితే మధువులే కురియాలి
పాపాయి పాడితే పాములే ఆడాలి
ఏదేశ మే జాతి ఎవరింటిదీపాప
ఎవ్వరీ పాపాయి అని ఎల్లరడగాలి
పాపాయి చదవాలి మామంచి చదువు
పాపాయి చదవాలి మామంచి చదువు ॥బంగారు॥

చరణం: తెనుగుదేశమునాది తెనుగపాపను నేను
అని పాప జగమంత చాటివెలయించాలి
మా నోములపుడు మాబాగ ఫలియించాలి ॥బంగారు॥

## శ్రీమతి రావుబాలసరస్వతీదేవి



తెలుగు చలన చిత్ర రంగంలో తొలి నేపథ్యగాయని శ్రీమతి రావు బాలసరస్వతీ దేవిగారు. మృదుమధుర గాత్రం గల ఆమె అనేక తెలుగు చలన చిత్రాలలోనే కాక పలు తమిళ చిత్రాలలో కూడా పాడారు. హిందీ చిత్ర సీమలోని సుప్రసిద్ధ సంగీత దర్శకుడు శ్రీ నౌషాద్ అలీ స్వర పరచిన హిందీ పాటలను కూడా గానం చేశారామె. 1940లో ఆకాశవాణి మద్రాసు కేంద్రం వారు లలిత సంగీత కార్యక్రమాల ప్రసారం ప్రారంభించాలని నిర్ణయించగా, అప్పటి ప్రోగ్రాం అసిస్టెంట్ శ్రీ ఎస్.యన్. మూర్తి గారు రేడియో తరఫున వెళ్ళి ఫిలిం స్టూడియోలో రికార్డింగులో వున్న శ్రీ సాలూరు రాజేశ్వరరావు, బాల సరస్వతి గార్లను ఆహ్వానించి వాళ్ళిద్దరి చేత కొన్ని లలిత గీతాలను పాడించి రేడియోలో ప్రసారం చేశారు. అప్పటి నుంచి బాలసరస్వతిగారు చలన చిత్రాలలోనే కాక ఆకాశవాణిలో కొన్ని వందల పాటలను ఎంతో హృద్యంగా గానం చేయగా అవి ఎంతో ప్రాచుర్యాన్ని పొందాయి. 1945లో బాలసరస్వతి గారి అబ్బాయి పుట్టిన రోజు సందర్భంగా శ్రీమంచాళ జగన్నాథరావు గారు 'బంగారు పాపాయి బహుమతులు పొందాలి' అనే గేయాన్ని వ్రాసి ఆమెకు ఇచ్చారు. తరువాత కొన్నాళ్ళకు ఆ పాటను యస్.రాజేశ్వరరావు స్వరపరిచి గ్రామఫోను రికార్డుగా (బేసిక్ రికార్డు) ఆమె ఆ పాటను పాడారు. ఆ తరం వాళ్ళని ఆ పాట అమితంగా ఆకట్టుకుంది. 1961లో రేడియో వారోత్సవాల సందర్భంగా ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో ఆహూతుల సమక్షంలో ప్రత్యేక లలిత సంగీత కార్యక్రమం ఏర్పాటైంది. ఆ కాన్సెర్ట్‌లో నేను, వక్కలంక సరళ ('కీలు గుర్రం' సినిమాలో ఘంటసాల గారితో 'కాదు సుమా కల కాదు సుమా' పాటను పాడిన గాయని), బాలసరస్వతి గారు పాల్గొన్నాం. ఆవిడ పాటలకు శ్రీ సాలూరు హనుమంతరావు స్వర రచన చేశారు. వింజమూరి శివరామారావు రచించిన 'నల్లని వాడా! నే గొల్ల కన్నెనోయ్ పిల్లనగ్రోవూదుమా' పాటను ఆ కార్యక్రమంలో ఆవిడ అద్భుతంగా పాడారు. ఆపాట ఆ కార్యక్రమానికి ముందుగానే స్టూడియోలో రికార్డు చేయబడింది. ఆ తరువాత తరచూ అది ప్రసారమయి చాలా పాప్యులర్ అయింది. 5, 6 దశాబ్దాలకు పైగా ఆమె లలిత సంగీతానికి చేసిన అపారమైన సేవను గుర్తించి 1999లో అప్పా జోస్యుల విష్ణుభొట్ల ఫౌండేషన్ వారు (అమెరికా) ఆమెకు లైఫ్ టైం ఎచీవ్‌మెంట్ అవార్డు ను బహూకరించి ఎంతో ఘనంగా సత్కరించారు.

పల్లవి: ని̣ససపప | పనిపామ | మమపమగ | గమమపప |
బం. గా. రు | పా. పాయి | బహుమతులు | పొం. దా. లి |

సమమాగ | మపపామ | గమమాగ | సగగసా ||
పా. పాయి | చదవాలి | మా. మంచి | చదువు. ||బంగారు||

1వ చరణం: పపపనిని | నిసేసాని | పపనిపమ | గమమపప |
పలుసే. మా | లకుపోయి | తెలివిగల | పా. పా. యి |
పపపనిని | నిసేసాని | పనిపామ | గామపప |
తళల. న్ని | చూ. పించి | ఘనకీర్తి | తే వా. లి |

సేనిసాని | పమపామ | గగమాగ | సగగసస ||
ఘనకీర్తి | తే. వాలి | ఘనకీర్తి | తే. వా. లి ||బంగారు||

2వ చరణం: ని̣ససపప | పపనిపమ | మమపమగ | గమమపప |
మా. పా. ప | పలికితే. | మనువుతే. | కురియా. లి |
సమమాగ | మపపపమ | గమమమగ | సగగసస |
పా. పాయి | పా. డితే. | పా. ములే. | ఆ. డా. లి |
పాపనిని | నిసేసాని | పనిపామ | గామపప |
ఏదే. శ | మే. జాతి | ఎవరింటి | దీ పా. ప |

పాపపని | నిసేసాని | పనిపామ | గగమపప |
ఎవ్వరో. | పా. పాయి | అనివల్ల | రడగా. లి |

సమమాగ | మపపామ | గమమాగ | సగగసా |
పా. పాయి | చదవాలి | మా. మంచి | చదువు. |

సేనిసాని | పమపామ | గామాగ | సగగసా ||
పా. పాయి | చదవాలి | మామంచి | చదువు. ||బంగారు||

3వ చరణం: పపపపని | నిసేనిసేని | సేగగ గామగ | సేనిసాసే |
తెనుగుదే. | శము నా. ది | తెనుగపా. . | పను నేను |
పపపనిని | నిసేసాని | సేగగ గామగ | సేని సేనిసా సే |
అనిపా. ప | జగమంత | బా. టవెల. | యిం. చా. . లి |
సేనిసాని | పమప పానిప | మగగపమ | సగగసస ||
మా. నోము | లవుడుమా. . | బా. గఫలి | యిం. చా. లి ||బంగారు||

# కీ॥శే॥ మంచాళ జగన్నాథరావు



ప్రముఖ వైణిక విద్వాంసులైన శ్రీ మంచాళ జగన్నాథరావు గారు కర్ణాటక సంగీతమే కాక, హిందుస్తానీ సంగీతాన్ని కూడా వీణపై వాయించేవారు. ఆకాశవాణి, పాట్నాలో కొంత కాలం పనిచేసి, 1954, 55 ప్రాంతంలో హైదరాబాదుకు బదిలీ అయి అప్పటినుండి 1981లో ఆయన పదవీ విరమణ గావించేవరకూ సంగీత రంగానికి ఎనలేని సేవలందించారు. అవిశ్రాంతంగా అఖిల భారతస్థాయిలో 'గీత శంకరం' (సంస్కృతం), 'రాధా వంశీధర్ విలాస్' (హిందీ) మొదలగు సంగీత రూపకాలకు ఆయన స్వరకల్పన చేశారు. వాటన్నిటిలోను శ్రీ బాలమురళి, శ్రీ ఓలేటి వెంకటేశ్వర్లు, శ్రీ నూకల చిన సత్యనారాయణ, నేను, శ్రీ రంగం గోపాల రత్నం మున్నగు వారమంతా పాడాము. ఆయన సంగీతం కూర్చిన అసంఖ్యాకమైన గీతాలను నేను పాడడం జరిగింది. అవే కాక ఆయన శాస్త్రీయ సంగీత సేవ అపారమైనది. కొన్ని వందల అన్నమయ్య కీర్తనలను స్వరపరచి నొటేషన్‌తో గ్రంథంగా ఆయన ప్రచురించారు. అలాగే వందలాది రామదాసు, త్యాగయ్య కీర్తనలను, క్షేత్రయ్య పదాలను కూడా నొటేషన్‌తో గ్రంథాలుగా తిరుపతి దేవస్థానంవారి ఆర్థిక సహాయం, ప్రోత్సాహంతో ప్రచురించారు. నండూరి సుబ్బారావు గారి 'ఎంకి పాటల'ను రచయితతో కలిసి వాటి బాణీలను నిర్ధారణ చేసి రేడియోలో పాడించారు. మంచాళ వారి స్వీయ రచనలైన లలిత గీతాలతో బాటు, పలు భావకవుల గీతాలకు స్వరరచన గావించి 'ఆధునిక సంగీతం' పేరిట రెండు సంపుటాలుగా నొటేషన్‌తో ప్రచురించి ఎంతోమంది గాయనీ గాయకుల చేత పాడించారు. ఆకాశవాణి ద్వారా సంగీత లోకానికి ఆయన చేసిన సేవ చిరస్మరణీయం.










సెప్టెంబరు 11న వరల్డ్ ట్రేడ్ సెంటర్‌పై జరిగిన దాడి అమెరికాను కుదిపివేసింది. ఏ క్షణంలో ఏం జరుగుతుందో తెలియక ప్రజలు తల్లడిల్లిపోయి, బయటకు రాలేదు కొంతకాలం పాటు. ముఖ్యంగా సినిమాహాల్స్ వంటి వాటి జోలికి పోలేదు. టెర్రరిస్టులు ఏ బాంబైనా పెట్టి సామూహిక హత్య చేసేస్తారేమోనని భయం పాపం. అటువంటి జనాల్ని సినిమా హాల్స్ వైపు నడిపించినది ఇటీవలే రిలీజయిన రెండు సినిమాలు - 'డోంట్ సే ఎ వర్డ్', 'జూలాండర్'!

**నవంబరు 30 బెన్ స్టిల్లర్ జన్మదిన సందర్భంగా**

# వారసత్వంతోకాక స్వయం కృషితో పైకివచ్చిన

# బెన్ స్టిల్లర్

'డోంట్ సే ఎ వర్డ్' సుప్రసిద్ధ నటుడు మైకేల్ డగ్లస్ నటించినది కాగా, 'జూలాండర్' బెన్ స్టిల్లర్ నటించిన కామెడీ సినిమా. బాంబు దాడుల చేత విచలితులైన ప్రేక్షకులను కాస్సేపు నవ్వించి, భయాన్ని పారదోలి, మామూలు జీవితంలో పడేట్లా చేయగలిగిన బెన్‌స్టిల్లర్ ఒక విధంగా అభినందనీయుడే. ఇతడు హాస్యకథానాయకుడు మాత్రమే కాదు రచయిత, దర్శకుడు, నిర్మాత కూడా.



'మీట్ ది పేరెంట్స్'లో రాబర్ట్ డీ నీరోతో

ఈ నవంబరు 30కు 36 సంవత్సరాలు పూర్తి చేసుకుంటున్న స్టిల్లర్‌కు హాస్యనటన వంశపారంపర్యంగా వచ్చింది. అతని తండ్రి జెర్రీ స్టిల్లర్ హాస్య నటుడు. తల్లి ఏనీ మియారా హాస్యనటీమణి. అతని అక్క యామీ కూడా సినిమాల్లో నటిస్తుంది. ఇదంతా వినగానే

'మరింకేం సినిమాల్లోకి అతి ఈజీగా వచ్చి ఉంటాడు' అనుకోవడం సహజం. కానీ వారసత్వం అన్ని వేళలా అనువుకాదు. ఒక్కోప్పుడు ప్రజలు ఈసడించడానికి అది అంది వస్తుంది.

స్టిల్లర్ విషయంలో అదే జరిగింది. 1992లో ఫాక్స్ టీవికై 'ది బెన్ స్టిల్లర్ షో' తయారు చేసినప్పుడు వాషింగ్టన్ పోస్టు విమర్శకుడు అతి ఘాటుగా, "ఈ బెన్ స్టిల్లర్ ఎవడు? వీడికో షో ఏమిటి? అమ్మ, నాన్నా యాక్టర్స్ కదాని వాళ్ల పేరు చెప్పుకుని కుర్రకుంక ఒకడు ఓ టీవి సీరిస్ తీయడమేమిటి? అది మనం చూడడమేమిటి?" అని విమర్శించి పారేశాడు. అంతేకాక ఓ ఉచిత సలహా కూడా పారేశాడు. "తెల్లవారుఝామున 3 గంటల స్లాట్ ఒకటి ఉంది కదా, ఈ షోని ఇప్పుడున్న స్లాట్ నుండి ఆ స్లాట్‌కి బదిలీ చేయండి." అని, ఫాక్స్ టీవి వాళ్లు ఆ సలహాను సగమే విన్నారు. సీరిస్ సగంలో ఉండగా అప్పుడున్న స్లాట్ నుండి తీసేశారు. మూడు గంటల స్లాట్ కాదు కదా, ఏ స్లాట్‌కి అక్కర్లేదు పొమ్మన్నారు. అది జరిగింది 1992లో.

1997 నాటికి కథ పూర్తిగా మారిపోయింది. ఫాక్స్ వాళ్లు తమకు రెండు సినిమాలు తీసిపెట్టమని బెన్‌ను కోరారు. జరిగిన అవమానాన్ని మరచి, బెన్ సరేనన్నాడు కూడా. ఈ మధ్య చాలా కథే జరిగింది. మరి.... ఆ మాటకొస్తే టివీ సీరీస్ చేసే ఛాన్సు కూడా బెన్ అంత సులభంగా రాలేదు. ఎంతో నేర్చుకుని, ఎన్నో మెట్లెక్కితేనే కానీ ఆ మాత్రం గుర్తింపు కూడా రాలేదు.

బెన్, అక్క యామీ చిన్నప్పటీనుండి నటనపై ఆసక్తి కనబరిచారు. కాపీ చేయడానికి తల్లిదండ్రుల సినిమాలు ఎదురుగా ఉన్నాయి. బెన్‌కి 10 సంవత్సరాల వయస్సులో ఓ టీవీ ఛాన్సు వచ్చింది. వాళ్ల అమ్మ లాయర్‌గా నటించిన సీరిస్, "కేట్ మెక్ షేన్"లో ఓ చిన్న గెస్టు పాత్ర నటించాడు. ఆ ఏడాదే వాళ్ల నాన్న సూపర్ 8 కెమెరా ఒకటి కొని పెట్టాడు. దాంతో హోం వీడియో సినిమాలు బోల్డు తీసి పారేసేవాడు.

సినిమాల మీద ఇంట్రస్టు చూపుతున్నాడు కదాని సినిమా ఇన్‌స్టిట్యూట్‌లో చేర్పిస్తే అక్కడ తొమ్మిది నెలలకు మించి చదువు సాగలేదు. ఇంటికి తిరిగి వచ్చేసాడు కానీ ఏం చేయాలో తోచలేదు. ఓ ఏడాది అలాగే ఉన్నాక ఏక్టింగ్ క్లాసుల్లో చేరాడు. వేషాలు చూసి పెట్టడానికి ఓ ఏజెంటును పెట్టుకున్నాడు. 1985లో బ్రాడ్వే రంగస్థలంపై "ది హౌస్ ఆఫ్ బ్లూ లీవ్స్"లో ఓ పాత్ర గడించాడు. అది విజయవంతంగా నడుస్తుండగానే ఏం బుద్ధిపుట్టిందో ఏమో తన సహజనటుడు జాన్ మెహోనీపై ఒక సెటైరికల్ డాక్యుమెంటరీ తయారుచేసాడు. బెన్‌తో బాటు నటిస్తున్న నటులందరూ దాన్ని మెచ్చుకున్నారు. దాంతో "కలర్ ఆఫ్ మనీ" అనే ఓ పాతసినిమాకు పది నిమిషాల పారడీ "హజ్లర్ ఆఫ్ మనీ" అనే పేర తయారుచేసాడు. అదీ అందరి మెప్పు పొందింది. ఈ డాక్యుమెంటరీలు ఎలా చేరాయో ఏమో, ఓ


'కీపింగ్ ఫెయిత్'లో బెన్, జెన్నా, ఎడ్వర్డ్ నార్టన్




ప్రఖ్యాత టీవీ ప్రొడ్యూసర్ల వద్దకు చేరాయి. వాళ్లు అప్పుడు "సాటర్ డే నైట్ లవ్"అనే సీరిస్ నిర్మిస్తున్నారు. వాళ్లు వెంటనే హక్కులు బెన్ వద్ద కొనేసి 1987లో ప్రసారం చేసేశారు. దానికి వచ్చిన రెస్పాన్సు చూసి ముచ్చటపడి, రచయితగా, నటుడిగా తమ షోను నిర్వహించమన్నారు. అది 1989లో.

టీవి రంగంలో ఇలా ఉండగానే 1987లో బెన్ చిత్రరంగ ప్రవేశం జరిగింది. స్టీవెన్ స్పీల్ బెర్గ్ - "ఎంపైర్ ఆఫ్ ది సన్" చిత్రంతో! తర్వాత ఇంకా కాస్త పెద్దపాత్ర దొరికింది - "ఫ్రెష్ హార్సెస్" (1988) చిత్రంలో. దర్శకుడిగా తన ప్రతిభ చూపిద్దామనే ఆశతో బెన్ టీవిపై దృష్టి మళ్లించి 'శాటర్‌డే నైట్ లైవ్' నడుస్తుండగానే ఎంటీవి వారికై 'బ్యాక్ టు బ్రూక్లిన్' తీసి పెట్టాడు. అది బాగా నచ్చడంతో "మాకు ప్రత్యేకంగా 'బెన్ స్టిల్లర్ షో' ఒకటి నిర్వహించు" అన్నారు 1990లో కానీ త్వరలోనే ఎంటీవి వారికి ఆ షో పై మోజు పోయింది. అప్పుడు ఫాక్స్ వాళ్లు తీసుకోవడం, వాళ్లూ తీసిపారేయడం జరిగింది. టీవి కంపెనీ వాళ్ళు ఇలా అవమానపరిచినా, బెన్‌కి రావలసిన గుర్తింపు ఎలాగూ వచ్చింది. అతనికీ, అతనితోబాటు షోకు సహరచయితగా పనిచేసిన జూడ్‌కి 1993 ఎమ్మీ ఎవార్డు దక్కింది.

టీవిలో జరిగిన పరాభవంతో బెన్ కృంగి పోలేదు. మళ్లీ సినిమారంగానికి చేరుకున్నాడు. ఈసారి ధైర్యంగా తన దర్శకత్వంలోనే తనే ముఖ్యపాత్ర ధరిస్తూ "రియాలిటీ బైట్స్" అనే సినిమా తీసేడు. దాన్ని విమర్శకులు, ప్రేక్షకులు ఇద్దరూ సమానంగానే ఆదరించారు. అతని తదుపరి సినిమా "ది కేబుల్‌గై" (1966). జిమ్ క్యారీని హీరోగా పెట్టి తీసాడు. దానిలో క్యారీ వేసిన నెగిటివ్ క్యారక్టర్ అతని అభిమానులను నిరాశపరిచింది. అందుకే అది ఘోర పరాజయం పాలయింది. అదృష్టవశాత్తూ ఆ సంవత్సరంలో నటుడిగా అతను నిలదొక్కుకున్నాడు. 'హేపీ గిల్‌మోర్', 'ఫ్లటింగ్ విత్ డిసాస్టర్' రెండూ హిట్టే. కానీ వెంటనే వచ్చిన 'ఇఫ్ లూసీ ఫెల్' ఫెయిలయింది. బెన్ స్టిల్లర్ హిట్స్‌లో చెప్పుకోదగ్గది - "దేరీజ్ సంథింగ్ ఎబౌట్ మేరీ". అక్కడ నుండి బెన్‌కి ఆఫర్లు కుప్పలుగా వచ్చిపడ్డాయి. "యువర్ ఫ్రెండ్స్ అండ్ నైబర్స్", "పెర్మనెంట్ మిడ్‌నైట్" "మిస్టరీ మెన్", "ది సబర్బన్స్" ఇలా ఎన్నో.

కొత్త శతాబ్దంలో బెన్ తన సినిమాలలో మరింత వైవిధ్యం చూపిస్తున్నాడు. "బ్లాక్ అండ్ వైట్"లో అవినీతిపరుడైన పోలీసు ఆఫీసరుగా నటించాడు. "కీపింగ్ ది ఫెయిత్"లో యూదుపురోహితుడు రబ్బీగా. ఈ రబ్బీ, మరొక క్రైస్తవ పూజారీ ఇద్దరూ ఒక బిజినెస్ వుమన్‌ను ప్రేమించడానికి పోటీపడతారు. తమాషా ఏమిటంటే ముగ్గురూ బాల్య స్నేహితులే! ఈ కామెడీ అందరి ప్రశంసలు పొందింది. రాబర్ట్ డీ నీరోతో కలిసి నటించిన "మీట్ ది పేరెంట్స్" సంగతి చెప్పనే అక్కర్లేదు. బ్రహ్మాండంగా ఆడింది. దానిలో బెన్ స్టిల్లర్ పాత్రపేరు గ్రెగ్ ఫాకర్. (చాలా వింతపేరు) తన గళ్ ఫ్రెండుని పెళ్లాడదామనుకుంటాడు. ఆమె అక్క పెళ్లి నెపం మీద వాళ్లింటికి వెళ్లి ఆమె తల్లిదండ్రుల అనుమతి తీసుకోవాలనుకుంటాడు. ముఖ్యంగా సిఐఏ ఏజెంటుగా పని చేసి రిటైరయిన వాళ్ల నాన్నను (ఆ పాత్ర రాబర్ట్ డీ నీరో వేసాడు) మెప్పించాలనుకుంటాడు. ఆయనకు బెన్‌ను చూస్తే అనుమానం. ఇద్దరి మధ్యా అనేక హాస్యభరితమైన దృశ్యాలు పెట్టాడు డైరక్టర్ జో రోచ్. ఇంటిలిజెంట్ కామెడీగా వుంటూనే స్లాప్‌స్టిక్ చూపించిన గొప్ప కామెడీ సినిమాగా మెచ్చుకున్నారు విమర్శకులు. ఈ సినిమా ఎంత హిట్ అయిందంటె "మీట్ ది ఫాకర్స్" అనే సినిమా తయారవుతోంది.

ఇంతలోనే "జూలాండర్" వచ్చింది. బెన్ స్టిల్లర్ కామెడీ సినిమాలకు ఎదురులేదని మరొక్కసారి నిరూపించింది.

-కమ్యూనికేటర్ ఫీచర్స్




# బాపుతో ఇంటర్వ్యూ

★ **మీ జన్మస్థలం కంతేరు మాతామహుల ఇల్లా?**

✎ జన్మస్థలం అమ్మగారి వూరు - నరసాపురం. తండ్రి గారి ఊరు కంతేరు - స్వస్థలం.

★ **మీ కుటుంబంలో ముందునుండీ చిత్రకళపై అభిరుచి గల వారున్నారా? మీ అంతట మీరే ఈ రంగాన్ని ఎన్నుకున్నారా? మీ కంటే చిన్నవాళ్ళకు దీనిపై అభినివేశం ఉందా?**

✎ మా నాన్నగారు శ్రీ వేణుగోపాలరావు గారు హాబీగా బొమ్మలేసేవారు. మా పినతండ్రి బుచ్చిబాబు గారూ, పిన్నిగారు శ్రీమతి శివరాజు సుబ్బలక్ష్మిగారు బొమ్మలేసేవారు. తమ్ముడు శంకరూ బొమ్మలేస్తాడు. మా అమ్మాయీ బొమ్మలేస్తుంది.

★ **శంకర్ గారికీ, మీ అమ్మాయికి మీరు నేర్పారా?**

✎ నేనెవరికీ నేర్పలేదు. ఒకరికి నేర్పగల సామర్థ్యం, విద్యా నాకు లేవని నాకు తెలుసు.

★ **మీరు గోపులు గారి వద్ద ఎన్నాళ్లు నేర్చుకున్నారు? ఇంకా తక్కిన గురువులెవరు?**

✎ శ్రీ గోపులు నాకు గురుతుల్యులు. కాలేజీ రోజుల్లో ఆదివారాలు వారి ఇంటికి వెళ్లి వారు బొమ్మలేస్తుంటే చూసేవాడిని. ఆయన బొమ్మలు చూసి చాలా నేర్చుకున్నాను. అలాగే శ్రీ చామకూర్ గారి వద్దకు కూడా వెళ్లేవాడిని.

★ **వీరేకాక వివిధ దేశాల పత్రికలలో బొమ్మలు చూసి నిరంతరం నేర్చుకుంటూంటారని అంటారు. అలా నేర్చుకుని వేసిన బొమ్మలను ఏ విధంగా ఇవాల్యేట్ చేసుకుంటారు? మిత్రులకెవరికైనా చూపించి అభిప్రాయాలు సేకరిస్తారా?**

✎ అనేకమంది స్వదేశీ చిత్రకారుల బొమ్మలు చూడడమే నా విద్య. ఇవాల్యుయేషన్ అన్నది నా వరకే చేసుకుంటాను. ప్రతి బొమ్మ రమణ గారికి చూపిస్తాను.

★ **రమణగారు మీ స్కూలుమేటా?**

✎ రమణగారు కేసరీ స్కూలులోనూ, నేను పి.ఎస్.హైస్కూలు (రెండూ మద్రాసులోనే) లోనూ చదువుకున్నాం. ఉదయభాను - బాల సంఘాల్లోనూ కలిసి వుండే వాళ్లం. అప్పటినుంచీ కలిసేవున్నాం.

★ **లండన్ వెళ్లబోయే ముందు మీరు రమణగారి కాళ్లకు మొక్కి అందర్నీ ఆశ్చర్యపరిచారని నవోదయా రామమోహనరావుగారు రాశారు. రమణ గారిపై మిత్రభావంతో బాటు గురుభావం కూడా ఉందా?**

✎ గౌరవం చూపడంలో ఆశ్చర్యం ఏవుంది? కాళ్లు పట్టుకుని లాగెయ్యలేదు కదా! మా అబ్బాయి పేరు రమణగారి పేరే పెట్టుకున్నాము.

★ **ఇంగ్లీషులో మీ అభిమాన రచయితలు ఎవరు?**

✎ పి.జి.ఉడ్‌హౌస్, రాబర్ట్ బెంచ్లీ

★ **అభిమాన సినీ దర్శకుడు...?**

✎ వందలాది వున్నారు. రెండు పేర్లు చెప్పాలంటే మణిరత్నం, స్పీల్‌బర్గ్.

★ **లా చదివినా చిత్రకళ వృత్తిగా చేపట్టే సాహసం ఎలా చేసారు? ఈ రంగంలో డబ్బు వస్తుందో రాదోనన్న భయం వేయలేదా?**

✎ ఫ్రీలాన్స్ ఆర్టిస్టుగా పనిచేసినా జీవనోపాధికి ఇబ్బంది రాలేదు.

★ **మీరు ఒక్కరూ ఎడ్వర్టయిజ్‌మెంట్స్ అన్నీ వేసేబదులు ఒక అడ్వర్టయిజింగ్ కంపెనీ పెట్టి శిష్యుల్ని ట్రెయిన్ చేసి ఒక సంస్థలా నడిపి వుంటే బాగుండేది కదా!**

✎ బావుండదు.

★ **మిమ్మల్ని కమర్షియల్ ఆర్టిస్టుగానే పేర్కొంటారా? ఆంధ్ర చిత్రకారులు అన్నప్పుడు అడవి బాపిరాజు, దామెర్ల రామారావు, మొక్కపాటి కృష్ణమూర్తి వంటి పేర్లు చెబుతారు కానీ బాపు అని ఎందుకనరు? ఈ రెండు స్కూల్స్ మధ్య ఏదైనా అగాధం ఉందా?**

✎ నా బొమ్మల గురించి నాకు బాగా తెలుసు కనక ఎవరెలా పేర్కొన్నా అంత పట్టింపు లేదు.

★ **మీరు ల్యాండ్ స్కేప్స్, పోర్ట్రయిట్స్ వేశారా?**

✎ లాండ్‌స్కేప్స్ నాకు చాలా ఇష్టం. కానీ వెయ్యలేదు. పోర్ట్రయిట్స్ చాలానే వేశాను.

★ **ఆబ్‌స్ట్రాక్ట్ చిత్రకళపై మీ అభిప్రాయం ఏమిటి? పికాసో గురించి మీరేమంటారు?**

✎ ఆబ్‌స్ట్రాక్ట్ అవనివ్వండి, మరోటి కానివ్వండి - ఏదయినా బొమ్మ చూడగానే మనసుకు హత్తుకోవాలి. 'ఆహా ఎంత బావుంది' అనిపించాలి. 'ఎందుకు' అని కాదు, పికాసో చిత్రాలు అనుపమానం. అద్భుతం.

★ **మీ కార్టూన్స్‌లో ఈ మధ్య లైన్స్ చాలా మార్చేశారు కదా, అది ఆధునిక చిత్రకళా రీతియా?**

✎ మారుతూ వుండడం ప్రకృతి సహజం. అలాగే ఒకో మహానుభావుడి రేఖలు



తనకు ప్రేరణనిచ్చిన తల్లిదండ్రులిద్దరినీ ఒకే బొమ్మలో ఇమిడ్చి బాపు గీసిన బొమ్మ

నచ్చినప్పుడు లైన్లు మారుతూ వుంటాయి. అది ఒక విధమైన పూజ లాంటిది.

★ **మీ శైలికి ఏదైనా ప్రత్యేకమైన పేరుందా? స్వంత శైలి ఇవాల్ళ్ కావడానికి ఏవైనా ప్రయోగాలు చేశారా? ఆ ప్రయోగాలన్నీ ప్రజామోదం పొందాయా?**

✎ ఇది బాపు బొమ్మే అయుంటుందని చెప్పవలసింది నేను కాదు. చూసేవాళ్లు. అలాగే 'ప్రత్యేక' శైలీనూ.

★ **మీ చిత్రాలపై ఎప్పుడైనా విమర్శలు వచ్చాయా?**

✎ వచ్చింది. నచ్చిన సూచనలు తీసుకున్నాను.

★ **చిత్రకళ నేర్చుకోవడం ఫ్రేమింగ్, కలర్ కంపోజిషన్ ఇత్యాదులలో సినిమాలు తీయడానికి మీకు ఉపకరించిందా?**

✎ చిత్రకళ నేర్వడం చలనచిత్ర కళకు చాలా ఉపకరిస్తుంది.

★ **మిమ్మల్ని అనుకరించే వారికి స్వంత గొంతుక సంపాదించుకోమని ఎప్పుడైనా సలహాలిచ్చారా? మీ ప్రభావం పడని తెలుగు చిత్రకారులెవరైనా వుంటే వారిలో మీరు మెచ్చేవారెవరు?**

✎ ఇంతకుముందే మనవి చేసినట్టు 'సలహా' లిచ్చే స్తోమత నాకు లేదు. 'మోహన్' చాలా మంచి ఆర్టిస్టు.

★ **కొన్ని బొమ్మలు చూసేవారిని కాసేపు ఆలోచింపజేస్తాయి. ఎంత ఆలోచించినా చిత్రకారుడి భావాన్ని అందుకోలేని సందర్భాలు వస్తుంటాయి కదా. వాటి గురించి మీరేమంటారు?**

✎ చూసేవారిని బొమ్మ ఆలోచింపజేసింది అంటే ఆ బొమ్మ చాలా గొప్పదన్నమాట. చిత్రకారుడి భావం ప్రేక్షకులకు అర్థం కాకపోతే అదిగొప్పది కాదన్న మాట. ఏ పని చేసినా నలుగురూ మెచ్చుకొనేలా వుంటే అది సార్థకమవుతుంది.



గురువుగోపులు గారి బొమ్మలను అనుకరిస్తూ బాపు వేసిన బొమ్మలు

# కార్టూనిస్టులలో భీష్ముడు



SHANKAR



రాజకీయ కార్టూనిస్టులలో భీష్మాచార్యుని వంటి వాడు 'శంకర్'. కేరళకు చెందిన శంకరన్ పిళ్ళై 'శంకర్' పేరుతో కొన్ని దశాబ్దాలపాటు కార్టూన్లు గీసారు. ప్రజలతోపాటు ప్రముఖుల మెప్పుకూడా పొందారు. ఆయన అభిమానుల్లో జవహర్లాల్ నెహ్రూ ఒకరు. 1937లో నెహ్రూ రాసిన వ్యాఖ్య చూడండి.

" ఎ ట్రూ కార్టూనిస్ట్ ఈజ్ నాట్ జస్ట్ ఎ మేకర్ ఆఫ్ ఫన్, బట్ ఒన్ హూ సీస్ ది ఇన్నర్ సిగ్నిఫికెన్స్ ఆఫ్ యాన్ ఈవెంట్ అండ్ బై ఎ ఫ్యూ మాస్టర్ స్ట్రోక్స్ ఇంప్రసెస్ ఇట్ ఆన్ అదర్స్. శంకర్ హేస్ దట్ రేర్ గిఫ్ట్ రేరర్ ఇన్ ఇండియా దేన్ ఎల్సెవేర్"

1947లో శంకర్ 'శంకర్స్ వీక్లీ' అనే ఆంగ్ల కార్టూన్ వారపత్రిక మొదలు పెట్టినప్పుడు తనను కూడా 'స్పేర్' చేయవద్దని కోరారు, అప్పుడే ప్రధాని అయిన నెహ్రూ. ఆయన కుమార్తె ఇందిరాగాంధీ తన హయాంలో ఎమర్జన్సీ విధించగా అటువంటి వాతావరణంలో పత్రిక నడపడం కష్టమని గ్రహించిన శంకర్ 1975లో పత్రిక మూసేశారు. 28 ఏళ్ళపాటు దిగ్విజయంగా నడిచిన 'శంకర్స్ వీక్లీ' ఎందరో కార్టూనిస్టులకు ఓనమాలు నేర్పించింది.

శంకర్‌కు పిల్లలంటే ఇష్టం. వారిలో చిత్రకళను ప్రోత్సహించడానికి ఏటేటా బొమ్మల పోటీ నిర్వహించారు. చిల్డ్రన్ బుక్ ట్రస్టు ఏర్పాటు చేసారు. దేశవిదేశాల నుండి ఆయన సేకరించిన ఆటబొమ్మలతో ఢిల్లీలో 'డాల్స్ మ్యూజియం' ఏర్పాటు చేశారు. ఆర్.కె. లక్ష్మణ్ 'కామన్ మాన్' మీకు పరిచితుడే. శంకర్ తనకుతాను వేసుకున్న కారికేచర్ ఇది. ఆయన వివిధ సందర్భాలలో వేసిన రాజకీయ కార్టూన్లు చూడండి. దశాబ్దాల క్రితం వేసిన కార్టూన్లలో కొన్ని ఈ నాటికీ 'రిలవెంట్'గా ఉండడం చూసి తెల్లబోకండి. మనం సాధించిన ప్రగతి అది!.

**"ఏదైనా పత్రిక తెరవగానే అందరి చూపూ పడేది కార్టూన్ల మీదనే. దినపత్రిక విషయంలో అయితే మరీను. చుట్టూ జరిగే రాజకీయాలపై ఈ కార్టూనిస్టు ఏం వ్యాఖ్యానించాడా అన్న కుతూహలంతో పేపరు తీయగానే మొదట దానినే చూస్తాం. ఆర్.కె.లక్ష్మణ్ (టైమ్స్ ఆఫ్ ఇండియా), శ్రీధర్ (ఈనాడు)కున్న 'ఫాన్ ఫాలోయింగ్' ఈ సత్యాన్ని చాటి చెబుతుంది."**




ఎన్నిప్లానులు వేసినా నిరంతరం పుట్టుకొచ్చే జనాభా వాటిని ధ్వంసం చేసివేస్తుందని చెప్పడానికి ఇంతకంటే మంచి కార్టూన్ దొరుకుతుందా? 1965 నాటి ఈ కార్టూన్‌లో కనబడుతున్నది ప్లానింగ్ కమిషన్ సభ్యుడు డా॥అశోక మెహతా.



భాషా ప్రయుక్త రాష్ట్రం ఏర్పాటుకు సమ్మతిస్తే వచ్చే ప్రమాదం గురించి హెచ్చరించిన కార్టూన్ ఇది. 1953లో ఆంధ్రరాష్ట్ర అవతరణకు ముందు జరిగిన ఉద్యమానికి లొంగి 'భాష ప్రాతిపదికగా రాష్ట్రం ఏర్పాటుకు నేను వ్యతిరేకిని కానని' ప్రకటించిన నెహ్రూను హెచ్చరించిన తీరిది.

1975లో జయప్రకాశ్ నారాయణ్ నేతృత్వంలో ఇందిరాగాంధీకి వ్యతిరేకంగా పోరాడిన ప్రతిపక్షం 1977లో అధికారంలోకి వచ్చి ఆయనను విస్మరించింది. 'ప్రతిపక్షం తమ స్వార్థానికి జయప్రకాశ్‌ను వాడుకుంటోంది' అని ఇందిరాగాంధీ 1975 ఫిబ్రవరిలో చేసిన వ్యాఖ్యపై కార్టూన్ ఇది. కాంగ్రెస్ కంచుకోటను జయప్రకాశ్ అనే దుంగతో బద్దలు కొట్టిన ప్రతిపక్షం (మొరార్జీ, చరణ్ సింగ్, పీలూ మోడీ) ఆ తర్వాత ఆ దుంగను బయట పారేశారు.






1950లలో పంచవర్ష ప్రణాళికలు ఆరంభించిన రోజుల్లో 'Plan or Perish' అన్న వ్యాఖ్యతో వేసిన కార్టూన్. ప్లానులు వేయడమే అన్నిటికీ తారకమంత్రం అనుకునే రోజుల్లో ఎక్కడ చూసినా ప్లానులే, భవిష్యత్తు ఎలావుంధో చూడడానికే కాదు, పౌరయానశాఖకు, ఆర్థికశాఖకు, రక్షణశాఖకు, ప్రణాళికా శాఖకు, రవాణా శాఖకు, గృహనిర్మాణ శాఖకు, ఆహార శాఖకు అందరికీ ప్లాన్లు ఎలా ఉపయోగపడుతున్నాయో చూడండి. ఏ ఇంట చూసినా ప్లానులే!



ఉమ్మడి మద్రాసు రాష్ట్రం నుండి 1953లో ఆంధ్రరాష్ట్రం విడిపోయింది. మద్రాసు మాకు రావాలంటే మాకని మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రి రాజాజీ, ఆంధ్ర ముఖ్యమంత్రి ప్రకాశం తగవులాడుకున్నారు. అఖిల భారత కాంగ్రెసు వర్కింగ్ కమిటీ కూడా తగవు తీర్చలేక పోయింది. ఇద్దరు స్త్రీలు ఒకబిడ్డ గురించి తగవులాడి తీర్పుకి వస్తే సోలమన్ రాజు ఆ బిడ్డను నరికి సగం, సగం తీసుకోమన్నాడు. అప్పుడు ఒకామె వద్దని బతిమాలడంతో ఆ బిడ్డ అసలు తల్లిని నిర్ణయిస్తాడు సోలమన్ కానీ ఈ కార్టూన్లో సోలమన్ కూడా బిక్క మొహం వేయవలసి వచ్చింది.



1949లో జాతీయ భాషగా హిందీని నిర్ణయించిన నాటి ముచ్చట ఇది. అప్పటికి హిందీ పూర్తిగా పరిపక్వం కాని భాష. (వాడుకలో ఉండే భాష హిందూస్తానీ, ఉర్దూ, హిందీ సమ్మిశ్రితం. జాతీయభాషగా హిందీయా? హిందుస్తానీయా? తేల్చుకోవలసి వచ్చినప్పుడు రాజేంద్రప్రసాద్ 'కేస్టింగ్‌వోట్'తో హిందీ నెగ్గింది! తెలుగు, తమిళం, బెంగాలీ వంటి ఎన్నో భాషలు పూర్తిగా ఎదిగి ఉండగా వాటిని కాదని చిన్న పిల్లగా ఉన్న హిందీని వరించాడు వృద్ధవరుడు. అందుకే అర్థశతాబ్ది తర్వాత కూడా హిందీని ఇంకా మనకు 'నేర్పుతూనే ఉన్నారు'.



1949లో విద్యాశాఖమంత్రి మౌలానా అబుల్ కలాం ఆజాద్ 'మన విద్యావిస్తరణ కార్యక్రమం నిరాఘాటంగా కొనసాగుతోంది.' అని ఇచ్చిన స్టేటుమెంటు పరిణామాలు ఎలా ఉంటాయో చూపిన కార్టూన్. మౌలానా గారి పాఠాలు, రాజాజీ భారతీయ సంస్కృతి పాఠాలు, నెహ్రూ చరిత్ర పాఠాలు, పటేలు బెత్తం చేతబట్టి చెప్పే పాఠాలు, టాండన్ ఛాందసపు పాఠాలు విన్నాక విద్యార్థి గతి ఏమవుతుంది?.



1953 జనవరిలో కాంగ్రెసు సమావేశంలో పెట్టవలసిన తీర్మానాలను నిర్ణయించడానికి అందరూ కలసికట్టుగా బాధ్యత తీసుకోవాలని నెహ్రూ చేసిన విజ్ఞప్తిని వెక్కిరించిన కార్టూన్. అందరి చేతుల్లోనూ ఉత్తుత్తి స్టీరింగులు, అసలు స్టీరింగు మాత్రం నెహ్రూ చేతిలోనే.

# గిటార్‌కి 20 తీగలు అమర్చి గ్రామి అవార్డును పొందిన భారతీయుడు

# విశ్వమోహన్ భట్

ఎవరో విదేశీయులు గుర్తిస్తే తప్ప మన బంగారాన్ని మనం గుర్తించం. ఈమాట అరుదైన కళాకారుడు విశ్వమోహన్ భట్ విషయంలోనూ నిజమేనని మరోసారి ఋజువైంది.



స్పెషల్ ఆర్టికల్

ఆయన 1994లో చైనా కళాకారుడు బీజింగ్‌చెన్ వాయించే 'ఎర్హు' వాయిద్యంతో తన మోహన వీణను జతకలిపి 'జుగల్‌బందీ' వాయిస్తే ఎలా సాధ్యమైందని అందరూ విస్తుపోయారు. విశ్వమోహన్ భట్ గురువైన పండిట్ రవిశంకర్ సైతం ఆశ్చర్యపోయారు. భూపాలీ వంటి హిందుస్థానీ రాగాలు చైనా రాగాలతో పోలి ఉండడమే దానికి కారణం అంటారు విశ్వమోహన్. హాలీవుడ్‌కి చెందిన రై కూడర్‌తో కలసి విశ్వమోహన్ రూపొందించిన 'ఏ మీటింగ్ బై ద రివర్' ఆల్బమ్ 1994లో గ్రామీ అవార్డు అందుకున్నప్పుడు సంగీతం ద్వారా కూడా గ్రామీ అవార్డు అందుకోవచ్చని నిరూపించిన వ్యక్తి - విశ్వమోహన్‌భట్....! సహజ ప్రతిభ, ప్రయోగశీలత ఉన్నవారు పట్టిందల్లా బంగారంగానే మారుతుందనడానికి విశ్వమోహన్ ఒక ఉదాహరణ. నిజానికి 'మోహన వీణ' అన్నది ఎక్కడుంది? మన సంగీత విద్వాంసులు ఎవ్వరూ ఆ వీణని గురించి విన్నదీలేదు. కన్నదీలేదు. మోహనవీణ సృష్టికర్త విశ్వమోహనుడే! ఆ సృజన కూడా ఓ కథే! సత్సంగీత సాంప్రదాయ కుటుంబంలో జన్మించిన విశ్వమోహన్ తొలిరోజుల్లో సితార, హిందూస్థానీ గాత్రం అభ్యసించడం ప్రారంభించారు. అప్పట్లోనే వయోలిన్ పట్ల కూడా మక్కువ కలిగితే కొన్నాళ్లు దాన్ని కూడా నేర్చుకున్నారు. ఏదో ఒకటి భిన్నంగా ఉండేది చేయాలన్న సంకల్పం ఆయన్ని తిన్నగా ఉండ నిచ్చేదికాదు. మరోవైపు వీణ, సితార, వయొలిన్‌లను సమ్మిళితం చేసే నాదం కోసం తపించేవారు. విశ్వమోహన్‌కి పదమూడేళ్ళ వయసులో ఒక జర్మనీ యువతి తన హవాయిన్ గిటార్‌తో ఆయన తాత, తండ్రుల దగ్గర కొచ్చింది. ఆరు తీగెలతో ఆ గిటార్‌నాదం మధురంగా వినిపించడంతో విశ్వమోహన్ దానికి ఆకర్షితుడయ్యారు. అటువంటి గిటార్ మరోటి కొని ఆ తీగెలు తీసి తానే కొత్త తీగెలు బిగించారు. తర్వాత సాంకేతిక నిపుణుల సాయంతో మొత్తం ఇరవై తీగెలు సమకూర్చారు. వాటి మేళవింపు ఎంత సొగసుగా అమరిందంటే, దానికి విశ్వమోహన్ ఉబ్బి తబ్బిబ్బయ్యారు. తను ఎన్నో ఏళ్ళుగా కలలు కన్న నాదం తన సొంతమైంది. అలా రూపొందిందే 'మోహనవీణ!' సితార, సరోద్ సుస్వరాల సంగమం మోహన వీణ తయారయ్యాక హిందూస్థానీ రాగాలకు కొత్త స్వరాలు, నడకలు వచ్చాయి. రాగం ఏదైనా - ఆలాప్, జోర్, జాలా - ఎలా సాగినా వినసొంపుగా, ఆహ్లాదంగా, అద్భుతంగా రావడంతో విశ్వమోహన్ పేరు విశ్వమంతా వ్యాపించింది.

అందుకే విశ్వమోహన్ 'ఏ మీటింగ్ బై ద రివర్', 'ముంతాజ్ మహల్' అనే రెండు ఆల్బమ్‌లు 'డెడ్ మ్యాన్ వాకింగ్', 'టూడేస్ ఇన్ ద ర్యాలీ' అనే ఆంగ్ల చిత్రాల్లో చోటు చేసుకున్నాయి. వాటిల్లో 'డెడ్‌మ్యాన్ వాకింగ్' కి ఆస్కార్ అవార్డు రావడం విశేషం. మణిరత్నం నిర్మించిన 'రోజా' మొదలుకొని పలు హిందీ సినిమాల్లోనూ ఆయన రాగాలకు పట్టాభిషేకం జరిగింది. సంస్కృత కావ్యం 'మేఘదూతం' కి ఆల్బమ్ ద్వారా ఆయన సమకూర్చిన సంగీతం కాళిదాసు ఆత్మని ఆవిష్కరించింది.

అమెరికాలో గిటార్ వాదనలో దిట్టగా పేరు పొందిన డోబ్రో ప్లేయర్ జెర్రీ, జగ్లాస్, అరేబియా ఔద్ ప్లేయర్ సైమన్ షహీన్‌లతో ఎన్నో ప్రయోగాలు చేసిన విశ్వమోహన్ స్వదేశమైన భారతదేశంలో కన్నా విదేశాల్లోనే ఎక్కువ పేరు ప్రఖ్యాతులు పొందారు. అంతర్జాతీయ వయొలిన్ విద్వాంసుడు ఎల్.సుబ్రహ్మణ్యం తో కలసి ఆయన వినిపించిన స్వరాలకు అమెరికా పులకించింది. మెక్సికో గిటారిస్టు డేవిడ్ హీడల్గో, ఆస్ట్రేలియా గిటారిస్టు లారీ మిన్సన్‌లతో కలసి ఫ్యూజన్ అందించిందీ మోహనుడే. ఎంతపేరు వచ్చినా ఇప్పటికీ తన తొంభై సంవత్సరాల తల్లివద్ద కొత్త 'బందిష్‌లు' నేర్చుకోవడం మాత్రం మానలేదు. భారత స్వాతంత్ర్య స్వర్ణోత్సవాల్లో భాగంగా లండన్‌లో రాయల్ అల్బర్ట్ హాల్లో జరిగిన మోహనవీణ కచేరికి ముఖ్య అతిథి ప్రిన్స్‌చార్లెస్. 1997లలో క్వీన్ ఎలిజబెత్-I భారత్‌ను సందర్శించినపుడు ఆమెను అలరించేందుకు కూడా మోహన వీణే శరణ్యమైంది.

ఇటీవల బేలా గానంచేసిన తొలి ఆల్బమ్ 'కైసా ఏ జాదూ' కి సంగీత దర్శకత్వం వహించిన విశ్వమోహన్ భట్ ఇప్పటివరకు ఎన్నో వందల గీతాలను రూపొందించారు. తన రెండేళ్ల మనవడు రాగాలను గుర్తిస్తుంటే ఆనందించే ఈ తాతయ్య 'గురుకులం' స్థాపించే దిశగా కృషి చేస్తున్నారు. తన కుమారులు సలిల్, సౌరభ్‌లు ఇప్పటికే తన వారసత్వం అందిపుచ్చుకోవడం, తన శిష్యులకు నేర్పించడం తన అదృష్టం అంటారు. అంతేకాదు సౌరభ్ 450 గీతాలకు సంగీతం సమకూర్చడం పట్ల కూడా సంతృప్తిని ప్రకటిస్తారు. తన సంగీత ప్రస్థానంలోనే తన సంతతి పయనించడం కన్నా ఆనందం, గౌరవం ఆయనకి ఇంకెక్కడ లభిస్తాయి..!?

**-సి.హెచ్.లక్ష్మి**







సొగసుగా మృదంగ తాళముా...

జతగూర్చి నిన్ను సొక్కజేయు ధీరుడెవడో...!!

అన్నారు త్యాగరాజ స్వామివారు!...

అదిగో!!

కశింకోట కచేరీలో ముక్కుపచ్చలారని ఐదేళ్ళ బాలుడు మృదంగాన్ని పట్టుకుని ఎడాపెడా వాయించేస్తున్నాడు...

ఆ మృదంగనాదం...

ఓసారి గుండెలమీద ఇనపగుళ్ళేసి కొట్టినట్టూ ధన్ ధన్ మంటోంటే... మరోసారి స్వారీ చేస్తున్న గుర్రాల డెక్కలు మనపక్కనించే వెళ్తున్నట్టూ!

ఇంకోమాటు... వడగళ్ళ వాన పడ్డట్టుంటే... మరో మాటు వర్షం వెలిసాక పారిజాతాలు జలజలా రాలినట్టూ..ఓ పర్యాయం ప్రియుడి నెత్తిమీద ప్రేయసి సున్నితంగా మొట్టినట్టుంటే... మరొకప్పుడు... ప్రేయసి బుగ్గమీద ప్రియుడు చిటికేసినట్టూ... ఔను! ఈ శబ్ద సౌందర్యమంతా మృదంగం మీదే!...

అలా వాయిస్తున్న కుర్రాడి పేరే!...

**కోలంక వెంకటరాజు!!!**

# అవే వేళ్ళు

# అటు సొగసైన మృదంగం ఇటు నాజూకైన శిల్పం

**వహ్వా... వహ్వా... మషాఅల్లా... మాషా అల్లా...**

అంటూ పులకించి పోయాడొక సామాన్య హకీం (హకీం అంటే వైద్యుడు...) మహమ్మద్ మోహినుద్దీన్ అనే ముస్లిం!! 'ఎంత బావుంది మృదంగనాదం' అనుకుని అమాంతం ఆ కుర్రాణ్ణి కావలించుకునీ ముద్దెట్టుకున్నాడు గడ్డంగుచ్చుకునేలా...!

వెంటనే "నువ్వుండాల్సింది ఇక్కడ కాదు బేటా... నాతోరా..." అని ఆ కుర్రాణ్ణి తుని దగ్గర్నించి కాకినాడకి తీసుకెళ్ళి... ప్రముఖ మార్దంగికులు శ్రీ మురమళ్ళ గోపాలస్వామి దగ్గర శిష్యుడిగా చేర్చారు. మరో విశేషమైన విషయం ఏమిటంటే 1918లో తునిలో త్యాగరాజ స్వామివారి ఆరాధనోత్సవాల్ని ప్రారంభించింది... ఈ మహమ్మద్ మోహినుద్దీనే!!

(సందర్భం కనుక నేనిక్కడో విషయం ప్రస్తావిస్తున్నా... రెండేళ్ళ క్రితం ఓ సారి రేపల్లెలో శ్రీరామనవమి సందర్భంగా జరిగిన నాటక పోటీలకి ముఖ్య అతిథిగా వెళ్ళాను... నేను స్టేజీ ఎక్కగానే... గత పాతిక సంవత్సరాలుగా శ్రీరామనవమిని ఇంతఘనంగా జరుపుతున్నది ఈయనే అని నాకో 'ముస్లిం'ని పరిచయం చేశారు! నా కళ్ళు చెమ్మగిల్లాయ్... ఆ సభలో నేనో మాట అన్నాను... మతం కోసం కొట్టుకుచచ్చిపోతున్న ఈ రోజుల్లో... ఒక ముస్లిమ్ శ్రీరామనవమి ఉత్సవాల్ని... పాతికేళ్ళనించీ నిర్వహించడం... ఒక చారిత్రక





# తనికెళ్ల భరణి

అద్భుతం!!... అందుకనేమో రామదాసు ఎన్నికీర్తనలు రాసినా శ్రీరాముడు దర్శనం ఇచ్చింది మాత్రం ముందు 'తానీషాకే' అనీ... దీనినే 'యోగం' అంటారు... ఇలాంటి మహానుభావుల్ని చూస్తే... సంకుచిత మతాలు సిగ్గుతో కుంచించుకుపోతాయ్!!)

సరే పన్నెండేళ్లొచ్చేవరకూ శ్రీమురమళ్ల గోపాలస్వామిగారి దగ్గర మృదంగంలోని మెళుకువలన్నీ నేర్చుకునీ..ఆ తర్వాత శ్రీ తుమరాడ సంగమేశ్వరశాస్త్రిగారిదగ్గరకొచ్చారు.

**తుమరాడ వారి వీణ**
**కోలంక కుర్రాడి మృదంగం!!**

**శాస్త్రిగారి గోటితో వీణ మీటితే...** రాగం తేనె బొట్టులాగ తీగల మీద నుండి జారుతూ... ఈయన మృదంగం మీద పడీ... గగనం నుంచి శివుడి శిరస్సుమీద పడ్డ గంగల్లే కాస్సేపు నర్తనం చేసి... ప్రేక్షకుల హృదయాల మీద జల్లుకొట్టేది!! రాత్రిపూట భోజనం అయ్యాక... సంగమేశ్వర శాస్త్రిగారు తంబుర బిగించి 'అబ్బాయ్ లేవరా' అనేవారట... అక్కణ్ణించీ దేవతలంతా తాళాలేసేదాక అర్ధరాత్రి వరకూ సాధన!! ఇదిగో ఆ సాధన వల్లే...

వీణ పక్కన-
మృదంగం ఎంత లబ్జుగా వాయించాలీ
వేణువు పక్కన-ఎంత సుందరంగా వాయించాలీ
వాయులీనం పక్కన ఎంత లలితంగా వాయించాలీ...

ఈ చిట్కాలన్ని నేర్చుకున్నారు... అక్కణ్ణించి... ద్వారం వెంకటస్వామి నాయుడిగారి దగ్గర శిష్యరికం! అక్కడ చేరడం తన పూర్వజన్మ సుకృతంగా భావిస్తారు రాజుగారు... ఎంచేతంటే సంగీతానికి సంబంధించిన సర్వ విషయాల్ని అంటే... వర్ణాలకి ఎలాగ, పదాలకి ఎలాగ... కీర్తనలకి ఎలాగ... జావళీలకి ఏవిధంగా... దేనికి ఏ దరువేస్తే... రసగంగ పొంగుతుందో ఔపోసన పట్టేశారు!! అందుకే ద్వారం వారి చివరి వరకూ సహకారం మాత్రం కోలంకవారే!!

అప్పటిదాక కేవలం సహకార వాయిద్యంగ ఉన్న మృదంగాన్ని 'సోలో' వాయిద్యంగా మార్చి కేవలం 'మృదంగం' కచేరీలిచ్చిన ఘనత కూడా రాజుగారిదే!!

అలాగే కోలంక వెంకటరాజుగారు సంగీత సమ్రాట్టులైన సర్వశ్రీ... అరియకుడి రామానుజయ్యార్, చెంబై వైద్యనాథ భాగవతార్, చిత్తూరు సుబ్రహ్మణ్య పిళ్ళే... ఈమని శంకరశాస్త్రి-పారుపల్లి రామకృష్ణయ్య పంతులు వంటి ఎందరో మహానుభావులకి మృదంగ సహకారం అందించారు...

విజయనగరం సంగీత కళాశాలలో పదకొండేళ్ళపాటు మృదంగం ప్రొఫెసర్‌గా పనిచేసి... ఆంధ్రదేశంలో నే కాకుండా మైసూర్, జైపూర్ సంస్థానాల్లో ఎన్నో ఘనసన్మానాలు పొందారు!

మరో విశేషం... వెంకటరాజు గారి మృదంగం వాయించే వేళ్ళకి మరో విద్యకూడ వొచ్చు... అదే శిల్పం!! మృదంగం ఎంత సొగసుగా 'వాయిస్తారో సిమెంట్‌తో శిల్పాలూ అంత నాజూగ్గానే చేస్తారు. రెండు అద్భుతమైన కళలు ఒక్కర్లోనే ఉండడం నటరాజు లీల!

ఆయన జీవితంలో జరిగిన అద్భుతమైన సంఘటన సాక్షాత్తూ ఆయన మాటల్లోనే... "త్యాగరాజు స్వామి వారి విగ్రహాన్ని తయారు చెయ్యాలని ఎప్పటినించో కోరిక... రిటైర్ అయిపోయాను, ఆర్థికంగా ఏదో ఓ మాదిరిగా ఉందీ... ఇంక బావుంటుంది కదాని మనసులో పుట్టి... ధనం సంపాయించాలనుకున్నాను... ఆ దుర్బుద్ధి త్యాగరాజు స్వామి వారికి ఇష్టంలేదు... ఆయన త్యాగమూర్తి... తనకున్నదంతా రాముడికే కైంకర్యం చేసాడు... బిక్షాటన చేసి బతికాడు... మహారాజులిచ్చినా తిరస్కరించాడు... అటువంటి త్యాగరాజస్వామి వారి విగ్రహాన్ని ధనాశతో చేసే నా భావన ఆయనకు నచ్చలేదో ఏమో... వెంటనే పెద్ద జబ్బుచేసింది... హార్టు జబ్బు చేసింది!... తర్వాత కొన్ని రోజులకి రక్తపుపోటు వచ్చింది... ఆ జబ్బుతో చాలారోజులు విశాఖపట్నం ఆస్పత్రిలో ఉన్నాను. నాకు కలిగిన ధనాశే ఈ జబ్బుకి కారణం అని నా అంతరాత్మ ఘోషించింది!... అప్పట్నించీ డబ్బు సంపాదించే ఉద్దేశ్యంతో విగ్రహాలు చెయ్యనని గట్టిగా నిర్ణయం తీసుకున్నాను...

మొత్తానికి ఒక త్యాగరాజస్వామి వారి విగ్రహాన్ని తయారు చేసి హైదరాబాదు త్యాగరాయ గానసభకి ఇవ్వాలనుకున్నాను. నా ఆరోగ్యం కుదుట పడింది!!!

స్నేహితుడూ, శిష్యుడూ అయిన నరసింహం గారికి కబురుచేసా... పింగాణి కప్పులు తయారు చేసే మట్టి ఉంటుంది- ఆ మట్టి ఒక టన్ను తెప్పించా... అది మెత్తగానూ ఉంటుంది- నిలవ ఉంటుంది... ఆరితే గట్టిపడుతుంది... ఆ తర్వాత దాన్ని చెక్కాను...



రైల్వే వారి సహకారంతో స్వయంగా హైదరాబాదు తీసికెళ్ళి త్యాగరాయ గానసభ ప్రాంగణంలో ప్రతిష్టించా...

'ఈ జన్మకి ఈ తృప్తి చాలు!!'

నిధి చాల సుఖమా... రాముని సన్నిధి చాల సుఖమా అన్నారు త్యాగరాజస్వామి... రాముని సన్నిధే సుఖమని 'మృదంగం మీద' దెబ్బకొట్టి మరీ చెప్పారు కోలంక వెంకటరాజు గారు...

**(డాక్టర్ కుమారి సి.విజయలక్ష్మి గారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలూ సంగీత వాఙ్మయం' చదివి స్పందించి)**

ఈ ఆర్టికల్‌పై మీ అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికే నేరుగా తెలియజేయండి.

ఆయన అడ్రస్సు:
**తనికెళ్ల భరణి,**
**'సౌందర్య లహిరి'**
**8-3-678/6, ప్రగతినగర్**
**హైదరాబాద్ - 500 045.**





# మ్యూస్ వ్యూస్

## ఉవాచ

"పాట రాయడానికి మేం పడేది అక్షర వ్యథ... పాట పాడుతున్నప్పుడు పరభాషా గాయకులు చేస్తోంది అక్షర వధ"

- గేయ రచయిత, కులశేఖర్

---

'నిజానికి నేనెప్పుడూ హిందుస్తానీ సంగీతం నేర్చుకోలేదు. వినికిడి, అవ గాహనతోనే 'హమ్ అప్‌కే దిల్‌మే రహతే హై' 'సప్నోంకే రాజా' సినిమాలకు సంగీత దర్శకత్వం వహిస్తే అనూ మల్లిక్ వంటివారు కూడా మెచ్చుకున్నారు".

- మహిళా సంగీతదర్శకురాలు శ్రీలేఖ.

---

"దేవుడి ముందు నిలబడి మన కోరికల లిస్టు చదివేకంటే... ఆయన పేర్ల లిస్టు చదివితే కాస్త నోరైనా తిరుగుతుంది. మంచి భాష అబ్బుతుంది." -ఎమ్మెస్ నారాయణ.

---

"నేను కవితలు రాసేటప్పుడు చాలా ఇంగ్లీషు పదాలు ఉపయోగించాను. హిందీ, ఉర్దూ మాటలు కలిపి వాడాను. ఉర్దూ షాయరీ సర్కిల్స్‌లో అది గొప్ప అపరాధంగా భావించినా నేను లక్ష్యపెట్టలేదు".

-మొహదీహసన్ కొత్త ఆడియో 'సదా-ఏ-ఇశ్క్'కి లిరిక్స్ రాసిన ఫర్‌హాత్ షాజాద్

---

"ప్రేమించడం, మోసగించబడినట్టు ఫీలవడం - ఇవి ప్రపంచ వ్యాప్తంగా అందరికీ కలిగే ఎమోషన్స్. అలాటి పాటల్లో శ్రోత తనను తాను చూసుకుంటాడు. అందుకే అలాటివి హిట్ అవుతాయి".

-కోటిన్నర క్యాసెట్లు అమ్ముడుపోయిన 'తుమ్‌తో తేరే పర్‌దేశీ' పాడిన అల్తాఫ్‌రాజా.

## మస్తీ కార్డు కొంటే పుట్టిన రోజుకై ఎదురు చూస్తారు

రాబోయే మూడేళ్ళలో మ్యూజిక్ వరల్డ్ దేశం మొత్తం మీద 50-60 ఔట్‌లెట్స్ తెరుద్దామని ప్లాను చేస్తున్నారు. 5 లక్షల జనాభా ఉన్న ప్రతీ పట్టణంలోనూ తమ షాపు ఉండాలనే పథకంలో భాగంగా క్వికీస్‌కాఫీ కంపెనీతో మరో అగ్రిమెంటు పెట్టుకున్నారు. తమ కస్టమర్లకు మేలు చేకూర్చే ఉద్దేశ్యంతో "మస్తీకార్డు" అనే కార్డును ప్రవేశ పెడుతున్నారు. మ్యూజిక్ వరల్డ్‌లో 300 రూ॥ల కంటె ఎక్కువ కొనుగోలు చేసిన వారు 50 రూ॥లు అదనంగా చెల్లించి ఈ కార్డును పొందవచ్చు. ఈ కార్డుతో టైటాన్, లూయీ ఫిలిప్ వగైరా అనేక కంపెనీల ఉత్పాదనలపై డిస్కౌంటు పొందవచ్చు. ఆ డిస్కౌంటు రేటు కూడా మారుతూ ఉంటుంది. కార్డు హోల్డర్ పుట్టిన రోజు వచ్చిన నెలలో అత్యధిక డిస్కౌంట్ లభిస్తుంది. దానికి ముందు నెలలో మరొక రేటు. తక్కిన నెలల్లో అంతకంటె తక్కువ రేటు. ప్రస్తుతం చెన్నయ్‌లో ప్రవేశపెట్టిన ఈ కార్డును తక్కిన నగరాలలో కూడా త్వరలో ప్రవేశపెడతారట.

## లక్నో FM రేడియోకు ప్రసార భారతి చేయూత

ప్రసార భారతి మొట్ట మొదటిసారిగా ఒక ప్రైవేటు కంపెనీతో ఒప్పందం కుదుర్చుకుంది. ఇస్పాత్ గ్రూపువారి మ్యూజిక్ బ్రాడ్‌కాస్ట్ ప్రై. లిమిటెడ్ వారితో చేసిన MoU ప్రకారం లక్నోలోని ఆలిండియా రేడియోవారి టవర్‌ను ఏడాదిపాటు మ్యూజిక్ బ్రాడ్‌కాస్ట్‌కి లీజుకు ఇస్తారు. ఆ కంపెనీ లక్నోనుండి 10-km FM రేడియో ప్రసారాలను అతిత్వరలో ఆరంభించగలుగుతుంది.

## పిట్టకొంచెం-పాటదీర్ఘం

1996 సంవత్సరంలో 110 పాటలకు కేవలం ఎనిమిది రోజులలోనే కంపోజ్ చేసి లిమ్కా బుక్ ఆఫ్ రికార్డుల కెక్కిన శ్రీ యల్. ఆనంద్ పిన్నవయస్సులోనే మరొక రెండవ ప్రపంచ రికార్డు నెలకొల్పబోతున్నాడు. మరాఠా యోధుడు పీష్వా బాజీరావు, అతని రెండవ భార్య మస్తానీల అమర ప్రేమపై ఒక చారిత్రాత్మక గీతాన్ని 240 నిమిషాల పాటు, అనేకమంది గాయనీ గాయకులతో వాద్యకారులతో పాడబోతున్నాడు. ఈ విలక్షణమైన గీతం మొత్తం వందభాగాలుగా, మూడువందల చరణాలతో ఉంది.

## ఇండీపాప్ ఇక్కట్లు

ఈ ఏడాది ఇప్పటి వరకు 66 ఇండీపాప్ ఆల్బమ్స్ విడుదల కాగా వాటిలో ఒకటి, రెండు మాత్రం హిట్ కావడం మ్యూజిక్ ఇండస్ట్రీ వర్గాలను విస్మయపరుస్తుంది. సోనీ కంపెనీతో సహా అన్ని కంపెనీలు సినిమా మ్యూజిక్‌కే ప్రాధాన్యత ఇస్తున్నాయి. వాళ్ళు నిర్లక్ష్యం చేయడం కారణంగానే పరిస్థితి ఇలా ఉందని ఇండీపాప్ గాయకులు ఆరోపిస్తున్నారు. కొత్త గొంతులు రాకపోతే మేమేం చేయమని కంపెనీలు ప్రశ్నిస్తున్నాయి. ఇండీపాప్ పాటల స్థాయి పెరిగితేనేగాని పరిస్థితిలో మార్పు రాదని మార్కెట్ పరిశీలకులు వ్యాఖ్యానిస్తున్నారు.

## టాకీ టాక్

❒ విశ్వమోహన్‌భట్ ఇటీవల వారణాశిలో తన విశ్వవీణపై రాగ్ బసంత్ వాయించిన ప్రోగ్రాంను ధడకన్ డాట్‌కామ్ వారు రికార్డు చేసి "స్వరవర్ష" పేరుతో ఇటీవల విడుదల చేశారు.

❒ అద్నన్‌శామీచే పాడించి "లిఫ్ట్ కరాదే" ఆల్బమ్‌ను హిట్ చేసిన డైరెక్టరు జయేష్ సేర్ కొత్తగా "జీనా తేరీ బాహోం మేఁ"ను డైరక్టు చేయబోతున్నారు.

❒ పంజాబీ పాప్ గాయకుడు గురుదాస్ మాన్ షహీద్ బూటాసింగ్‌గా నటించిన "షహీద్ మొహబ్బత్" సినిమా హిట్ కావడంతో ఆ డైరెక్టరుగా పని చేసిన మనోజ్ పుంజ్ గురుదాస్‌ను పెట్టి మరో సినిమా తీయబోతున్నారు. "జిందగీ ఖూబ్‌సూరత్ హై" అనే పేరుతో తీస్తున్న ఈ సినిమాకు ఆనంద్ రాజ్ ఆనంద్ సంగీతం అందిస్తున్నారు. హీరోయిన్ టాబూ.

❒ గాయకుడు కుమార్ సానూ సంగీత దర్శకుడు కాబోతున్నారు. ఈటీవి ఉర్దూలో ప్రసారం కబోయే 'ఆంచ్' సీరియల్‌కు, 'కైసే కహూఁ' అనే మ్యూజిక్ ఆల్బమ్‌కు సంగీతం అందించబోతున్నారు.




## అమాయక చక్రవర్తి



"అమాయక చక్రవర్తి" టీవి సీరియల్‌లో కథానాయకుడుగా నటించిన అంజన్ శ్రీవాస్తవ ఇక ఏ మాత్రం అమాయకంగా ఉండనంటున్నారు. ఆర్.కె.లక్ష్మణ్ తన కార్టూన్‌లలో చూపించే 'కామన్‌మాన్' ముఖ్యపాత్రగా "వాఘ్లేకి దునియా" పేరుతో టీవీ సీరియల్ (దానినే తెలుగులోకి డబ్ చేసి 'అమాయక చక్రవర్తి' ఈటీవిలో ప్రసారం చేశారు)గా నిర్మిద్దామనుకున్నప్పుడు ఆ మధ్యతరగతి ఇంటాయన పాత్రకు సిరీస్ నిర్మాతలు అంజన్ శ్రీ వాస్తవను ఎంపిక చేసుకున్నారు. ఆ పాత్రకు బాగా సూట్ కావడంతో పాపం శ్రీవాస్తవకు అన్నీ అలాటి పాత్రలే రాసాగాయి. ఒకే రకం మూసపాత్రలు వేసి, వేసి విసిగిపోయిన శ్రీవాస్తవ ఒళ్లు మండి "పుకార్" సినిమాలో దుష్టపాత్ర ధరించాడు. దానికీ బాగా పేరు వచ్చింది. ఇక అలాటి నెగటివ్ పాత్రలే ధరిస్తానంటున్నాడు శ్రీవాస్తవ. విలన్‌లా అనిపించాలని అమ్రిష్‌పూరి స్టయిల్లో బోడిగుండుతోనే తిరుగుతున్నాడీ మధ్య!



## లతా నిర్మించిన హాస్పటల్ - ప్రధానమంత్రిచే ఆవిష్కరణ

లతామంగేష్కర్ తన తండ్రి పేర నిర్మించిన దీనా నాథ్ మంగేష్కర్ హాస్పటల్ అండ్ రిసెర్చ్ సెంటర్ ప్రారంభోత్సవానికి ప్రధానమంత్రి స్వయంగా విచ్చేశారు. "నేను సాధారణంగా ఆసుపత్రులు ప్రారంభించడానికి రాను. ఎందుకంటే అవి వర్ధిల్లాలని ఆశీర్వదిస్తే ప్రజలకు అనారోగ్యం పెరగాలని కోరుకున్నట్టు అర్థం. ప్రజలకు ఈ ఆసుపత్రి అవసరం పడకుండా ఉండాలని ప్రార్థిస్తే ఆసుపత్రికి కష్టం. కానీ ఈ సభకు నేను రావడానికి కారణం లతామంగేష్కర్. భారత జాతి ఆమెకు ఋణపడి వుంది కాబట్టి ఆ ఋణం కొంతైనా తీర్చుకోవడానికి వారి ప్రతినిధిగా వచ్చాను" అన్నారు వాజపేయి. ఈ ఆసుపత్రి ప్రత్యేకతలు చాలా వున్నాయి. అత్యాధునికమైన ఈ హాస్పటల్ కేవలం 18 నెలల్లో కట్టబడింది. ఏ రాజకీయ పక్షానికి చెందినవారైనా సరే, ప్రతీ మహారాష్ట్ర మంత్రీ దీని నిర్మాణానికి దోహదపడ్డారు. దీనిలో అలోపతీ మాత్రమే కాక హోమియోపతీ, ఆయుర్వేద, యోగా విభాగాలు కూడా ఉన్నాయి. రోగులతో బాటు వచ్చినవారి వసతికై విడిగా క్వార్టర్స్ కట్టడం కూడా జరిగింది. తన తల్లికి ఇచ్చిన మాట నిలబెట్టుకోవడానికే ఈ ఆసుపత్రి కట్టించానని అన్నారు గానకోకిల.



## టీవీ సీరియల్‌లో మేరియా క్యారి



ప్రఖ్యాత పాప్ గాయని మేరియా క్యారి తను నటించిన "గ్లిటర్" సినిమా ఫ్లాప్ అయినా దాని నుండి ఎలా లాభపడాలో నేర్చుకున్నట్టుంది. ఆ సినిమా సౌండ్ ట్రాక్‌లోని "లీడ్ ది వే"ను పాటను ఓ టీవీ సీరిస్‌లో ఆడి, పాడి చూపబోతోంది. ఫాక్స్ టీవి వారి "ఎలీ మెకబీల్" (జీ ఇంగ్లీషు ఛానెల్‌లో ప్రదర్శింపబడే కామెడీ సీరియల్)లో ఒక అతిథి పాత్రలో నటించబోతోందామె.

## లక్కీ ఆలీ లక్



గాయకులు చాలామంది సినిమా తారలుగా ప్రయత్నించి ఫెయిలయినా, లక్కీ ఆలీని లక్ వరించినట్టుంది. అతను నటించిన సినిమా ఒక్కటీ రిలీజు కాకపోయినా చాలా సినిమాలకు బుక్ అయిపోయాడు. లేటెస్టుగా తనూజ చంద్ర డైరెక్టు చేస్తున్న "సుర్" సినిమాలో మ్యూజిక్ టీచర్ పాత్ర ధరించడానికి లక్కీ ఆలీ ఒప్పుకున్నాడు. ఆ సినిమాలో అతని శిష్యురాలు అతని కంటె ప్రతిభావంతురాలు. కొంతకాలం పాటు ఆమె అంటే అసూయపడి చెడ్డవాడిగా మారబోయి, అంతలోనే ఆమెతో ప్రేమలో పడి మంచివాడిగా మారతాడు. "అభిమాన్" సినిమాలో తన కంటె బాగా పాడగలిగిన భార్యపై అసూయతో జీవితాన్ని దుర్భరం చేసుకున్న భర్తగా అమితాబ్ బచ్చన్ నటించి ఒప్పించాడు. "స్వాతికిరణం"లో శిష్యుడి గాన ప్రతిభకు అసూయపడి అతని చావుకు కారణమయిన గురువుగా మమ్ముట్టి అద్భుతంగా నటించి చూపాడు. మరి ఇటువంటి క్లిష్టమైన పాత్రను లక్కీ ఆలీ ఎలా నిభాయించుకు రాగలడో వేచి చూడాలి.

# చిలిపిలిపి







👁❤U = ఐలవ్‌యు

-ఎమ్.శ్రీనివాస్,చండూర్

Pన్ని గారూ! Eరోజు Bరకాయపచ్చD, గుత్తి 1 కాయకూర 1/2టికాయ వేపుడు చెయ్యనా!?

(పిన్ని గారూ ఈరోజు బీరకాయ పచ్చడి, గుత్తి వంకాయ కూర, అరటికాయ వేపుడు చెయ్యనా!?)

-బోమిడి అజయ్ కుమార్, కోట ఊరట్ల

రైస్ పీస్ కింగ్ = నూకరాజు
(Rice piece king)

నాకీ 'దుర్గతి' ఎందుకు పట్టించావు 'దుర్గా'!?

-పల్లి గోవిందరావు, శ్రీకాకుళం

ఒరే రామూ... నువ్వు ఆ 'లాగేసు' కుంటావా లేక నీచేతి లోంచి ఆ లాగూను 'లాగేసు కోమంటావా!?'

-డి. మదన్, గాజువాక, విశాఖపట్నం

ఒరేయ్ 'కోదండం'... నీ'కో దండం' నన్నొదిలెయ్

-టి. జగన్ మోహన్, నాగార్జున సాగర్





## పేరు రిపేరు

1. 'కటకటాల రుద్రయ్య' - 'ఏప్రిల్ ఒకటి విడుదల

-చిన్ని సురేష్, గుడివాడ

2.'ఆంటీ' 'నువ్వు - నేను' 'ప్రేమిస్తే ఏమవుతుంది?'

'కుటుంబం' - 'పరువు - ప్రతిష్ట' - 'గోవింద గోవింద'

-జగదీష్, కల్వకుర్తి

3.'వయసొచ్చిన పిల్ల' - 'మహజనానికి మరదలు పిల్ల'
'ఆమె' - 'సొగసు చూడతరమా!?'

- వి.వెంకటేశ్వర్లు, పినపల్లి

## చిలిపి కవిత

ఆడదాని కడుపు లవ్వుకి
మగవాడి కడుపు కొవ్వుకి
తార్కాణాలు
కరగాలంటే కావాలి
మొదటి దానికి డెలివరీ
రెండో దానికి డెయిలీవర్రీ

-ఇ. శేఖర్, తాడేపల్లి



# పేరడీ పెరేడ్

ఎవరైనా ఎపుడైనా
సరిగా గమనించారా
లాడెన్ ప్లానెపుడు వేశాడో
అణువణువు అదిరేలా
ప్రతివారూ బెదిరేలా
తన సైన్యానెప్పుడు ఒదిలాడో
చూస్తూనే ఎక్కణ్ణించో
ఫ్లయిటొచ్చి కొట్టింది
బిల్డింగుని ఫట్ ఫట్ మంటూ
కూల్చేసింది
నేలంతా శిధిలాల్తో
సరికొత్తగా తోచింది
తన రూపం తానే
చూసి రోదించింది
ఎవరెక్కడ ఉన్నారో
బ్రతికారో చచ్చారో
మనసెపుడు శోకపు మడుగయ్యిందో
ఓ... ఓ... ఓ...
ఎవరైనా ఎపుడైనా
సరిగా గమనించారా
లాడెన్ ప్లానెపుడు వేశాడో
అణువణువు అదిరేలా
ప్రతివారూ బెదిరేలా
తన సైన్యానెప్పుడు ఒదిలాడో...

'ఆనందం' సినిమాలోని 'ఎవరైనా ఎపుడైనా సరిగా గమనించారా' అనే పాటకు అనుకరణగా...

పంపినవారు
ఎమ్. శ్రేష్ట, హైద్రాబాద్



# ఈ రూటే వేరు

Wife = Worries Invited For Ever
-సయ్యద్ అన్వర్, న్యూ పాల్వంచ

మేనత్త = మే నెలలో బైటికివచ్చే నత్త
-మేడిశెట్టి శ్రీనివాస్, మణికుదురు

డేరింగు = పగటిపూట పెట్టుకునే ఉంగరం
-ఆర్. అప్పలరాజు, రెడ్డిపల్లి




# కొంటె కొశ్శెన్లు-తుంటరి జవాబులు



**వి. మంజురాణి-హైద్రాబాద్**

ప్ర: దశరధుడుకి పురోహితుడుగా శతానందుడు ఉండేవాడు అని ఎక్కడో చదివాను కరెక్టేనా...!? కరెక్టే అయితే ఆయన ఈయనకి ఎలా పురోహితుడయ్యాడు?

జ.దశ అంటే పది. ఆ 'దశ' రధుని బాగు పదే పదే ఆనందంతో కోరాలి కాబట్టి పది ఇంటూ పది = నూరు కాబట్టి శతానందుడు దశరధునికి పురోహితుడు కావటం కరెక్టే అయి వుంటుంది.

**యస్. లీలా గౌరి - విజయనగరం**

ప్ర. కాగితాలు చింపుతాడు కాని పిచ్చివాడు కాదు, డబ్బులు అడుగుతాడు కాని ముష్టివాడు కాదు, గంట కొడతాడు కాని పూజారి కాదు... ఎవరతను?

జ.బస్ కండక్టర్

**యమ్. సీతా మాలక్ష్మి- రాజమండ్రి**

ప్ర. అత్యంత నీతి నియమాలు కల చమత్కారి ఎవరు?

జ. నీలాంటి కొడుకు కావాలని ఏ ఆడదైనా కవ్విస్తే 'సారీ... మానాన్నగారు పోయి చాలా కాలమైంది' అని తప్పించుకునే వాడు.

అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | |
|---|---|
| చిత్రం:- అశోకా | |
| బ్యానర్:- ఆర్క్‌లైట్స్ అండ్ ఫిలిం | |
| గీతరచన:- గుల్జార్-ఆనందబక్షి | |
| సంగీతం:- అనూమల్లిక్ | |
| పాడినది:- చిత్ర, కోరస్ | |
| అభినయించింది:-కరీనా కపూర్,షారుక్‌ఖాన్ ఇతరులు | |

# అశోకా - రాత్ కా నషా

చారిత్రాత్మక చిత్రాన్ని తీయడానికి సాంకేతిక నిపుణులతో సహా అందరికీ చిత్తశుద్ధి ఉండాలి. ఆహార్యం, సెట్టింగులు, సంగీతం, సంభాషణలు అన్నీ ఆ కాలపు వాతావరణాన్ని ప్రతిబింబించేవిగా ఉండాలి. 'అశోకా' వంటి క్రీస్తుపూర్వం సినిమా తీసేటప్పుడు మరింత శ్రద్ధచూపాలి. ప్రేక్షకులను ఆనాటి కాలానికి తీసుకొనిపోయి ప్రత్యక్షంగా చూస్తున్న భ్రమ కలిగించాలి. అటువంటి బాదర బందీలేవీ పెట్టుకోకుండా చరిత్రను కాకుండా హీరోయిన్ అందాలను నమ్ముకుని షారూఖ్ ఖాన్ తీసిన సినిమా 'అశోకా'.

ఈ సినిమాలో చారిత్రక వాతావరణం సృష్టించే సెట్టింగులు ఉన్నాయాలేదా అని వెతకడం కష్టం- కథంతా కొండల్లో, గుట్టల్లో నడుస్తుంది కాబట్టి! ఆహార్యం అతి తక్కువగా ఉంది కనుక, అవి ఏ కాలానికి చెందినవైనా కావచ్చు. ఈ పరిస్థితుల్లో సంగీత దర్శకుడు అనూమల్లిక్ ఆ 'పీరియడ్ మ్యూజిక్' ఇవ్వలేదని వాపోవడం అనవసరం. మామూలు ప్రేమ సినిమాలకు ఇచ్చే సంగీతమే దీనికీ యిచ్చాడు.

'అశోకా' అనగానే తన సోదరులను హతమార్చిన 'చండ అశోకుడు' గుర్తుకురావచ్చు, ప్రజారంజకంగా పాలించిన 'ధర్మ అశోకుడు' గుర్తుకురావచ్చు, కానీ ప్రేమించే అశోకుడు గుర్తుకురాడు కదా, మరి అశోకుడి కథలో ఈ ప్రేమ గీతాలేమిటని ఆశ్చర్యపడవద్దు. '1942 ఎ లవ్ స్టోరీ' అని తీసినట్లు ఈ సినిమాకు 'క్రీస్తుపూర్వం 3వ శతాబ్దం ప్రేమకథ' అని పేరు పెడితే బాగుండేది.

అనూ మల్లిక్ పాటలన్నీ ఓపినయ్యర్ పాటల్లా హాయిగా ఉంటాయి. అదే ట్రెండ్‌లో సంగీతం అందించిన చక్కటి పాట 'రాత్ కా నషా'. అశోకుడు, అతని ప్రియురాలు విడిపోయిన తర్వాత ఆమె విరహాన్ని తెలిపే పాట ఇది. ఒక బల్లకట్టు మీద వెళ్ళే నాట్యబృందంలో ఓ నర్తకి ద్వారా



హీరోయిన్ భావాలు పలికిస్తూ మొదలైన ఈ పాటలో కొన్ని చరణాలు హీరోయిన్ కూడా పాడుతుంది. హీరోతో పెనవేసుకున్న జ్ఞాపకాలు నెమరేసుకుంటూ అందమైన పదాలతో తన ఆర్తిని తెలుపుతుంది. ప్రియుడితో గడిపిన రాత్రి కలిగించిన నిషా కళ్ళనుండి దిగక, కలలలోనే కొట్టుమిట్టులాడుతున్న విరహిణి పక్కమీద అటూ, ఇటూ దొర్లడం సహజమేకదా. 'కరవట్ బదల్‌నా' అంటే అదే! సాధారణంగా దాన్ని కవితలలో ఉపయోగించం మనం. కానీ 'ఆప్ కీ కసమ్'లో 'కరవటే బదల్ తే రహే సారీ రాత్ హమ్' అని టైటిల్ సాంగ్‌కే ఉపయోగించడం జరిగింది.

ఒక్కసారి వింటే చాలు ఆకట్టుకుని, వెంటాడే ట్యూన్ సమకూర్చిన అనూమల్లిక్ ఒక్కడే అభినందనీయుడీ పాటలో!!

## పాట

రాత్ కా నషా అభీ
ఆంఖ్ సే గయా నహీఁ
తేరా నషీలా బదన్
బాహోఁ నే ఛోడా నహీఁ
ఆంఖే తో ఖోలీ మగర్
సప్నా వోఁ తోడా నహీఁ
సాసోంపే రఖా హువాఁ
తేరే హోంఠోం కా
సప్నా అభీ హై వహీఁ
తేరే బినా భీ కభీ
తుఝ్ సే మచల్ లేతీ హూఁ
కర్వట్ బదల్‌తీ హూఁ తో
సప్నా బదల్ లేతీ హూఁ
తేరా ఖయాల్ ఆయే తో
బల్‌ఖాకే పల్ జాతా హైఁ
పానీ కే చాదర్ తలే
దమ్ మేరా జల్ జాతా హైఁ
హా వహీ.. వహ్ వహీ ॥సాసోంసే॥
తేరే గలే మిల్‌నేకే
మౌసమ్ బడే హోతే హై
జన్మోంకా వాదా కోయీ
యే గమ్ బడే ఛోటీ హైఁ
లమ్బీసీ ఏక్ రాత్ హో
లంబాసా ఎక్ దిన్ మిలే
బస్ ఇత్నా సా జీనా హో
మిలన్ కీ ఘడీ జబ్ మిలే
హాఁ వహీ.. బస్ వహీ

## స్వేచ్ఛానువాదం

నిశిరాత్రి మైకం మబ్బు
వీడనంటోంది నయనాలనుండి
మైమరపించే నీ మేను
వీడనే లేదు కౌగిలినుండి
కనులు విచ్చుకున్నా
కల సాగుతూనే ఉంది
అదే.. అవును.. అదే
ఊపిరి కలిపిన నీ అధరాల
స్వప్నం ఊరిస్తోందలాగే! ॥నడి॥

నువ్వు దగ్గరలేకుంటే
తుళ్ళే మనసును మళ్ళిస్తా
పక్కపై పక్కకు మరలుతా
కలను మార్చివేస్తా, తిరగరాస్తా
అంతలోనే నీ ఊహ వస్తే
ప్రతీ క్షణం రగిలించి పోతుంది
అలల దుప్పటి క్రింద
నా ఊపిరే ఆవిరై పోతుంది
అదే..అవును..అదే
గతజన్మ బాసలా? బంధాలా
నీ కౌగిలిలో వసంతం పెద్దదై
వేదనలు చిన్నవై పోతాయి

నిద్రలేని ఓ రాత్రి
నిడుపాటి ఓ పగలు
ఇవి నాకు చాలంటా
కలిసేవేళ ఊపిరుంటే చాలంటా







ఈ పాటను వివరంగా కావాలని కోరిన వారు: గండికోట సోమయాజులు, డైరెక్టర్(రిటైర్డ్) ఇంటర్నేషనల్ అటామిక్ ఏజెన్సీ-హైద్రాబాద్






| | |
|---|---|
| చిత్రం | : కీలుగుర్రం (1950) |
| బ్యానర్ | : శోభనాచల పిక్చర్స్ |
| నిర్మాత, దర్శకత్వం | : మీర్జాపూర్ రాజా |
| సంగీతం | : ఘంటసాల |
| పాట రచన | : తాపీ ధర్మారావు నాయుడు |
| అభినయించినది | : అక్కినేని, సూర్యశ్రీ |
| పాడినది | : ఘంటసాల, శ్రీదేవి |

# ఎంత కృపామతివే భవాని ...



అక్కినేని నాగేశ్వరరావుకి పూర్తిస్థాయి జానపద చిత్ర కథా నాయకుడు (ఫుల్ ఫ్లెడ్జ్‌డ్ ఫోక్ లోర్ హీరో)గా ఒక ఇమేజ్‌ని, ఫాన్ ఫాలోయింగ్‌ని కలిగించిన చిత్రం- 'కీలుగుర్రం'! అంతకు ముందు హీరోలుగా ఉండే నాగయ్య, నారాయణరావులకు అభిమానులు ఉన్నా ఆ అభిమానం హుందాగా ఉండేది.

'కీలుగుర్రం'లో అక్కినేనిని చూశాక యువత ఎంతో ప్రేమతో స్పందించింది. యువతులుకూడా ఆయనపట్ల విపరీతమైన ఆరాధనాభావం పెంచుకున్నారు.

ఈ చిత్రంలోని 'కాదు సుమా కల కాదు సుమా' పాట ఆరోజుల్లో జనం నోట బాగా నలిగిన పాట. 'ఎంత కృపామతివే' పాట మాత్రం క్లాస్ అనిపించే వర్గానికి పరిమితం అయింది. సాధారణంగా ఆరోజుల్లో మాస్ టచ్ అనిపించిన పాటలలో ఎన్నో పాటలు ఈ రోజున వింటుంటే క్లాస్‌గా ఉన్నాయే అనుకోవటం, క్లాస్ టచ్‌తో ఉన్న పాటలను వింటుంటే మరీ క్లాస్‌గా ఉన్నాయిరా బాబు అంటూ(ఈతరం వారు) స్విచ్చాఫ్ చెయ్యటం కూడా జరుగుతోంది. అది సహజం కూడా. కానీ ఈ పాట ఆరోజుకీ ఈరోజుకీ ఒకే స్టాండర్డ్‌తో ఉన్నట్టు అనిపిస్తుంది, వినిపిస్తుంది! కాకపోతే ఇప్పుడు లభ్యమవుతున్న ఈ పాట వినటానికి బాగానే ఉన్నట్టనిపించినా స్పష్టత విషయంలో కొన్ని తేడాలున్నాయి. ముఖ్యంగా 'కత్తివాదరకు బలికానుండే' అనే వాక్యం మనకు అర్థమయ్యే స్థాయిలో వినిపించదు.

ఈ పాటను బృందావన సారంగ, మిశ్ర యమన్ రాగాలలో స్వరపరిచారు. 'మాయాబజార్' లోని 'చూపులు కలసిన శుభవేళా' పాట ఇంటర్ల్యూడ్స్‌ని ఆలపించుకుంటూ ఈ 'ఎంత కృపామతివే' పాట ట్యూన్ గుర్తు చేసుకొని చూడండి. సులువుగా ఆ పాటలోంచి ఈ పాటలోకి, ఈ పాటలోంచి ఆపాటలోకి 'స్వరయానం' చేసిరావచ్చు.

అలాగే 'ప్రణయ దేవతలు పాడుచునుండే సామగానమే ఏమో' అనే లైనుకి జతపడిన ట్యూన్‌ని మననం చేసుకుంటూ చూడండి. 'పెళ్ళి చేసి చూడు' టైటిల్ సాంగ్‌లో

ఇద్దరూ : ఎంత కృపామతివే భవాని ఎంత దయానిధివే॥ఎంత కృపా॥
ఆ : కత్తివాదరకు బలిగానుండే
కన్యకు గూర్చితి కళ్యాణమహో ॥కన్యకు॥
ఎంత కృపామతివే భవాని ఎంత దయా నిధివే
అ : ఏదో పనిపై గే వానికి ॥ఏదో॥
ఈ... విద్యవతి ఈ మనో హారిణి
యిచ్చినన్ను కరుణించితివహో ॥ఈ విద్య॥
ఇద్దరూ : ఎంతటి కృపామతివే భవాని ఎంత దయా నిధివే
అ : నూతనముగా ఈ లేత మారుతము
నూతనముగా ఈ లేత మారుతము
గీతా గానము చేయుగదా
ఆ : హృదయతంత్రులను కదలించుటచే ॥హృదయ॥
కరిగిన గానమో ఏమో వదలిన గానమో ఏమో..
ఇద్దరూ : ప్రణయ దేవతలు పాడుచు నుండే సామ గానమే ఏమో
ప్రణయ దేవతలు పాడుచు నుండే సామ గానమే ఏమో



'భావ కవులవలె ఎవరికి తెలియని ఏవో పాటలు పాడాలోయ్' అనే లైను గుర్తుకు వచ్చి తీరుతుంది. కళ్యాణి రాగానికి ఈ రాగానికి కలిసి పోయే స్వభావం ఉండడంవల్ల కలిగే 'స్వరానుభవం' అది!

'నూతనముగ ఈ లేత మారుతము' అనే లైను దగ్గర ఆర్కెస్ట్రయిజేషన్ పరంగా సంగీత దర్శకుడిగా ఘంటసాల ఉప యోగించిన క్లారినెట్ వింటుంటే ఆయన స్వర పరిచిన ఎన్నో ప్రైవేట్ గీతాలు మన కళ్ళముందు కదలాడతాయి. కొన్ని కొన్ని రాగాలపై ఒక్కొక్క సంగీత దర్శకుడికి ఒక్కొక్క రకం పట్టు ఉంటుంది. ఈ క్లారినెట్ వాద్యం ఆ భావనను మరింత బల పరుస్తుంది.

ఇక సాహిత్యపరంగా చూసుకుంటే ఆనాటి గీత రచయితల రచనా శైలిని ఉదహరించడానికి ఉపయోగపడే పాటగా చెప్పుకోవాలి. ముఖ్యంగా 'కళ్యాణ మహా',



'కరుణించితివహహా' లాంటి ప్రయోగాలు ఇప్పుడు వింటుంటే సరదాగా ఉంటాయి.

ఈ పాటను పల్లవి వరకు సంగీత సాహిత్యపరంగా తీసుకుంటే భక్తిపాటేమోనని పొరబడే అవకాశం ఉంది. -ఏదో పనిపై ఏగే వానికి కత్తి వాదరకు బలికాబోయే విద్యావతిని ఆలిగా మార్చిన భవానీ మాతకు కృతజ్ఞతలర్పించు కుంటూ ఆ జంట పాడిన ప్రేమ గీతమిది. హీరోయిన్ అపదలో ఉన్నప్పుడు ఆ హీరోకి ఎలా తెలిసిపోతుందో ఏంటో ఠక్కున ఊడిపడతాడు!? ఒక్కసారి చూడగానే వాళ్ళిద్దరూ ఎలా ప్రేమించేసుకుంటారో ఏమిటో!? అనే కామెంట్స్‌ని మనం చాలాసార్లు వింటుంటాం. అందుకు తగ్గట్టుకొన్ని కొన్ని సన్నివేశాల రూపకల్పన ఉంటుంటుంది కూడా! కానీ ఈ పాటలో - 'ఏదో పనిపై ఏగే వానికి ఈ విద్యావతి ఈమనో హారిణి యిచ్చి నన్ను కరుణించితివి' అనే లైన్లు వింటుంటే తాపీ ధర్మారావు నాయుడు గారు ఎంత తెలివిగా రాశారో అంటూ మెచ్చుకోకుండా ఉండలేం.






## ఇది యస్పీ బాలసుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

1) మనవాసి (దేవదాసు..ఓ దేవదా)

ఎ) సిగ్గు బి) అభిమానం సి)మన గొప్పతనం డి) ధోవతి

2) వంత ( దేవదాసు..అంతా భ్రాంతియేనా)

ఎ) ప్రేమ బి) జ్ఞాపకము సి) సరే డి) సంతాపము

3) నెలవు (దేవదాసు..చెలియలేదు)

ఎ) స్నేహము బి) అభిప్రాయము సి) దారి డి) ఉండే చోటు

4) లాయిరి (లాహిరి) (దేవదాసు..కుడి ఎడమైతే)

ఎ) మైకము బి) సముద్రపు పోటు సి) నట్టనడుమ డి) నావ

5) పెన్నిధానము (దేవదాసు...తానే మారెనా)

ఎ) నిజము బి) పెద్ద దానము సి) గొప్పనిధి డి) నెమ్మది

6) వాదర (కీలుగుర్రం..ఎంత కృపామతివే)

ఎ) పిడి బి) మొన సి) అంచు డి) కాంతి

7) ఉప్పెన (నువ్వు నాకు నచ్చావు..ఒక్కసారి చెప్పలేవా)

ఎ) పెద్దది బి) ఊపిరి సి)చిటికెడు డి) సముద్రపు పొంగు

8)ఊసులు (ఆనందం..ప్రేమంటే ఏమిటంటే)

ఎ) కాలక్షేపం కబుర్లు బి) ఊహలు సి) ఆటలు డి)ఆశలు

9) మిసిమిసి (జాబిలి..రండి బాబూ)

ఎ)మెత్తని బి)నునుపైన సి)వంపులు తిరిగే డి)కాంతులీనే

10) ఇల (జాబిలి..వయసు తలుపు)

ఎ) భూమ్యాకాశాలు కలిసే చోటు బి) భూమి సి) ప్రకృతి డి) ఆకాశం వంపు

జవాబులు

1(c) 2(a) 3(d) 4(a)
5(c) 6(c) 7(d) 8(a)
9(d) 10(b)

మీ
బాలు

# ఆడియో చాట్



పద్మశ్రీ పి.భానుమతి గారికి నమస్కరించి మీ అభిమాని వ్రాయు లేఖ. నేను గడచిన శతాబ్దంలో నాలుగవ దశకం మొదట్లో జన్మించాను. నాకు చిన్నప్పటి నుండి సినిమాలు ఎక్కువగా చూసే అలవాటు వుండేది. నేను చిన్నతనం నుండి మీ సినిమాలంటే ఎక్కువ ఇష్టంగా చూసేవాడిని. నా చిన్నతనంలోనే మీరు నటించిన రత్నమాల, లైలా మజ్ను చూసి మీ అభిమానిని అయినాను. ఈ సినిమాలలోని పాటలు మాయింట్లో ఆ నాడు 78 ఆర్‌పిఎం రికార్డులుగా వుండేవి. మీరు నిర్మించగా తరువాత వచ్చిన ప్రేమ, చండీరాణి, చక్రపాణి మరియు విప్రనారాయణలోని మీ పాటలు అద్భుతమయినవి. ఈటీవీ పుణ్యమా అని లైలామజ్ను, చక్రపాణి మరియు విప్రనారాయణ సినిమాలు ఈ మధ్యన చూడగలిగాను. కాని ఆ సినిమాలలో చాలా పాటలు పూర్తిగా లేవు. ఒక్క విప్రనారాయణ చిత్రంలోని పాటలు (కొన్ని డైలాగులతో కలిసి) హెచ్.ఎం.వి వారు కొంతకాలం క్రిందట విడుదల చేసారు. (సెట్ ఆఫ్ క్యాసెట్స్ క్వాలిటీవైజ్) అవి చాలా బాగున్నాయి. ఇటీవలి కాలంలో హెచ్.ఎం.వి వాళ్ళు లైలామజ్ను పాటల క్యాసెట్ విడుదల చేసారు. కాని అది క్వాలిటీ పరంగా అంత బాగాలేదు. అంతేకాకుండా దాన్లో వున్న అన్ని ఆడియో ట్రాక్సు ఈటీవీ వాళ్ళు వేసిన ప్రింటులో నుండి తీసుకున్నట్టు అనిపించింది. ఆ క్యాసెట్టులో చాలా పాటలు అసంపూర్తిగా వున్నాయి. కొన్ని పాటలలో జంప్స్ వున్నాయి. ఈ సందర్భముగా నేను మిమ్ములను కోరేదేమిటంటే, మీరు ప్రొడ్యూసు చేసిన రత్నమాల, లైలామజ్ను, ప్రేమ, చండీరాణి మరియు చక్రపాణి పాటలను మీరు స్వయంగా పూనుకొని మంచి క్యాసెట్లు రూపంలోను, సి.డి.రూపంలోను (మంచి డిజిటల్ క్వాలిటీతో) విడుదల చేస్తే నా బోటి అభిమానులు చాలా సంతోషిస్తారు. మిమ్మల్ని యింతగా ఎందుకు కోరుతున్నానంటే మీ అభిమానులంతా నా వయస్సులో (60 సం.)ను అంతకంటే ఎక్కువ వయస్సు వున్న వారే. వారిలో చాలామంది చరమాంకంలో వున్న వాళ్ళే. వాళ్ళందరికి కనీసం ఇప్పుడైనా మీ పాటలు విని ఆనందించే అదృష్టం కలిగించమని నా కోరిక.

ఇట్లు,

మీ అభిమాని జె.మధుసూదనశర్మ, హైదరాబాదు

**పి.వి.శేషగిరిరావు, నూజివీడు**

**మీ టిప్స్ కంపెనీ వారు విడుదల చేసే ఆడియో క్యాసెట్లలో ఏ సైడున, బీ సైడున అంటించు కోవడానికి రెండు స్టిక్కర్లు సెపరేట్‌గా ఇచ్చేవారు. ఈ మధ్య వస్తున్న మీ క్యాసెట్లలో ఒకటే స్టిక్కర్ ఉంటోంది. మీరిది గమనించారా.... కారణం ఏమిటి?**



**ఈ ప్రశ్నకు టిప్స్ కంపెనీ జనరల్ మేనేజర్ సేల్స్(సౌత్) శ్రీ జెజె అడ్వానీ సమాధానం ఇలా వుంది.**

మీరన్నది నిజమే. పూర్వం అలా రెండు స్టిక్కర్లు ఇచ్చే వాళ్ళం. క్యాసెట్ పేరు రాసుకోవడానికి ఒక స్టిక్కర్‌ని మాత్రమే అంటించుకొని రెండవ స్టిక్కర్‌ని పారేస్తున్నారని మా సర్వేలో తేలింది. కాస్ట్ ప్రకారం చూసుకుంటే ఒక్కొక్క స్టిక్కర్‌కి 0.25 పైసలు పడింది. ఎలాంటి క్యాసెట్ అయినా మినిమమ్ ఆర్డర్ 10,000 ఉంటుంది. ఇలా పారేయడం వల్ల ప్రతి పదివేల క్యాసెట్ల బంచ్‌కి రూ.2,500/-లు వృధాగా ఎవరికీ ఉపయోగపడకుండా పోతోంది. అంచేత ఒక స్టిక్కర్నే క్యాసెట్ కవర్‌లో ఉంచాలన్న నిర్ణయం తీసుకున్నాము.

**చెరుకు నారాయణ, నాగార్జునసాగర్**

**ఘంటసాల గారి పాటలను రకరకాల కాంబినేషన్‌లతో రిలీజ్ చేసే హెచ్.ఎం.వి. వారు రేపు డిసెంబరు 4 ఘంటసాల గారి జయంతి సందర్భంగా ఏవైనా కొత్త క్యాసెట్లు రిలీజ్ చేసే అవకాశం ఉందా....? ఈ ప్రశ్నకు హెచ్.ఎం.వి వారి ద్వారా మీరు సమాధానాన్ని ఇప్పించినట్లయితే ఘంటసాల అభిమానులమైన మేము ముందుగా రిజర్వు చేసుకుని బల్క్‌లో కొనే అవకాశం ఉంది... కనుక... ప్లీజ్...**



**ఈప్రశ్నకు హెచ్. ఎం.వి.లో తెలుగు క్యాసెట్ల విభాగానికి చెందిన మార్కెటింగ్‌ఎగ్జిక్యూటివ్ శ్రీ శివప్రసాద్ సమాధానం ఇలా వుంది.**

ముందుగా మీ అభిమానానికి థాంక్స్... డిసెంబరు 4 ఘంటసాల గారి జయంతిని పురస్కరించుకుని 'బహుదూరపు బాటసారి' అనే డబుల్ ప్యాక్ క్యాసెట్ విడుదల చేస్తున్నాం. ఘంటసాల గారు గానం చేసిన ఎన్నో ప్రైవేట్ గీతాలలో మీకు తెలిసినవి, బాగా పాపులర్ అయినవే కాక చాలామందికి అందుబాటులో లేని వాటిని కూడా ఈ క్యాసెట్‌లో పొందు పరిచాం. రెగ్యులర్ క్యాసెట్లలా కాకుండా అద్భుతమైన ప్యాకింగ్‌తో ఈ క్యాసెట్‌ను ఆకర్షణీయంగా రూపొందించాం. ఇవన్నీ కాక కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు ముందుమాటగా చెప్పిన ఉపోద్ఘాతం ఆయన స్వంత కంఠంతో ఉండడం ప్రత్యేక ఆకర్షణ. ఈ క్యాసెట్లు ఈ నెలాఖరుకే మార్కెట్లోకి వచ్చేస్తాయి.




తెలుగు సినీ పరిశ్రమనే కాక యావద్భారత చలన చిత్ర రంగాన్ని ఒక్కసారిగా తనవైపు తేరిపార చూసేట్టు చేసుకున్న చిత్రం -

## వినోదావారి

# దేవదాసు



ఈ చిత్రానికి సంగీతం సి.ఆర్.సుబ్బరామన్ అందించారు. అక్కినేని - సావిత్రి నట జీవితంలోను, ఘంటసాల - సముద్రాల (సీనియర్) సంగీత సాహిత్య జైత్రయాత్రలోను అత్యంత ప్రాధాన్యతను సంతరించుకున్న ఈ చిత్రం 1953లో విడుదలయింది. ఈ చిత్రం సంకల్పించినప్పటి నుంచి కురిసిన విమర్శల వర్షం విడుదలయిన తరువాత ప్రశంసల వెల్లువగా మారిపోయింది. అంతటి ప్రాభవాన్ని సంతరించుకోవడానికి గల కారణాలలో వేరులా నిలిచిన సంగీత సాహిత్యాల పాత్రను వేరుచేసి చూడలేం. చిత్రంలో గల పాటలలో కొన్నింటి గురించి ఈసారి:

## దేవదాసు



పల్లెకు పోదాం పారుని చూద్దాం చలో చలో ॥పల్లె॥
అల్లరి చేద్దాం చలోచలో ॥పల్లె॥
ప్రొద్దువాలే ముందుగానే ముంగిట వాలేము ॥ప్రొ॥ ॥పల్లెకు॥
ఆటా పాటలందు కవ్వించు కొంటె కోణంగి ॥ఆటపాట॥
మనసేమో, మక్కువేమో
మనసేమో మక్కువేమో
నగవేమో వగేమో
కనులారా చూతము ॥ పల్లె॥
నన్ను చూడగానె చిననాటి చనువు చూపెనో ॥నన్ను॥
నా దరికి దూకునో, నా దరికి దూకునో
తా నలిగి పోవునో ఏమౌనో చూతము ॥పల్లె॥

ఈ పాటను ఘంటసాల పాడగా అక్కినేని నాగేశ్వరరావు ప్రధాన పాత్రధారిగా అభినయించారు. చరణాల మధ్య ఇంటర్ల్యూడ్స్ వింటుంటే ఒక వెస్ట్రన్ ఆర్కెస్ట్రా పీస్ వింటున్నట్టు ఉంటుంది. ఈనాటికీ నవీనంగా ఉంటే ఆ వైవిధ్యమే ఈ పాట ప్రత్యేకత. స్వరపరంగా చూసుకుంటే ఇది కార్డ్



ఓహొహొ ఓహొ ఓహొహొ ఓహొ
ఆ॥ ఓ ఓ దేవదా
అ॥ ఓ ఓ పార్వతి
ఆ॥ చదువు ఇదేనా, మనవాసి ఒదిలేసి
అసలు దొరల్లె సూటుబూటా? ॥ఓ ఓ దేవదా॥
అ॥ పల్లెటూరి పిల్లకు కులుకు హెచ్చిందె
బదులు పల్కటము పట్టు బడిందె ॥పల్లెటూరి॥
పసికూన సిసలైన జాణా అయ్యిందె బాగోబాగు
॥పసికూన॥ ॥ఓ ఓ పార్వతి॥
ఆ॥ ఉన్నతీరుమారినా, ఊరుమారినా తమరు
ఎన్నటికి పసివారేనా ॥ఉన్నతీరు॥
అ॥ అలనాటి కలలన్నీ వెలుగులయ్యేనా
నిజమైయ్యేనా ॥అలనాటి॥ ॥ఓ పార్వతి॥
ఆ॥ నా ఎదుటే నీ బడాయి
అ॥ జీవితమే ఓ లడాయి
ఆ॥ లడాయిలా సరే మనకు జిలాయిలోయి, జిలాయిలోయ్
లడాయిలా సరే మనకు జిలాయిలోయి, జిలాయిలోయ్
అ॥ ఆనాడు, ఈనాడు ఒకటే మాట, ఉడుకుమోతా ॥ఆనాడు॥
అ॥ ఓ ఓ పిరికి పార్వతి
ఆ॥ ఓ ఓ దుడుకు దేవదా

కాంపోజిషన్. ఘంటసాల గళానికున్న రేంజ్‌ని, సొగసుగా లబ్జుగా వినిపించే నాసికా ధ్వనిని -అతి అందంగా వాడుకున్న పాట ఇది. 'ఆటా పాటలందు కవ్వించు కోణంగి / నన్ను చూడగానే చిననాటి చనువు చూపేను' అనే వాక్యాలు ఏ రేంజ్‌కయినా ఆ రేంజ్‌కయినా అరేంజ్ అవుతూ మాధుర్యాన్ని కోల్పోని ఆయన స్వర పటిమను తెలియచేస్తే - 'నా దరికిదూకునో / తానలిగిపోవునో ' వాక్యాలలోని 'నో' అనే అక్షరాలు ఆయనలో ప్రత్యేకంగా గల 'నాసికాధ్వని సౌందర్యానికి' అద్దం పడతాయి.





అంతా భ్రాంతియేనా
జీవితాన వెలుగింతేనా
ఆశా నిరాశేనా
మిగిలేది చింతేనా
చిలిపి తనాల చెలిమే మరచితివో ॥చిలిపి॥
తలిదండ్రుల మాటే దాట వెరచితివో ॥ తలి ॥
పేదరికమ్మూ ప్రేమపథమ్మూ మూసీ వేసినదా
నా ఆశే దోచినదా
॥అంతా॥
మనసున లేని వారి సేవలతో ॥మనసున॥
మనసీయగ లేని నీ పై మమతలతో ॥మనసీయగ ॥
వంతల పాలై చింతిలుటే నావంతా దేవదా
నా వంతా దేవదా ॥అంతా॥

ఈ పాటను ఘంటసాల, జిక్కి పాడగా మొట్టమెదట 'ఓ హో హో ఓహో' అంటూ వచ్చే ఆలాపన కె.రాణిది. యమన్ రాగచ్ఛాయలతో సాగిన ఈ పాట చరణాల ముందు వచ్చే ఇంటర్లూడ్‌లలో వినిపించే హవాయిన్ గిటార్ నేరుగా మనసునే మీటినంత హాయిగా ఉంటుంది. ఈ పాట సాహిత్యాన్ని ఆసాంతం రెండు మూడుసార్లు గమనిస్తే దేవదాసు, పార్వతి పాత్రల మనస్తత్వాన్ని, ఒకరిపై ఒకరికి గల అభిప్రాయాన్ని, వీలయినంత క్లుప్తంగా నగటు ప్రేక్షకునికి కూడా అర్థమయ్యే సామాన్యమైన భాషలో చెబుతూనే వారి పాత్రలు విడిపోతాయి అనే విషయాన్ని అన్యాపదేశంగా హెచ్చరిస్తున్నట్లు ఉంటుంది.

ఈ పాటను కె.రాణి పాడగా సావిత్రిపై చిత్రీకరించారు. మిశ్ర శివరంజని రాగాన్ని ఆధార రాగంగా చెప్పుకోవాలీ పాటకి. హుషారుగా ఉండే పాటలని, శృంగార గీతాలని పదే పదే పాడుకోగలం కానీ విషాదగీతాలను ఎక్కువసార్లు పాడుకోలేం - గుండె బరువెక్కి వున్న పరిస్థితులలో తప్ప.....! ఈ పాట మాత్రం అటువంటి అనుభూతులకు, అనుభవాలకు ఓ మినహాయింపు. మనసు హాయిగా ఉన్న స్థితిలో సైతం ఈ పాటను పాడుకోవటం జరిగితే రసానుభూతికి ఏ మాత్రం భంగం కలగదు సరికదా మరింత ఆస్వాదించగలం కూడా! అందుకు కారణం సుబ్బరాయన్ ట్యూన్ మాత్రమే కాదు ఇంటర్లూడ్స్ కూడా! అందుకే ఈ పాట ఇవాల్టికీ ఇంటర్‌లూడ్స్‌తో సహా అందరికీ గుర్తుంది.



అ॥ చెలియలేదు చెలిమిలేదు వెలుతురే లేదు ॥చెలియ॥
ఉన్నదంతా చీకటైతె ఉందీ నీవేనే ॥ఉన్నా॥
మిగిలిందీ నీ వేనే ॥చెలిమి॥
ఆ॥ చెలిమిపోయె, చెలువు పోయె, నెలవే వేరాయే ॥చెలిమి॥
చేరదీసి, సేవచేసె తీరు కరువాయె ॥చేరదీసి॥
నీదారె వేరాయె ॥చెలిమి॥
అ॥ మరుపురాని బాధకన్నా మధురమేలేదూ ॥మరపురాని॥ (నవ్వు)
గతము తలచి వగచే కన్నా సౌఖ్యమేలేదు ॥గతము॥
అందరాని పొందుకన్నా అందమెలేదు ఆనందమె లేదు ॥చెలిమి॥
ఆ॥ వరదపాలే చెరువులైన పొరలి పారేనే ॥వరద॥
రగిలిపొగలౌ గుండెలైన పగిలి జారేనే ॥రగిలి॥
దారిలేని బాధతో నేనారిపోయేనా
కథ తీరీ పోయేనా ॥చెలిమి॥
అ॥ ఉన్నదంతా చీకటైతే ఉందీ నీ వేనే
మిగిలిందీ నీ వేనే

ఈ పాటను ఘంటసాల, కె.రాణి పాడగా అక్కినేని నాగేశ్వరరావు, సావిత్రి అభినయించారు. 'దేవదాసు' చిత్రంతోనే సంగీత ప్రియులంతా ఈనాటికీ గుర్తుపెట్టుకునే కె.రాణి పాడిన తెలుగుపాటలు తక్కువే. ప్రస్తుతం ఆమె ఆంధ్రప్రదేశ్‌లోని కడప జిల్లాలో ఉన్నట్టుగా చెప్పుకుంటారు. ఈ పాటలో తొలి స్థానం సాహిత్యందే. 'మరుపురాని బాధ కన్నా మధురమే లేదు / గతము తలచి వగచే కన్నా సౌఖ్యమే లేదు / అందరాని పొందు కన్నా అందమే లేదు / ఆనందమే లేదు' వంటి వాక్యాలు లేదు అప్పుడే కాదు, ఇప్పుడు విన్నా, మరో యాభై సంవత్సరాల తర్వాత విన్నా మనసున్న ప్రతి కంటికీ చెమరింపు ఖచ్చితంగా కలిగి తీరుతుంది. కాలదోషం పట్టని భాషా సౌందర్యాన్ని అందించే సౌలభ్యం, అదృష్టం ఆనాటి రచయితలకుండేది. ఇక సంగీత పరంగా చెప్పుకోవాలంటే...

ఈ పాట మొదలవుతున్నప్పుడు వచ్చే వాద్య సంగీతం వింటే ఆ రోజుల్లో వచ్చే క్లబ్ డాన్సులకు ఉపయోగించే ఆర్కెస్ట్రయిజేషన్‌లా ఉందే అని అనిపిస్తుంది. అలా ప్రారంభమయ్యే ఆ ఆర్కెస్ట్రయిజేషను మెల్లగా విషాదానుభూతిలోకి తీసుకు వెళ్ళిపోతుంది. ఆర్కెస్ట్రా వారికి, అందుకు తగ్గట్టుగా నొటేషన్‌ని (స్వరాలని) చెప్పి, ప్రాక్టీస్ చేయించటం అంత సులువైన విషయమేమీ కాదు. ఈ మాట ఇక్కడెందుకు ఉదహరించాలంటే సంగీత దర్శకుడు సి.ఆర్.సుబ్బరామన్‌కి స్వరం రాసుకునే అలవాటు లేదు. ట్యూన్ ఓసారి గనక మనసులోంచి బైటికి వచ్చి అందరి ఆమోదాన్నీ పొందిందంటే, కొన్ని సంవత్సరాల తర్వాత రికార్డింగ్ పెట్టుకున్నా సరే ఆనాడు అనుకున్న ఆ స్వరం అలాగే అచ్చు గుద్దినట్టు యథాతథంగా వచ్చేది. "విపరీతమైన జ్ఞాపకశక్తి గల మహామేధావి ఆయన" అని అంటారు ఆ రోజుల్లో ఆయనకు సహాయకునిగా పని చేసిన ప్రఖ్యాత సంగీత దర్శకుడు శ్రీ ఎమ్మెస్ విశ్వనాథం ఆనాటి సంగతులు గుర్తుచేస్తే.





కుడి ఎడమైతే పొరపాటు లేదోయ్
ఓడి పోలేదోయ్ ॥కుడి॥
సుడిలో దూకి ఎదురీదకా... ఆ... ఆ... ఆ...
సుడిలో దూకి ఎదురీదకా
మునకే సుఖమనుకోవోయ్ ॥మునకే॥ ॥కుడి॥
మేడలోనే అలపైడి బొమ్మ
నీడనే చిలకమ్మా ॥మేడ॥
కొండలే రగిలే వడగాలి ॥కొండ॥
నీ సిగలో పూవేలోయ్ ॥నీ సిగలో॥ ॥కుడి॥
చందమామ మసకేసి పోయే
ముందుగా కబురేలోయ్ ॥చంద॥
లాయిరి నడి సంద్రములోన ॥లాయిరి॥
లంగరుతో పనిలేదోయ్ ॥లంగరు॥ ॥కుడి॥

ఈ పాటను ఘంటసాల పాడగా అక్కినేని నాగేశ్వరరావు అభినయించారు. కళ్యాణి రాగంలో గల అందాలన్నిటినీ పొందుపరచుకున్న మంచి పాటలలో ఖచ్చితంగా పేర్కొని తీరవలసిన పాట యిది. ముఖ్యంగా 'సుడిలో దూకి ఎదురీదకా' తరువాత వచ్చే ఆలాపనలో గల ఎగుడుదిగుడులు, తారస్థాయిలోనూ, మంద్రస్థాయిలోనూ గాయకుని గళాన్ని రసవత్తరంగా ఆవిష్కరించే చరణాలు, రాగపరంగా పాటకు అమరిన ఆభరణాలు. అందుకే మంచి పాటకు చెవియొగ్గి వినేవారి హృదయాలలో నేటికీ సజీవంగా ఉందీ పాట.

భావ సౌందర్యాన్ని, భాషా సౌందర్యాన్ని గుంభనంగా అందించిన సాహితీ ప్రక్రియ రచనాపరంగా కనిపిస్తుందీ పాటలో. ఉదాహరణకి - తొలి చరణంలో గల 'మేడలోనే అలపైడిబొమ్మ' అనే వాక్యంలో 'పైడిబొమ్మ' అంటే బంగారపు బొమ్మ అని, బంగారానికి పర్యాయపదంగా 'హేమము' అని తీసుకుంటే హేమ అనే పదానికి పార్వతి అనే ఇంకో అర్థం కూడా ఉంది కాబట్టి పాత్రపరంగా సరిపోతుందనీ, అలాగే ఆ తర్వాత వచ్చే 'నీడలో చిలకమ్మా' అనే వాక్యంలో 'చిలకమ్మ'ని చంద్రముఖికి అన్వయించుకోవచ్చని, ఎందుకంటే చిలక ముక్కు అర్థ'చంద్రా'కారంలో ఉంటుంది కనుక ఆ అర్థచంద్రాకారం ముఖంలో గల 'చిలకమ్మ' చంద్రముఖికి సరిగ్గా సరిపోతుందని సాహితీ పరిశోధకుడు ఆరుద్ర విశ్లేషిస్తే "భలేగా పట్టేవే...?" అంటూ ఆయన గురువు మల్లాది రామకృష్ణ శాస్త్రి మెచ్చుకున్నారట.

'సుడిలో దూకి ఎదురీదకా మునకే సుఖమనుకోవోయ్', 'లాయిరి నడి సంద్రములోన లంగరుతో పని లేదోయ్' లాంటి వాక్యాలు అటు తాగుబోతు నిస్పృహాయ మనఃస్థితికి ఎంతగా అద్దం పట్టేయో, ఇటు వేదాంతపరంగా అంతు పట్టని లోతులతో -మనలోని ఆధ్యాత్మిక భావాలు గానీ, సహేతుకమైన సంఘర్షణలు గానీ చెలిమి చేసే విధంగా అర్థాన్ని సూచ్యప్రాయంగా ధ్వనిస్తాయి.

ఇక ఇతర విలువల గురించి చెప్పాలంటే 'చందమామ మసకేసిపోయే ముందుగా కబురేలోయ్' దగ్గర అక్కినేని చూపిన అభినయం, మొత్తం పాటలోనూ... ముఖ్యంగా 'కొండలే రగిలే వడగాలి' దగ్గరా ఛాయాగ్రాహకుడు బి.యస్.రంగా (తర్వాతి రోజుల్లో 'విక్రమ్ ప్రొడక్షన్స్' పతాకంపై నిర్మాత-దర్శకుడు గా 'అమరశిల్పి జక్కన' వంటి కళాఖండాల్ని తీశాడీయన) చూపిన లైట్ అండ్ షేడ్స్... ఈ పాట ఎప్పుడు గుర్తొస్తే, అప్పుడు కళ్ళ ముందు కదలాడే విధంగా జీవం పోశాయి.

ఇవన్నీ ఇలా ఉండగా ఈ పాటపై సముద్రాల (జూనియర్) ఒక సందర్భంలో వెల్లడించిన అభిప్రాయాన్ని ఆయన మాటల్లోనే చూడండి.

"దేవదాసులోని పాటలన్నీ మేలిమి బంగారు తునుకలు. ఆ పాటలే పిక్చరుకు ప్రాణం. నాగేశ్వరరావు గారి నటనకు ఘంటసాల తన గొంతుతో ఊపిరి పోశాడు. ఆ పాటలన్నీ ఘంటసాల ఎంతో తాదాత్మ్యంతో పాడేడు. అందులో నాకు అతి ప్రియమైన పాట "కుడి ఎడమైతే"! ఈ పాటకి అర్థమేమిటని నాన్న (సముచిత సీనియర్)నడిగితే కొందరికి ఆయన చెప్పారు.

కుడి ఎడమైతే పొరపాటు లేదోయ్-తానొకటి తలిస్తే దైవమొకటి తలచింది. అది జీవితంలో సహజం. అంతమాత్రాన ఓడిపోయాననుకోకు. పార్వతి తనదే అనుకున్నాడు దేవదాసు. కాని ఆమె అతనికి దక్కలేదు. ఆ బాధని మర్చిపోవాలని త్రాగుడు ప్రారంభించాడు. అది ఒక సుడిగుండం. అలవాటు పడితే బయట పడడం కష్టమని తెలిసి కూడా ఈ సుడిగుండంలోకి దూకాడు. అప్పుడు ఎదురీత తెలివి తక్కువ. మునిగి పోవడమే సుఖం. సుడిలో దూకి ఎదురీదక మునకే సుఖమనుకోవోయి -ఇలా తప్ప తాగుతూ జీవితం ముగించుకో! పార్వతి మేడ మీద ఉన్న బంగారు బొమ్మ. చేతికి చిక్కదు. నీవు పిలిస్తే పలికే చంద్రముఖి నీ నీడలోనే ఉంది. 'మేడలోనే అలపైడి బొమ్మ నీడనే చిలకమ్మా!'. కానీ నీ పరిస్థితి ఏమిటి? కొండలే రగిలే వడగాలి నీ సిగలో పూలేవోయి ఎందుకీ ప్రాణాలు? తప్పతాగి జీవితం చాలించు. చావటానికే నిర్ణయించుకున్న తర్వాత ఎవరికి చెప్పవలసిన పనిలేదు. చందమామ మసకేసి పోయేముందు కబురేలోయి. నీ బ్రతుకు నడిసముద్రపు నావలాగున్నది. మునిగి పోవడానికి సిద్ధంగా ఉండు. ఒడ్డున ఉండే నావకి లంగరు కాని నడి సముద్రంలో మునిగిపోయే నావకు లంగరు ఎందుకు? లాయిరి నడి సముద్రములో లంగరుతో పని లేదోయి ఇది దేవదాసు మానసిక పరిస్థితి. మా నాన్నగారు ఇంత సింబాలిజమ్‌తో పాట రాశారు. సుబ్బరామన్ అంత ఆవేశంతో పాట స్వరపరిచేరు. కవితా హృదయాన్ని అందిపుచ్చుకుని అంత ఆర్తితో అనుభవించి పాడుతూ ఆ అనుభూతి శ్రోతలలో కల్గించే నేర్పరి ఘంటసాల".



జగమే మాయ బ్రతుకే మాయ
వేదాలలో సారమింతేనయా
జగమే మాయ బ్రతుకే మాయ
వేదాలలో సారమింతేనయా
ఈ వింతేనయా ॥జగమే॥
కలిమి లేములు కష్టసుఖాలు ॥కలిమి॥
కావడిలో కుండలని భయమేలోయి
కావడిలో కుండలని భయమేలోయి
కావడి కొయ్యేనోయ్ కుండలు మన్నేనోయ్
కనుగొంటే సత్యమింతేనోయి
ఈ వింతేనోయి ॥కావడి॥ ॥జగమే॥
ఆశా మోహముల దరి రానీకోయి ॥ఆశా॥
అన్యులకే నీ సుఖము అంకితమోయి
అన్యులకే నీ సుఖము అంకితమోయి
బాధే సౌఖ్యమనే భావన రానీవోయ్
ఆ ఎరుకే నిశ్చలానందమోయ్
బ్రహ్మానందమోయ్ ॥బాధే॥ ॥జగమే॥

ఈ పాటను ఘంటసాల పాడగా అక్కినేని నాగేశ్వరరావు అభినయించారు. తెలుగు చలన చిత్ర సంగీత చరిత్రలోనూ, తెలుగు వారి జీవితాలలోనూ శాశ్వత స్థానం సంపాదించుకున్న పాట యిది. 'దేవదాసు' సినిమాకు ముందు ఎలా వ్యవహరించారో గానీ, తాగి ఒళ్ళు గుల్ల చేసుకున్న వారిని 'దేవదాసు' అని పిలవటం పరిపాటిగానూ, పీకలదాకా తాగిన వాడు సైతం అంత మైకంలోనూ 'జగమే మాయ' పాటని ఆలపించటం ఓ అలవాటు గానూ మారిపోయింది. అఫ్‌కోర్స్... ఆ తాగిన వాడు తెలుగు వాడైతేనే...! జనంలోకి ఈ పాట నటనాపరంగా కూడా అంత గాఢంగా ముద్ర వేసుకోబట్టి, తరువాతి రోజుల్లో తను సంగీత కచ్చేరీలు ఎక్కడ చేయవలసి వచ్చినా "ఆ దగ్గు కూడా నాదే బాబూ'' అంటూ చెప్పుకునేవారు ఘంటసాల.

కొన్ని కొన్ని విషయాలు వయసు పెరిగిన కొద్దీ, అందుకు తగిన అనుభవాలు జీవితానికి జమ అవుతున్న కొద్దీ మరింత అవగాహనతో అవగతమవుతూ ఉంటాయి. దేశకాలమాన స్థితిగతులకు అతీతమైన అటువంటి విషయాలలో ఈ పాట సాహిత్యం కూడా ఒకటి. అందుకు ఎవరి అనుభవమే వారికి సాక్ష్యం. 'బాధే సౌఖ్యమనే భావన రానీవోయ్/ఆ ఎరుకే నిశ్చలానందమోయ్/ బ్రహ్మానందమోయ్' అనే వాక్యాలని జీవితకాలంలో ఒక్కసారైనా నెమరు వేసుకోని తెలుగువాడు ఉండడేమో బహుశా...! ఏది ఏమైనా 'జగమే మాయ' పాటకుండే ఆయుఃప్రమాణం ఇంకే పాటకీ లేదంటే అతిశయోక్తి కాదేమో...!?

ఈ సినిమాకు సంబంధించినంత వరకూ సంగీత దర్శకుడు సి.ఆర్.సుబ్బరామన్ గురించి కొంత చెప్పుకుని తీరాలి. ఈ చిత్ర నిర్మాణం సగంలో ఉండగా తన **29**వ ఏటనే హఠాన్మరణం చెందిన సుబ్బరామన్ మృతిపై రకరకాల ఊహాగానాలున్నాయి. ఎందుకంటే ఆయన 'వినోదా' సంస్థలో వాటాదారు కూడా. ఈ నిజాన్ని ఆయన హఠాన్మరణ సంఘటనకు జోడించి - వాళ్ళ మధ్య వ్యాపార పరమైన విభేదాలు వచ్చాయని, కొందరు కిట్టని వాళ్ళు చేసి విషప్రయోగానికి ఆయన బలైపోయారని చెప్పుకుంటూ ఉంటారు. ఆయనకు చిన్నతనం నుండే తరచూ ఫిట్స్ వచ్చేవి. ఆ ఫిట్సే ఆయన గుండె మీద పనిచేసి ఆయన్ని పరలోకానికి తీసుకువెళ్ళిపోయాయి. ఈ విషయాన్ని ప్రముఖ సినీ నటుడు, రచయిత, నాటక కర్త అయిన రావి కొండలరావు వెల్లడించారు. ఒక జర్నలిస్ట్‌గా పత్రికా నిర్వహణ బాధ్యతను కూడా నిర్వర్తించారు గనుక ఆయన మాటలను మనం విశ్వసించవచ్చు.

సి.ఆర్.సుబ్బరామన్‌కు అసిస్టెంట్‌గా వ్యవహరించిన ఎమ్మెస్ విశ్వనాథమ్ ఆయన ఒప్పుకున్న చిత్రాలన్నిటినీ ఎంతో చిత్తశుద్ధితో, నిజాయితీ గల గురుభక్తితో -వయొలినిస్ట్ టి.కె.రామమూర్తి సహాయంతో పూర్తి చేశారు. ఆనాటి ఆ ఎమ్మెస్ విశ్వనాథమ్, టి.కె.రామమూర్తి కలిసి దర్శకత్వం కొన్నాళ్ళపాటు 'విశ్వనాథం-రామ్మూర్తి' పేరు మీద జంటగా చాలా చిత్రాలకు సంగీత దర్శకత్వం వహించారు. 'దేవదాసు'కి సంబంధించినంత వరకూ - ఆ సినిమా రీరికార్డింగ్‌తో పాటు, 'అందం చూడవయా' పాటని, 'జగమే మాయ' పాటనీ ఎమ్మెస్ విశ్వనాథమే స్వరపరిచారు.

తానే మారెనా గుణమ్మే మారెనా
దారీ తెన్ను లేనే లేక ఈ తీరాయెనా ॥తానే॥
తొలిచూపు నాటి రూపు మారే
ధోరణి మారే ॥తొలిచూపు॥
నిలువెల్లా మెల్లనాయె నిట్టూర్పే తుదాయే
ఏదీ లేని పేదై పోయి ఈ తీరాయెనా ॥తానే॥
వలపు తీరు ఈ తీరౌనా .. ఆ... ॥వలపు॥
మా చెలిమి కలలో పెన్నిధానమా... ఆ... ఆ... ఆ...
పెను చీకటైన జీవితానా వెల్గిన జ్యోతీ ॥తానే॥
మధుపాయే మాసిపోగా అంతమ్మే ఫలమ్మా
ఏరీ కోరు ఉల్లాసాలు ఈ తీరాయెనా ॥తానే॥
నా సేవలకు ఇంతే వరమా... ఆ... ॥నా సేవ॥
నాకిదే కడసారి దరిశనమా... ఆ... ఆ... ఆ...
అడియాస పాలు చేసినారు కోరినవారు ॥అడియాస॥
మనసైన చేరలేని ఈ దాసీ ఇటాయే
గాలీ మేడ కూలీపోయి ఈ తీరాయెనా ॥తానే॥



ఈ పాటను రావు బాలసరస్వతి దేవి పాడగా చంద్రముఖి పాత్రను ధరించిన లలిత అభినయించారు. రాజ్‌కపూర్ తీసిన 'జిస్ దేశ్‌మే గంగా బెహతీ హై' సినిమా హీరోయిన్ అయిన పద్మినికి స్వయాన అక్కగా, నేటి ప్రముఖ నటి శోభనకు మేనత్తగా పరిచయం చేస్తేనే లలిత అంటే ఎవరో ఈ తరం వారికి కూడా అర్థం అవుతుంది.

సంగీతపరంగా ఈ పాటలో చెప్పుకోదగ్గ విషయాలు కొన్ని ఉన్నాయి. కళ్యాణి రాగాన్ని మిశ్రమం చేసి వాడుకున్నారీ పాటలో. మొదటి చరణంలో గల 'మా చెలిమి కలలో పెన్నిధానమా' దగ్గర, రెండవ చరణంలో గల 'నాకిదే కడసారి దరిశనమా' దగ్గర వచ్చే ఆలాపనలను -'కుడి ఎడమైతే పొరపాటు లేదోయ్' పాటలో 'సుడిలో దూకి ఎదురీదకా' తర్వాత ఆలాపనతో పోల్చుకుని చూడండి. రెండూ ఒక్కలాగే ఉంటాయి. అలాగే ఇంకా జాగ్రత్తగా గమనిస్తే...'పల్లెకు పోదాం పారుని చూదాం' పాటను పాడుకుంటూ ఆ పాటలో వచ్చే 'కనులార చూతము', 'ఏమౌనో చూతము' అనే వాక్యాలని ట్యూన్‌తో సహా మినహాయించేసుకొని దానికి 'దారీ తెన్ను లేనేలేక ఈ తీరాయెనా' లైనుని ట్యూన్‌తో సహా కలుపుకొని పాడుకొని చూడండి. ఈ 'తానే మారెనా' పాట ఎలా అతి చక్కగా అతికిపోతుందో తెలుస్తుంది.



'దేవదాసు' చిత్రం ముహూర్తం రోజున ...వేదాంతం రాఘవయ్య, డి.ఎల్.నారాయణ, సి.ఆర్.సుబ్బరామన్, సముద్రాల రాఘవాచార్య

పైన ఉదహరించిన పాటలేకాక మరో నాలుగు మంచి పాటలు కూడా ఉన్నాయి 'దేవదాసు'లో. ఈ సినిమాలోని పాటల సాహిత్యాన్ని క్షుణ్ణంగా వంటబట్టించుకుంటే - ఆ అవగాహన ఎటువంటి వారికైనా తమ జీవితకాలంలో ఒక్కసారైనా అనుభవంలోకి రాకుండా ఉండదు! అందుకే వినోదా వారి 'దేవదాసు' తెలుగు చలనచిత్ర చరిత్రలో అజరామరంగా నిలిచిపోయింది.

# ఆమె గానం పరవశం జీవితం స్వరవశం

## వాణీ జయరాం



లతా మంగేష్కర్, ఆశాభోంస్లే తర్వాత 1970 నుంచీ ఓ పదిహేనేళ్ళపాటు అటు ఉత్తరాదిన, ఇటు దక్షిణాదిన ఒకేసారి విపరీతమైన క్రేజ్‌ని సంపాదించుకున్న గాయని వాణీ జయరాం. ఆమె గళ మాధుర్యానికి, హుందాతనానికి ఎంతటి వారైనా పరవశులు కావాల్సిందే. 'బ్రోచే వారెవరురా' అని 'శంకరాభరణం'లో పాడినా, 'ఆలోకయే శ్రీ బాలకృష్ణం' అని హృదయానికి 'శృతిలయలు' నేర్పినా, 'మిన్నేటి సూరీడు వచ్చెనమ్మా' అంటూ తన గళాన్ని 'సీతాకోక చిలుక'లా శ్రోతల మనో వీధుల్లో ఎగురవేసి, 'కురిసేను విరిజల్లులే' అంటూ 'కమ్మని కంఠంతో కలల 'ఘర్షణ' చేసినా ఆమెకే చెల్లింది. అసాధారణమైన ప్రతిభ కల్గినఆమె నిరాడంబరతకే ఎక్కువ ప్రాధాన్యతనిస్తారు.

బిడ్డ పుట్టగానే ఎవరింట్లో అయినా నరే పండుగ వాతావరణం కనిపిస్తుంది. అందుకు భిన్నమైనది వాణీ జయరాం జననం. 1924లో వెల్లూరులో ఆమె పుట్టినప్పుడు వాళ్ళ నాన్న గారిలో నిరుత్సాహమే తప్ప పుత్రికోత్సాహం లేదు. ఎందుకంటే ఐదో సంతానమైనా మగపిల్లాడవుతాడని ఆయన ఊహించారు.

ఆమె పూర్తిపేరు 'కలైవాణి'. గత జన్మలో ఆమె కుమారస్వామిని తేనెతో పూజ చేయడం వల్లనే మంచి స్వరంతో పుట్టిందని జ్యోతిష్కులు ఆమెకాపేరు సూచించారు.

తల్లి పద్మావతి వద్దనే సంగీతంలో తొలి పాఠాలు నేర్చుకున్న వాణి-కడలూరు శ్రీనివాస అయ్యంగార్ వద్ద ముత్తుస్వామి దీక్షితుల రచనల్లో ప్రావీణ్యం గడించింది. ఆ తర్వాత శెమ్మాంగుడి శ్రీనివాస అయ్యర్, జి.ఎన్. బాలసుబ్రమణ్యం వద్ద శిష్యరికం చేసింది. మూడేళ్ళ వయసునాటికే వివిధ రాగాల మధ్య వుండే భేదాలను గుర్తుపట్టేదామె.

సంగీతం పట్ల ఆమె ఆసక్తిని గమనించి ఇంట్లోవాళ్ళు కర్ణాటక సంగీతం నేర్చుకోమని ప్రోత్సహించారు. అయితే వాళ్ళ నాన్నగారికి సినీ సంగీతం వినటం ఇష్టం వుండేది కాదు. అందుకే వాణి రేడియో వాల్యూమ్ తగ్గించి వివిధ భారతిలో తనకు ఇష్టమైన పాటలు దొంగచాటుగావినేది.

కళాకారిణులకు వివాహమనేది వారి కెరీరియర్‌కు ఒక్కోసారి పెద్ద అవరోధంగా నిలుస్తుంది. కానీ వాణికి గాయనిగా పెళ్ళి ఓ టర్నింగ్ పాయింట్ అయ్యింది. సినిమాలకి గాయనిగా ప్రయత్నిస్తానంటే -'పెళ్ళయ్యాక మీ ఆయన ఒప్పుకుంటే ప్రయత్నించుకో' -అని అడ్డు చెప్పారు కుటుంబసభ్యులు. 1968లో జయరాంతో పెళ్ళయ్యాక ఆయన ప్రోత్సాహంతో సినిమాల్లోకి గాయనిగా ఎంటరయ్యిందామె.

ముంబై బ్యాంకు ఉద్యోగి అయిన జయరాంకు సంగీతమంటే ప్రాణం. అప్పట్లో ఆయన పండిట్ రవిశంకర్ వద్ద సితార్ నేర్చుకునేవారు. భర్త, అత్తగార్ల ప్రోత్సాహంతో అబ్దుల్ రహమాన్ దగ్గర హిందుస్థానీ సంగీతం నేర్చుకుంది వాణీజయరాం.

వాణి మొదట్లో ఎక్కువగా టుమ్రీలు, భజనలు, గజళ్ళను ఆలపించేది. ఈమె రాగానికి పులకించి ప్రముఖ సంగీత దర్శకుడు వసంతదేశాయ్ మరాఠీ భజనలు రికార్డ్ చేయించుకున్నారు. ఈ నేపథ్యంలోనే ఆయన సంగీత దర్శకత్వం వహించిన వాణికి హృషీకేష్ ముఖర్జీ 'గుడ్డీ' (1970) సినిమాలో అన్ని పాటలూ పాడే అవకాశం లభించింది. అందులో 'బోలో రే పప్పీ హరా..' బహుళ ప్రజాదరణ పొందడమే గాకుండా, పేరొందిన తాన్‌సేన్ అవార్డుతో పాటు మరో ఐదు అవార్డులను సంపాదించి పెట్టింది.

తెలుగు, హిందీ, తమిళ, కన్నడ, ఒరియా, గుజరాతీ, మరాఠి, బెంగాలీ, భోజ్‌పురి తదితర 14 భాషలకు చెందిన పాటలను సుమారు ఎనిమిది వేల పైచిలుకు పాడిందామె. ఏ భాష పాటనైనా ఆమె అవలీలగా పాడగలదు. అందులోని పట్టును సులభంగా గ్రహించే శక్తి, నేర్పు ఆమెకున్నాయి.

తెలుగు టి.వి. సీరియల్స్‌లో కూడా పాడి నంది అవార్డునందుకున్న సినీగాయని వాణీజయరాం.

తులసీదాస్, కబీర్, సూర్‌దాస్, మీరా, జయదేవ, తుకారం భజనలు ఆలవించడానికి ఎక్కువిష్టపడే వాణి జయరాం ప్రస్తుతం ఓ రికార్డింగ్ స్టూడియోని నడుపుతోంది.

ఆమెకొచ్చిన అవార్డుల లిస్ట్ తక్కువేమీ కాదు. 'అపూర్వ రాగం గళ్' చిత్రంలోని 'ఏళు స్వరంగళుక్కుళ్' అనే శాస్త్రీయ గీతానికి 1976లో రాష్ట్రపతి అవార్డు లభించింది. 1970లో 'గుడ్డీ' చిత్రం ద్వారా తొలిసారి జాతీయ అవార్డురాగా, 1980లో 'శంకరాభరణం' చిత్రంలోని 'మానస సంచరరే' పాటకు రెండోసారి జాతీయ అవార్డు లభించింది. ఆ ఏడాదే పండిట్ రవిశంకర్ 'మీరా' చిత్రానికి ఉత్తమ గాయనిగా ఫిలింఫేర్ అవార్డు, తిరిగి 1992లో కె.విశ్వనాథ్ 'స్వాతికిరణం' చిత్రంలోని 'ఆనతినీయరా హరా' పాటకు మూడోసారి జాతీయ ఉత్తమ గాయనిగా నిలిచిందామె.

ప్రస్తుతం సినిమా పాటలకు దూరంగావుండి శాస్త్రీయ సంగీత కచేరీలపైనే ఎక్కువ దృష్టి నిలుపుతున్న వాణీ జయరాం ప్రైవేటుగా 'గీత గోవిందం', ఆది శంకరుని 'ఆనందలహరి' అనే కేసెట్టును విడుదల చేసింది.

వాణీజయరాం మంచి గాయని మాత్రమే కాదు, చక్కని చిత్రకారిణి కూడానూ.

వాణీ జయరాం మొట్టమొదటి కచేరి 1969లో జరిగింది. మనదేశంలోనే కాకుండా తూర్పు, పశ్చిమ దేశాల్లో కూడా ఆమె కచేరీలు నిర్వహించింది. ముఖ్యంగా యూరోప్‌లో ఆమె చేసిన కచేరీలకు బ్రహ్మాండమైన స్పందన లభించింది.

ఎకనామిక్స్‌లో డిగ్రీ చేసిన వాణీ జయరాం కొన్నాళ్ళు బ్యాంకులో ఉద్యోగం చేసింది కూడా!

-శ్రీవిక్రమ్







నవంబరు 30 శ్రీమతి వాణీజయరాం
జన్మదిన సందర్భంగా
సంగీత ప్రియులందరి తరపున
శుభాకాంక్షలతో... హాసం

సురేష్ ప్రొడక్షన్స్ సమర్పించు



శ్రీ స్రవంతి మూవీస్

# నువ్వు నాకు నచ్చావ్!

*... the new love story*

dts

"స్రవంతి" రవికిషోర్ విజయభాస్కర్.కె కోటి

Krishna